ఆంధ్రప్రదేశ్ నూతన శాసనసభ తొలి ఉపసభాపతి

## శ్రీ మండలి బుద్ధప్రసాద్

# సేవాయానం

### అభినందన సంచిక






2007 సెప్టెంబరు 21,22,23 తేదీలలో విజయవాడలో కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను ప్రారంభించిన నాటి రాష్ట్ర గవర్నర్ శ్రీ నారాయణ దత్ తివారి, వజ్రభారతి గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న కేంద్ర మంత్రి శ్రీమతి దగుపాటి పురంధేశ్వరి, జ్ఞానపీఠ బహుమతి గ్రహీత ఆచార్య సి. నారాయణ రెడ్డి, గౌరవాధ్యక్షులు శ్రీ మండలి బుద్ధప్రసాద్, కార్యనిర్వాహక అధ్యక్షులు ఆచార్య యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్ ప్రభృతులు.



ఉపసభాపతిగా ఎన్నికైన సందర్భంగా ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు గారి అభినందన



శాసన సభ్యుల శిక్షణా సదస్సులో ముఖ్యమంత్రి శ్రీ నారాచంద్రబాబు నాయుడు, లోక్ సభా స్పీకర్ శ్రీమతి సుమిత్రా మహాజన్,
మైనార్టీ వ్యవహారాల కేంద్ర మంత్రి శ్రీమతి నజ్మా హెప్తుల్లా గార్లతో శ్రీ బుద్ధప్రసాద్

నవ్యాంధ్రప్రదేశ్ నూతన శాసనసభ తొలి ఉపసభాపతి

**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

అభినందన సంచిక

# సేవాయానం

సంపాదకులు

శ్రీ గుత్తికొండ సుబ్బారావు

డా. జి. వి. పూర్ణచందు

ప్రచురణ

**కృష్ణాజిల్లా రచయితల సంఘం**

ప్రచురణ సౌజన్యం....

లయన్ **ఐ. రామకుమార్** పి.ఎం.జె.ఎఫ్

**విక్టరీ పబ్లిషర్స్**

# 30-17-18, వారణాశివారి వీధి, సీతారాంపురం, విజయవాడ-2. ఫోన్ : 2444156.

# SEVA YAANAM

A collection of Felicitations, accomplishments and Achievements of

**Sri Mandali Buddhaprasad**

***Editors :***

**Sri Guttikonda Subbarao**
**Dr. G.V. Purnachand**

Released on 27th July, 2014

***Published by***

**Krishna District Writers Association**
Satnam Towers, Opp: Buckingham Pet HPO,
Governorpet, Vijayawada-520 002
**e-mail: Purnachandgv@gmail.com**
**guttikondasubbarao@gmail.com**
**Cell: 9440172642, 94401767697**

***Published in Association with***

Ln. I. **Rama Kumar** PMJF,
President
Tirumala Tirupathi Devasthanam,
Dharma Prachara Mandali,
Krishna District.

**VICTORY PUBLISHERS**
# 30-17-18, Varanasivari Street,
Sitharamapuram,
**VIJAYAWADA** - 520 002,
Phone : 0866 - 2444156

2

# శ్రీ మండలి బుద్ధప్రసాద్
# అపురూప వ్యక్తిత్వం, అరుదైన కార్యసాధకత

పరిశ్రమ, తెగువ, ధైర్యం, బుద్ధి, బలం, పరాక్రమం ఈ ఆరూ ఉన్నవాడికే దైవం సాయపడుతుందని ఆర్యోక్తి. జాతికైనా, వ్యక్తికైనా ఇదే సూత్రం వర్తిస్తుంది. తెలుగు జాతి కష్టకాలంలో ఉన్న సమయంలో ఈ ఆరూ ఆరు ముఖాలుగా ఉన్న శ్రీ బుద్ధప్రసాద్ లాంటి షణ్ముఖుల ఆవశ్యకత ఈనాడు ఎంతైనా ఉంది.

తదేకత, ఏకనిష్ఠత, ఏకాగ్రత లాంటి పదాలు పెట్టని కిరీటాల్లా సహజ లక్షణాలుగా భాసించే ఒక అపురూప వ్యక్తిత్వం శ్రీ బుద్ధప్రసాద్ స్వంతం. మహర్షులందరూ ఒక ఎత్తూ, అగస్త్యుడొకరూ ఒక ఎత్తూ అన్నట్టుగా ఈనాటి సామాజిక, రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థల్లో శ్రీ బుద్ధప్రసాద్ ఒక్కరూ ఒక ఎత్తు. రాజనీతిజ్ఞత ఆయన ప్రవృత్తి. తెలుగు భాషా సంస్కృతుల అభ్యున్నతి ఆయన మనోధర్మం. ప్రజాభిమానం, దేశాభిమానం త్రివేణీ సంగమంలా ఆయనలో మూర్తీభవించాయి.

## అపురూప వ్యక్తిత్వం :

దార్శనికుడయిన తండ్రి, సంస్కృతి ప్రతిబింబమైన తల్లి, తెలుగుదనం నిండిన కుటుంబం, గాంధేయ వాదం, గాంధీనాదం ప్రతిధ్వనించే ఇల్లు... పుట్టిన నాటి నుండీ పెరిగిన, ఎదిగిన జాతీయతా భావం, అన్నీ కలగలసి రూపొందిన శ్రీ బుద్ధప్రసాద్. శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారి ఆలోచనల్లోంచి, ఆచరణల్లోంచి, ఆకాంక్షల్లోంచి అంకురించి, తండ్రిని మరిపించిన తనయుడిగా ఎదిగారు.

కాపు సామాజిక వర్గానికి చెందిన శ్రీ బుద్ధప్రసాద్ 26 మే 1956న కృష్ణాజిల్లా నాగాయలంకలో జన్మించారు. బి.యే. చదివారు. భార్య శ్రీమతి విజయలక్ష్మి, ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు.

శ్రీ బుద్ధప్రసాద్‌లో విలువలు నిండిన, నిబద్ధత కలిగిన ఒక రాజనీతిజ్ఞుడు, ఒక దార్శనికుడు కనిపిస్తాడు. అంతేకాదు, ఆయనలో ఒక మంచి విమర్శకుడు తొంగి చూస్తాడు, భాషావేత్త పలకరిస్తాడు, చక్కని వచనం రాసే పత్రికా రచయిత భాసిస్తుంటాడు. చక్కగా విడమరిచి వివరించి చెప్పగల వచోవైభవం ఆయనలో తారట్లాడుతుంటుంది. వీటన్నింటికి మించి, ఆయనలో ఒక చరిత్రవేత్త ఈ జాతి పుట్టుపూర్వోత్తరాలు తడిమి చూస్తుంటాడు.

తాతగారు కీ.శే. మండలి వెంకట రామయ్యగారు గాంధీ సిద్ధాంతాలకు ప్రభావితులు. ఉపాధ్యాయులు రెండు దశాబ్దాలకు పైగా కృష్ణాజిల్లా భావదేవరపల్లి సర్పంచ్‌గా పనిచేసారు. తండ్రి కీ.శే. మండలి వెంకట కృష్ణారావు ప్రఖ్యాత గాంధేయవాది, కృష్ణాజిల్లాలో పేరొందిన గత తరం ప్రజానాయకులు. 1972 'జై ఆంధ్ర' ఉద్యమ కాలంలో కరుడుగట్టిన సమైక్యవాదిగా ఎదురీది నిలిచారు. అవనిగడ్డ సమితి ప్రెసిడెంట్‌గా, కృష్ణాజిల్లా పరిషత్ అధ్యక్షులుగా, లోకసభ సభ్యుడిగా, అవనిగడ్డ శాసనసభ్యుడిగా మూడు పర్యాయాలు రాష్ట్ర మంత్రిగా (సాంఘిక సంక్షేమం, విద్య, సాంస్కృతిక, సహకార శాఖామాత్యునిగా) పనిచేశారు. గాంధీ సిద్ధాంతాల అనుసరణ కోసం 'గాంధీ క్షేత్రం' వ్యవస్థాపించారు. 1975 మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు 1981 మలేషియా రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించారు. 1977 దివిసీమ ఉప్పెన సమయంలో వారి సేవలు నిరుపమానం.

## బాల్యంలోనే వికసించిన భాషాభిమానం :

ప్రజాసేవ, భాషా సాంస్కృతిక సేవా రంగాల్లో శ్రీ బుద్ధప్రసాద్ తండ్రి స్ఫూర్తిని పుణికి పుచ్చుకున్నారు. 1997 పెనుతుఫాను బాధితులకు విరామం లేకుండా సేవలందించారు. 25.8.1975న హైదరాబాద్‌లో ఆనాటి భారత రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభించిన పిల్లల జాతీయ సదస్సులో ఆంధ్రప్రదేశ్ ప్రతినిధిగా పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమీ ఏర్పాటుకు విశేష కృషి చేశారు. "బాల" పత్రికాసంపాదక మండలిలో ఉన్నారు. 1975లో జరిగిన మొదటి ప్రపంచ తెలుగు మహాసభల్లో పిల్లల సాంస్కృతిక కమిటీ సభ్యుడిగా ఉన్నారు.

## సేవా కిశోరం :

శ్రీ బుద్ధప్రసాద్ 1979లో దివిసీమ దీనజన సంక్షేమ సమితిని వ్యవస్థాపించి కార్యదర్శిగా కొనసాగారు. 1982 నుండి గ్రామీణ యువజన వికాస సమితి వ్యవస్థాపక అధ్యక్షునిగా, జాతీయ సమైక్యతా, మతసామరస్య సాధనకై సదస్సులు, సాంస్కృతిక కార్యక్రమాలు, నాటకోత్సవాలు నిర్వహించారు. భారత ఫ్రెండ్‌షిప్ ఫోరం వారి 'భారత ఎక్సలెన్సు అవార్డు' అందుకున్నారు.

గాంధేయ సమాజ సేవాసంస్థ (గాంధీ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సోషల్ సర్వీస్) కార్యదర్శిగా పనిచేశారు. సునామీ బాధితులకు సహాయ పునరావాసాలు కల్పించారు. జర్మనీ నిధులు తెప్పించి తుఫాను షెల్టర్లను నిర్మింపచేశారు.

తెలుగు భాష అన్ని విధాల నిరాదరణకు గురై స్తబ్దుగా ఉన్న కాలంలో, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి నడుం బిగించి, ప్రజల గుండె తలుపులు తట్టారు. ఇంటిభాషగా, బడిభాషగా, ఏలుబడి భాషగా తెలుగు అమలు కోసం అనేక పోరాటాలు చేశారు. వేలాది భాషాభిమానుల్ని ముందుకు నడిపించారు, ఇప్పుడు ప్రజలు తెలుగులో మాట్లాడటాన్ని ఒక గౌరవనీయ అంశంగా భావించుకుంటున్నారంటే, అది బుద్ధప్రసాదు గారి విజయమే!

- తెలుగువారి తొలి రాజధాని శ్రీకాకుళంలో 2002 నవంబరు 1,2 తేదీలలో తెలుగు భాషోద్యమ సమాలోచన శిబిరాన్ని నిర్వహించి తెలుగు భాషోద్యమానికి శ్రీకారం చుట్టారు.
- రాష్ట్రంలోని అన్ని పాఠశాలలో ఏ మాధ్యమంలో ఏ పాఠ్యప్రణాళికని అనుసరిస్తున్నప్పటికీ ప్రాథమికస్థాయిలో విద్యార్థులకు తెలుగు తప్పనిసరిగా నేర్పించాలని కోరుతూ 21-3-2003న శాసనసభ్యుడిగా శ్రీ బుద్ధప్రసాద్ అసెంబ్లీలో ఒక అనధికార తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. నాటి ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు సానుకూలంగా స్పందించటంతో జీవో నెం. 86 విడుదల అయ్యింది. అక్షరాభ్యాసం నుంచి 10వ తరగతి వరకూ తెలుగు తప్పనిసరిగా బోధనాంశంగా ఉండాలనేది ఈ 86వ జీవో సారాంశం. భాషోద్యమ నిర్మాతగా ఇది శ్రీ బుద్ధప్రసాద్ అధిగమించిన ఒక మైలురాయి.
- 2008, శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు దేవాలయ ప్రాంగణంలో కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద కావ్యరచనకు శ్రీకారం చుట్టిన మంటపాన్ని పునర్నిర్మింప చేసి, అందులో కృష్ణదేవరాయల నిలువెత్తు విగ్రహాన్ని ప్రతిష్ఠింప చేశారు.
- హైదరాబాదులో తెలుగుతల్లి విగ్రహం మీద "తెలుగుతల్లి" అని తెలుగులో రాయకపోవటం, సెక్రెటేరియట్‌లో రాష్ట్ర సచివాలయం అని తెలుగు అక్షరాల్లో ఎక్కడా రాసిలేకపోవటం, ఏ ఊళ్ళోనూ ఏ దుకాణం మీదా తెలుగు నామఫలకాలు అరుదై పోవటం ఇలా తెలుగు అనేది నిర్లక్ష్యానికి గురౌతున్నదని ఆయన చేసిన ఆందోళన ఫలితంగా ఎల్లెడలా తెలుగు అక్షరాలు కనిపిస్తున్నాయి.
- 2006 ఫిబ్రవరి 21న అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా శ్రీ బుద్ధప్రసాద్ ప్రేరణతో తెలుగు భాషోద్యమ సమాఖ్య హైదరాబాదు ఇందిరా పార్కు దగ్గరున్న సత్యాగ్రహచౌక్‌లో సాహితీవేత్తలతో సామూహిక సత్యాగ్రహం నిర్వహించి, తెలుగు భాషకు క్లాసికల్ హోదా, పాలనాభాషగా తెలుగు అమలు లాంటి విషయాల

గురించి ఉద్యమించినప్పుడు నాటి ప్రతిపక్ష నాయకుడు శ్రీ చంద్రబాబుతో సహా అన్ని రాజకీయ పార్టీలవారూ వచ్చి తమ సంఘీభావం ప్రకటించారు. ఫలితంగా తెలుగు భాషకు క్లాసికల్ హోదా ఇవ్వాలని కేంద్రాన్ని కోరుతూ అసెంబ్లీలో ప్రభుత్వమే తీర్మానాన్ని ప్రవేశపెట్టి ఏకగ్రీవ ఆమోదాన్ని పొందింది. ఇందుకోసం ప్రభుత్వం ఏర్పరచిన టాస్క్‌ఫోర్సులో సభ్యునిగా క్లాసికల్ హోదా సాధనలో శ్రీ బుద్ధప్రసాద్ ప్రముఖపాత్ర పోషించారు.

- కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షుడిగా ఆ సంస్థ పక్షాన 2006లో జాతీయ తెలుగు రచయితల మహాసభలు, 2007లో మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, 2011లో రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, తెలుగు భాషను కంప్యూటీకరించే అంశంపైన, తెలుగు యూనీకోడ్ లిపిని అభివృద్ధి గురించి ఒక జాతీయ సదస్సు, తెలుగు భాష ప్రాచీనత నిరూపించే జాతీయ సదస్సు, సింధు నాగరికతకు సమాంతరంగా తెలుగు నేలపైన వర్ధిల్లిన నాగరికతను తెలుగు నాగరికతగా వ్యవహరించాలని కోరుతూ పురావస్తు పరిశోధకులతో ఒక జాతీయ సదస్సులను నిర్వహింపచేశారు. న్యాయస్థానాలలో తెలుగు అమలు పైన న్యాయమూర్తుల్లో జాతీయ సదస్సు ఏర్పరచి, తెలుగులోనే తీర్పులు వెలువరించాలనే ఒక ప్రేరణను న్యాయమూర్తులకు కలిగించారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం వెలువరించిన తెలుగు పసిడి, వజ్రభారతి, తెలుగు పసిడి, తెలుగు భాష విశిష్టత ప్రాచీనత, తెలుగు మణిదీపాలు, తెలుగు పున్నమి, కృష్ణాజిల్లా సర్వస్వం మొదలైన ఉద్గ్రంథాలకు ప్రధాన సంపాదకుడిగా వ్యవహరించారు.

## విదేశీ పర్యటనలు :

1990లో మారిషస్, 2002లో చైనా, మలేషియా, సింగపూర్, దక్షిణ కొరియా, థాయిలాండ్, 2008లో అమెరికా, 2009 మరియు 2010లో యునైటెడ్ కింగడమ్, 2012లో లండన్ నగరాల్లో పర్యటించారు.

లండన్ నగరంలో జరిగిన తొలి ప్రపంచ చరిత్ర మహాసభలకు అధ్యక్షత వహించారు. తమిళనాడులోని మారుమూల ప్రాంతాల్లో కూడా పర్యటించి అక్కడి తెలుగువారి స్థితిగతులను పరిశీలించి, మనోధైర్యాన్ని కలిగించారు. తంజావూరు సరస్వతీ గ్రంథాలయం,

తమిళ విశ్వవిద్యాలయంలో తెలుగు కోసం నిధుల కేటాయించటానికి నాటి ముఖ్యమంత్రిని అంగీకరింపచేశారు.

**విలువలతో కూడిన రాజకీయాలు - విజయాలు :**

శ్రీ బుద్ధప్రసాద్ గాంధేయవాది. జాతీయ సమైక్యవాది. కుటుంబ వారసత్వంగా ఆయనకు సంక్రమించిన అంశాలివి. 1977 నుండి 1990 వరకూ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీకి వివిధ హోదాలలో సేవలందించారు. 11యేళ్ళ పాటు అధ్యక్షుడిగా ఉన్నారు. 1992 నుండి 2014 కాంగ్రెస్ పార్టీకి రాజీనామా వరకూ అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యుడిగా ఉన్నారు.

1999 మరియు 2004 సార్వత్రిక ఎన్నికలలో అవనిగడ్డ శాసనసభ్యునిగా ఎన్నికయ్యారు. 2004లో అసెంబ్లీ పబ్లిక్ అకౌంట్స్ కమిటీ సభ్యుడిగా, 2005లో అసెంబ్లీ డీ లిమిటేష్న్ కమిటీ సభ్యుడిగా సేవలందించారు. 2007 నుండి 2009 వరకూ ఆంధ్రప్రదేశ్ పశు సంవర్ధక, పాడి పరిశ్రమాభివృద్ధి మరియు మత్స్య శాఖామాత్యులుగా సేవలందించారు. అక్టోబర్ 2012 నుండి మార్చి 2014 వరకూ ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షునిగా రాష్ట్ర క్యాబినెట్ మంత్రి హోదాలో పనిచేసి ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘానికి పూర్వ వైభవం తీసుకొచ్చారు.

మే 2014లో జరిగిన సార్వత్రిక ఎన్నికలో అవనిగడ్డ అసెంబ్లీ నియోజక వర్గ అభ్యర్థిగా తెలుగుదేశం పార్టీ తరపున పోటీ చేసి, శాసనసభ్యునిగా గెలుపొందారు.

కృష్ణా డెల్టా ఎండిపోతున్న సమయంలో డెల్టా రైతాంగాన్ని సమకూర్చుకొని లక్షలాది జనవాహినితో ప్రకాశం బ్యారేజీ పైన వారం రోజుల పాటు చేసిన దీక్ష, కృష్ణానదిపైన పులిగడ్డ - పెనుమూడి వంతెన (మండలి వెంకట కృష్ణారావు వారధి) మరియు పులిగడ్డ - విజయవాడ నది గట్టు రహదారి నిర్మాణ పనుల మంజూరు, కృష్ణా డెల్టా ఆధునీకరణ పనులను ఎంతో పోరాడి సాధించారు. పెనుమూడి వారధి నిర్మాణం కోసం తన శాసన సభ్యత్వానికి రాజీనామా ప్రకటించి, వంతెనని సాధించటం, నాటి ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు స్వయంగా వారధి శంకుస్థాపన చేయటం దివిసీమ వాసుల చిరకాల వాంఛను నెరవేర్చినట్టయ్యింది. రాష్ట్ర పశుసంవర్ధక, పాడిపరిశ్రమ, మత్స్య శాఖల మంత్రిగా శ్రీ బుద్ధప్రసాద్ పశుక్రాంతి పథకం ప్రవేశపెట్టి వివాదాల కతీతంగా అమలు చేశారు. దేశంలో ఎక్కడా లేని ఫిషరీస్ పోలిటెక్నిక్‌ని కొత్తగా ఆలోచన చేసి దివిసీమలో నెలకొనేలా చేశారు. మూగజీవాల మంత్రిగా ఆయనని చూసినప్పుడు, మూగజీవిని

సేదతీర్చిన వాడికే గాయపడిన హంస మీద హక్కుంటుందని, వేటాడిన కిరాతకుడికి ఉండదనీ వాదించిన గౌతమ బుద్ధుడిలా ఆయన వ్యవహరించారు.

రాజకీయ నాయకులలో అరుదైన వ్యక్తిత్వం ఆయనది. ప్రజలే కాదు, అధికారులు ప్రభుత్వం కూడా ఆయనను సంస్కృతీ సంప్రదాయాలకు ప్రతినిధిగానే సంభావిస్తారు. రాజకీయ నాయకులకు ప్రవేశం లేని చోటుకి కూడా సగర్వంగా తల ఎత్తుకొని వెళ్ళగలిగే ఉన్నత వ్యక్తిత్వం ఆయనది. నేటి నేతలకు ఆయనొక ఆచరణీయ ఆదర్శం. రాజకీయంగానూ, సాంస్కృతికంగానూ, శ్రీ మండలి బుద్ధప్రసాద్ వ్యక్తిత్వ పరిశీలనకు ఇవి కొన్ని పరిచయవాక్యాలు మాత్రమే. ఇందులో చోటుచేసుకోని అసంఖ్యాకమైన కార్యక్రమాలెన్నో ఉన్నాయి.

హోసూరులోనూ, బ్రహ్మపురంలోనూ, చెన్నైలోనూ, ముంబాయిలోనూ, బెంగుళూరులోనూ... ఇంకా ఎన్నో చోట్ల తెలుగు సభలు. తెలుగు ఉత్సవాలు, తెలుగు జానపద కళల ప్రదర్శనలు నిర్వహణలో ఆయన ప్రత్యక్ష ప్రమేయం స్పష్టంగా కనిపిస్తుంది.

కృష్ణాజిల్లా చారిత్రక వైభవం సదస్సు ప్రారంభోత్సవానికి కొద్ది నిమిషాల ముందు సుడిగాలులతో కూడిన భయంకరమైన వాన రావటంతో ఎక్కడి వారక్కడ చెల్లా చెదురైపోయారు. అప్పటికప్పుడు వేదికని మరొక స్థావరానికి మార్చి మంత్రిగా ఉన్న శ్రీ బుద్ధప్రసాద్ స్వయంగా బల్ల ఎక్కి బ్యానరు కట్టిన దృశ్యం కళ్ళను చెమరుస్తుంది.

స్వదేశీ విశ్వవిద్యాలయాలు, అనేక ఇతర మహత్తర సంస్థలు చెయ్యలేని, చెయ్యని పనులెన్నింటినో ఒంటి చేత్తో చేసి చూపించారు శ్రీ బుద్ధప్రసాద్. భాషాభివృద్ధిలో మనకన్నా ఎంతో ముందున్న తమిళులను అధిగమించి తెలుగు భాషను ఆధునీకరించటంలో దేశంలోనే అందరికన్నా ముందుండేలా ఆయన చేసిన కృషి జాతి మరువలేనిది, మరువరానిది కూడా!

నిరాడంబర జీవితాన్ని గడపటం, నిష్కళంక రాజకీయ జీవితాన్ని కొనసాగించడమే ప్రధానధ్యేయంగా కలిగి వుండడం, అప్పగించిన బాధ్యతలను పట్టుదలతో అంకితభావంతో పూర్తి చేయటం, మృదు స్వభావంతో, చిరుదరహాసంతో అందరినీ ఆకట్టుకోగలగటం, అరుదైన వ్యక్తిత్వ వికాస లక్షణాలతో పార్టీ విధానాలను ప్రజల్లోకి సులభంగా తీసుకెళ్ళే శక్తి సామర్థ్యాలను కలిగి వుండటం బుద్ధప్రసాద్‌గారిలో కనిపించే ప్రత్యేకతలు.

విలువలు నిండిన రాజకీయ జీవితమూ, నిబద్ధత కల్గిన సామాజిక సాంస్కృతిక జీవితమూ బుద్ధప్రసాదుగారిని ఒక కారణజన్ముణ్ణి చేశాయి.

తెలుగు భాషా సంస్కృతీ వికాసాల కోసం అంకితమైన ఒక అరుదైన వ్యక్తి ఆయన, తెలుగు భాషోద్యమానికి తానే కర్తా కర్మా క్రియగా ముందు వరుసలో నిలిచి, జాతిని చైతన్యవంతం చేస్తున్న ఒక అపురూప వ్యక్తిత్వం ఆయన స్వంతం. రాజకీయాలు, రాజకీయాల ప్రయోజనాలకు ద్వితీయ ప్రాధాన్యత నిచ్చే రాజకీయ నాయకులు అరుదుగా కనిపించే ఈ రోజుల్లో అందరికీ తలలో నాలుకలా సాగిపోగలిగిన ఆయన సహృదయతే ప్రజాచైతన్యాన్ని ప్రోది చేయగలుగుతోంది. రాష్ట్రం విభజన నేపథ్యంలో పెనుముప్పును ఎదుర్కొంటున్న నేటి స్థితిలో స్థితప్రజ్ఞత కలిగిన నేతల అవసరం ఎంతైనా ఉంది. తెలుగు భాషా సంస్కృతులకే కాదు. తెలుగు ప్రజల సర్వతో ముఖాభివృద్ధికి ఒక పెద్ద దిక్కుగా నిలిచే ఉన్నత పదవికి ఆయన ఎన్నికయ్యారు. అధికారపక్షం ఎంతో విజ్ఞత ప్రదర్శించగా ప్రతిపక్షం కూడా అంతే విజ్ఞతతో వారి గెలుపుకు సహకరించారు. రాష్ట్రానికి శుభఘడియలు రానున్నాయనటానికి ఒక మంచి సంకేతం ఈ పరిణామం.

తెలుగు భాషను ప్రపంచ భాషగా తీర్చిదిద్దాలని శ్రీ బుద్ధప్రసాద్ ప్రారంభించిన కార్యక్రమ లక్ష్యం చాలా వరకూ నెరవేరింది. నూతన రాష్ట్రంలో సాంస్కృతిక చైతన్యానికి, సాహితీ సాంస్కృతిక సంస్థల పునరుజ్జీవనానికి ఆయన ద్వారా జరగవలసిన కృషి చాలా ఉంది. రాష్ట్రంలోని రచయితలు, కవి పండితులు, నటులు, కళాకారులందరూ ఆయన వెన్నంటి నడిచేందుకు తమ సంసిద్ధతను చాటుకోవడానికి ఈ అభినందన సభ ఒక మంచి వేదికగా నిలుస్తుందని ఆశిస్తున్నాం. తెలుగు వారిమైనందుకు అందరం గర్వించే విధంగా మన భాషా సంస్కృతులు వికాసం పొందుతాయని ఆకాంక్షిస్తున్నాం.

గుత్తికొండ సుబ్బారావు
డా॥ జి. వి. పూర్ణచందు
సంపాదకులు

# దివి రత్నానికి నవరత్నాలు

- డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్

పెద్దకళ్లేపల్లి వేంచేసియున్నట్టి
నాగేశ్వరస్వామి యోగదీప్తి
మోపిదేవిని హితమూర్తి సుబ్రహ్మణ్య
కరుణాకటాక్ష వీక్షణగణమ్ము

భావదేవరపల్లి భావనారాయణుని
కృప సంగమేశ్వరు విపులశక్తి
విమల హంసలదీవి వేణుగోపాలుని
దయ ఆంధ్ర విష్ణుని దక్షతయును

సాధు నాంచారమయు విశ్వనాథ పల్లి
నవనిగడ్డ లంకమతల్లి ఆశిషములు
అందరిని మించి కృష్ణవేణమ్మ కరుణ
ఉపసభాపతి మండలిన్ కృపను బ్రోచు 1

తొలిరాజధాని శ్రీకా
కుళాంధ్ర విష్ణుపదసేవ కూర్చెను పదవిన్
తొలి ఉపసభాపతిగ మం
డలికుల! బుద్ధప్రసాద ! నడుపుమిక సభన్ 2

అందరివాడు మండలి సమర్థుడటంచును ఒక్కనోటచె
ప్పందమకబ్బెగా ఉపసభాపతిపీఠము సర్వదిక్కులం
దుం దివిసీమముఖ్యత అనూహ్యముగా వికసింప మున్ను పే
రొందిన కృష్ణరాయసచివోన్నతి కన్న నొకింత మిన్నగా 3

కాపుకాచి ప్రజాస్వామ్యగౌరవమును
శాసనసభలో కాపాడజాలినట్టి
ఓర్పు న్యాయవిచక్షణ లుపసభాప
తీ! కలవు నీకు మండలీ! దిద్దుమింక 4

హవ్యంబో ఇది కవ్యమో కొనెడి భాగ్యంబింక నెవ్వారిదో
నవ్యాంధ్రంబను క్రొత్తరాష్ట్రముగ నానాకష్ట సమ్మేళన
ప్లావ్యంబై దిగివచ్చె శాసనసభాభద్రస్థితిన్ సభ్యతా
సేవ్యంబై వెలుగొందజేయుమిక వాసిన్ ప్రజ్ఞసన్మండలీ! 5

సీమాంధ్ర సీమితాంధ్రము
నీ మార్గము మొదటినుండి నిఖిలాంధ్రమహో!
సీమలు లేని మహాంధ్రత
క్షేమాంధ్రసభాపతిగ భజింపుము తెలుగున్ 6

చిందించున్ చిరునవ్వు లెప్పుడును రాశీభూత శాంతాకృతిన్
స్పందించున్ పసివారికైన మమతన్ ప్రజ్ఞాప్రశంసాకృతిన్
నిందించున్ చెడు నెక్కడైన స్వపరస్నేహాన్యధర్మాకృతిన్
పొందుంగాక సమస్తలాభములిలన్ బుద్ధప్రసాద్ ధీరతన్ 7

చరితయు, బాసయున్, తెలుగు సంస్కృతి, సాహితి, ప్రాత క్రొత్తలో
తెలిగిన జ్ఞాన సంపద యదెట్టుల చేకురె? పిన్నపెద్దలన్
మరువక గుర్తుపెట్టుకొన మాటలె? జ్ఞాపకశక్తి ఇట్టిదై
వరలెడు సాధుమూర్తికి శుభంబులు కోరని వారలుందురే? 8

జయతు జయతు నేతా మండలీద్యా బ్ధిచంద్రః
సురుచిర ఘనకీర్తేః కృష్ణరాయస్యపుత్ర ః
భవతు సుపదదీప్త్యా వర్ధమాన శ్శతాయు ః
విజయపథవిహారీ స్మేర బుద్ధప్రసాద ః

# ప్రతిభామూర్తికి ప్రణామాలు

- 'ఆర్ష విద్యాసాగర'

శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి

శ్రీకరమైన చిర్నగవు, చిత్తము నిర్మలమై వెలుంగు, శోభాకరమైన వాగ్విభవ, మాకృతి దాల్చిన సౌమనస్య మౌ ప్రాకట కీర్తి. 'మండలి' వరాన్వయు 'బుద్ధు'ని సు'ప్రసాదు'నికీ వాకున ప్రస్తుతింపగల వాడనె! డెందము మాటలాడునే?

దీనజన సేవ జీవిత ధ్యేయమైన
'కృష్ణరావు' మండలి కీర్తిలతిక
వారసత్వ సద్గుణముల వన్నెలీను
ఘనుని బుద్ధప్రసాదుని గారవింతు.

పండిన మంచి మనస్సును
అందగ నిలుచును జనులకు - అందరివాడై
దండిగ ప్రభుతను నెరపును
'మండలి బుద్ధప్రసాద' మహితాత్ముడిలన్

ఆంధ్ర విష్ణుని కరుణతో అభ్యుదయము
కనక దుర్గమ్ము చలువతో ఘనయశమ్ము
పొంది "బుద్ధ ప్రసాదుం"డు పొలుపు మీరి
"తెలుగుల ఉపసభాపతి" తేజరిల్లు

శుభమగు గావుత! సలప
ద్విభవమ్మున తెలుగుజాతి వెలుగును గాతన్
సభలో మా విన్నాణము
ప్రభలను వెదజల్లుగాత! ప్రతిభామూర్తీ!

# అభినందన పంచమి

- శ్రీ విహారి

తన నిష్కలంక వర్తనము చేత మహాత్మ
గాంధి ప్రశంసల గాంచి వెలిగె
వృత్తి ప్రవృత్తి మార్గేతి హాసమునెల్ల
మానవ సేవగా మలచి కొలిచె
భావి తరముల సౌభాగ్యమే కాంక్షించి
ఆదర్శ మూర్తి గా "అవని" నిలిచె
తెలుగు భాషా సంస్కృతీ మహోదయమునే
కోరి తా దోహద క్రియలు సలిపె

పరహితమపార భాగ్య సంపదగ పెనచి
జనుల సుస్వాంత "మండలి" మనియె – తండ్రి
వారి వ్యక్తిత్వ వారసత్వమ్ము గొనియె
ధన్యుడీ జన మాన్య బుద్ధప్రసాదు !

గుణ కార్య విశేషజ్ఞుడు
గుణమణి బుద్ధప్రసాదు కుల్యుడు, మృదు భా
షణమున కనుబంధుడునున్
గణతంత్ర విధేయుడు, సహకారప్రదుడున్ !

తమ వీటి "క్షేత్రమ్ము" తనియు సేవా వృత్తి
నిరత సాధన తోడ నెరపినాడు
శాసన సభ్యుడై జననుతి నందుచు
కర్తవ్య పాలన గడిసినాడు
మంత్రిపదవిని సమ్మానించి, వలసిన

పరిధిలో స్వామ్యమ్ము బరపినాడు

అధికార భాష సంఘాధ్యక్ష పదవిలో

గణనీయ ఫలితమ్ము గాంచినాడు

పదవి వెంబడి పడి పోని ప్రథిత గనియె

వచ్చి చేరిన వాటికి వన్నె గూర్చు

పూర్ణ సౌజన్య, సౌహృద పుంజమగుచు

నేడుప సభాపతిగ అధినేత యయ్యె !

పరమాదర్మ సుబోధముల్ సభను దీప్యత్ శోభ సంవ్యాప్తి గా

వరలంజేయుచు నిర్వహింప తమదౌ వాల్లభ్యమేపారి, మీ

వరుసన్ జేరుత కీర్తిగౌరవము లింపౌ రాష్ట్ర సంక్షేమముల్

స్ఫురదాచార విచార శీల! అనఘా! బుద్ధ ప్రసాదాహ్వయా !

పదవి యేదైన గాని మీ హృదిని "తెలుగు"

పదములేవైన తెలుపు మీ మదిని "తెలుగు"

తెలుగు తేజమ్ము దిశల వర్ధిల్ల జేసి

అభ్యుదయ భోగభాగ్యమ్ములందుమయ్య!



మదర్‌థెరిస్సాతో శ్రీ బుద్ధప్రసాద్

# సహృదయ సత్కార పద్య మంజరి

- శ్రీ గుమ్మడి గోపాలకృష్ణ

శ్రీ శ్రీకాకుళ ఆంధ్రనాయక యశశ్రీ లక్ష్మి యానాడు మేల్
సుశ్రేయంబుల్ నొనగూర్చి తెల్గుల రస స్రోతస్వినుల్ నింపె, నే
డాశ్రీలన్నియు తెల్గుజాతి కిడ సౌమ్యంబైన చిన్మూర్తి యో
శ్రీ శ్రీ బుద్ధ ప్రసాద వర్యు జితడే సీమాంధ్ర రత్నంబగున్.

కంద గల తెల్గు భాషకు
గుండెగ శబ్దించు సుగుణ కోవిదుడగు మా
కందగు నాయకుడగు శ్రీ
మండలి బుద్ధప్రసాదు మాన్యుండరయన్

తండ్రిని మించి తనయుడు
తండ్రించిన తెల్గు జాతి తేజమ్మితడే
గండ్రము లెరుగని మనసుల
కండ్రిక బుద్ధప్రసాదు ఘనునిటమెత్తున్

నాయకుండంచును నతులనర్పింతుమా
అంతకు మించిన సొంత మనిషి!
స్నేహితుండంచును చేరి శ్లాఘింతుమా
దానికి మించిన ధర్మమూర్తి !

భాషా ప్రియుండంచు పరగ భావింతుమా
మదిని మించిన యట్టి మాన్యవరుడు!
చరిత నెరింగిన సజ్జనుండందుమా
బుద్ధి కందని యట్టి సిద్ధమూర్తి!

సాంద్రమైనట్టి సీమాంధ్ర శాసనసభ
ఉపసభాపతి పదవిలో నొదిగినట్టి
జన హృదయమోదు! సజ్జన సౌమ్యవాదు!
ధర్మ నిర్మల సాధు మా బుద్ధ ప్రసాదు !

కమ్మటి భాషయో తెలుగు కావగ మండలి కృష్ణరావిదే
శమ్ము మలేషియా సభల సంబరమొప్పగ నిర్వహించి నం
శమ్మది ప్రేరణన్ తెలుగు శ్వాసను వీడవు బుద్ధుడా! నిదా
నమ్మును రాజనీతి యును నాయక ప్రతిభయు తండ్రివే సుమీ

# సత్కీర్తి సుమాలు

- డా॥ రాళ్ళబండి కవితాప్రసాద్

కాకుళీశ్వర స్వామి కన్నుల కాంతులు
మీదు సత్కీర్తి సుమించుగాక

జలధీశ్వర స్వామి సమధికోత్సవ శక్తి
మీదు సత్క్రియలందు మెరయుగాక

మోపిదేవిస్వామి దీపించు ధీశక్తి
మీదు వైఖరి గమించుగాక

హంసల దీవికృష్ణయ్యా చాతుర్యమ్ము
మీదు విజయం బందు మించుగాక

అవనిగడ్డకు వజ్రమై వివిధ గీతుల
సిరుల సీమాంధ్ర రత్నమై చెన్ను మీర

భరతదేశమ్ము గర్వించు వ్యక్తి నీవు
ధరను మండలి వంశ బుద్ధప్రసాద!

# అభినుతి

- శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి

శ్రీ వాణీ గౌరీ త్రిత
యావిష్కృత దివ్యవీక్షణాంచల దీప్తుల్
జీవావన దీక్షాకర
భావుక బుద్ధ ప్రసాద! వరియించె నినున్ !

తొలినాటి మొలకచందురు వెల్గురేకలు
పున్నమి వెన్నెలల్ పొడమినట్లు,
ఉడుకెత్తు పుడమిపై వడిజాటి తొలకరి
హర్షధారల వర్షమైనయట్లు,
చిటివాగు వంకలు జీవనదీ వేగ

మును పొంది వరద లుప్పొంగినట్లు
అరవిరు లలరంగ విరిసి మల్లియలు ప
రిమళమ్ములన్ గ్రుమ్మరించినట్లు

అభ్యుదయ మార్గగామి లక్ష్యార్జన మన
ఆ అదృష్ట దేవతయ ఆహ్వాన మిడియె !
సాధుజీవికి బుద్ధప్రసాద కృతికి
ఉప సభాపతి పీఠికా యోగ మూన!!

తెలుగు నేలకు తూర్పు దివిసీమ కూర్పుగా
మరువనీయని రాజ్యమండలాప్తి,
ఒక నేతృ వంశమం దకలంక పాలనన్
ఔరసత్వాత్త సేవాభిరతియు
జాతి గౌరవ ఘాత జనతాపకర విధిన్
అధికార పదవుల త్యాగనిరతి
తెలుగు బాసయు వన్నియలు కోల్పడిన నాటి
దీటైన యట్టి పోరాట పటిమ

మాన్య బుద్ధప్రసా - దసామాన్య సఖుని
గుణ గణము లివి! లెక్కించు ఘనుల కెఱుక !
తనను గూర్చి తా పట్టించుకొనని నేత !
జాప్యమయ్యు, మమ్మానంద సరసి ముంచె !

పదవి ప్రతిష్ఠితుండయిన భవ్య చరిత్రుని నీతివర్తనల్
ముదమును కూర్చు జాతికి, సముజ్జ్వల మార్గమునన్ ప్రజావళిన్
పదిలము గాగ నేలగల వ్యక్తియె కావలె నందు నిందు, నీ
పదవి నొసంగినట్టి జనవాహినికిన్ ఘనతల్ గడింపుమా!

# ఆణిముత్యము

- డా॥ భూసురపల్లి వేంకటేశ్వర్లు, పి.హెచ్.డి.

అతడు నా స్వర్ణాంధ్రసీమకు
అద్భుతమ్మగు ఆణి ముత్యము
అతడు నా జీవాంధ్రభాషకు
అమృతమిడు అనుచార సిద్ధుడు

అతడు నా తెలుగింటి సంస్కృతి
చేతనమ్మగు ప్రాప్తరూపుడు
అతడు నా కృష్ణమ్మమెడలో
అలరుచెలువపు శీత హారము.

తెలుగు మాటకు తెలుగు పాటకు
వెలుగు వెన్నెల వేద్యుడాతడు
తెలుగింట వెలిగేటి కళలకు
ఆపు నిలిచిన గొడుగు అతడు

మల్లెపూవుల సోకు మార్యము
మంచి గంధపు మలయపవనము
తెల్ల వలువలగూర్చి దాల్చిన
కల్లలెరుగని వెల్ల హృదయుడు

మోముపై చిరునవ్వు పూయును
చూపులో ముత్యాలు మెరయును
పలుకు పలుకున పరుల హితమే
చిలుకు నెతి పరిమళము పంచును.

చిత్తమున యే భావమందును
సిరులు కోరని స్థిరమనస్కుడు
అచ్చతెలుగు 'పుం' భావమందిన
మచ్చ ఎరుగని తిర యశస్కుడు

సత్యమార్గ మహింస బాటయు
కలసి వెలసిన గాంధిక్షేత్రము
అందులో ప్రాసాద రూపము
ఆత్మహితులకు బుద్ధ పూర్ణిమ

నిరాడంబర జీవితమ్మున
నిలిచివెలిగెడి నిర్మలాకృతి
నిరుపమానపు సాత్వికతలో
నిండుగా కనిపించు సుకృతి

ఎన్నికల పొందేమి లేకయు
ఎన్ని పదవులు పంచగాసెనొ
అన్నిటికి ఆభరణ మతడని
అంతరాత్మకు నిజముతోచెను

పట్టు విడువని పట్టుదలలో
'కృష్ణ'నే మరపించు దక్షుడు
నవ్వు పువ్వుల నవ్య పథమున
'విజయ' మ్ము చేపట్టె నాతడు

'కృష్ణప్రభ అవనిజా రాముల'
రాగరంజిత సౌధ సీమల
ఆశలన్ విరియంగ జేయుచు
అమృత ఫలములనందు హితవరి

నాకు 'మండలి' పొత్తు నెందుకొ
అజుదు తానొదయంగ జేసెను
అదియె భాగ్యమ్మనుచు ముదమున
అంజలించెద బుద్ధప్రసాదుకు.

# నిష్కళంక రాజకీయవేత్త

- డా॥ గంధం సుబ్బారావు

ప్రజల పనియే తన పనిగా, ప్రజల సుఖమే తన సుఖంగా, ప్రజల సంతోషమే తన సంతోషంగా ప్రజల హితమే తన హితంగా ప్రజలతో మమేకమై, వారితో అవినాభావ సంబంధం కలిగి వున్నవాడే ఉత్తమ నాయకుడు.

మండలి బుద్ధప్రసాద్‌గారికి ఈ లక్షణాలన్నీ పొల్లుపోకుండా ఉండటమే కాక, నిష్కళంక రాజకీయ జీవితం, నిజాయితీ, నిబద్ధత, కార్యదక్షత ఆయనను ఒక ఉదాత్తనేతగా నిలబెట్టాయి.

అనర్గళమైన వాగ్ధాటి, అద్భుతమైన భాషా పటిమతో పాటు తెలుగు భాషా సాహిత్యాల మీద, సంస్కృతి మీద, తెలుగు జాతి గత వైభవం పట్ల ఆయనకు గల అపారమైన ప్రేమాభిమానాలు ఆయనకు రాజకీయవేత్తలలో ఒక ప్రత్యేకతను సంతరించిపెట్టాయి.

## తండ్రి అడుగుజాడల్లో :

పూవు పుట్టగానే పరిమళిస్తుంది అన్నట్లుగా, సమర్థనాయకుడు, సమైక్యవాదిగా, తెలుగు భాషా సంస్కృతుల ప్రేమికుడైన మండలి వెంకట కృష్ణారావుగారి తనయుడుగా బాల్యం నుంచే తండ్రి అడుగుజాడల్లో నడుస్తూ, ఆయన సుగుణాలన్నీ పుణికిపుచ్చుకొని, ఆ వారసత్వాన్ని కొనసాగిస్తున్నారు.

బుద్ధప్రసాద్‌గారిని నేను 1974 నుంచి ఎరుగుదును. అవి ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు ఏర్పాట్లు ముమ్మరంగా జరుగుతున్న రోజులు. రాష్ట్ర విద్యాసాంస్కృతిక శాఖల మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు కార్యనిర్వాహక అధ్యక్షులుగా ఉండి, మంత్రిగా తన బాధ్యతలు ముగించుకొని, సాయంత్రం 7.00 గంటల తరువాత రవీంద్రభారతి మొదటి అంతస్తులో ఏర్పాటుచేసిన మహాసభల కార్యాలయానికి వచ్చేవారు. అప్పుడప్పుడు తండ్రిగారితో విద్యార్థిగా ఉన్న బుద్ధప్రసాద్ గారు కూడా వచ్చేవారు. మహాసభల కార్యాలయంలో ఒక ఉద్యోగిగా బుద్ధప్రసాద్ గారిని గమనించేవాడిని. తండ్రి వెనుక వచ్చిన బుద్ధప్రసాద్‌గారు అక్కడున్న పెద్దలకు నమస్కరించి, తండ్రికి దూరంగా ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చుని అంతా శ్రద్ధగా గమనించేవారు.

# అభినందన

**- శ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్**

మిత్రులు మండలి బుద్ధప్రసాద్‌గారు ఆంధ్రప్రదేశ్ విధానసభ ఉపసభాపతిగా ఏకగ్రీవంగా ఎన్నిక అయినందుకు అభినందనలు.

పదవులు బుద్ధప్రసాద్‌గారికి అలంకారాలు కావు. ఆయనే పదవులకు అలంకారం.

బుద్ధప్రసాద్‌గారి ఆధ్వర్యంలో ఆంధ్రప్రదేశ్ శాసన సభ కార్యకలపాలన్నీ తెలుగులోనే కొనసాగుతాయని ఆశిస్తాను.

శాసనసభ సమావేశాలులేని రోజుల్లో ఆయనకు అత్యంత ప్రీతిపాత్ర మయిన తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణకు పూర్తికాలం పనిచేసే అవకాశం లభించటం తెలుగుజాతి అదృష్టం. బుద్ధప్రసాద్‌గారి ఆలోచనలు ఫలవంతం, విజయవంతం కావాలని ఆశిస్తాను.

నెమ్మదిగా బుద్ధప్రసాద్‌గారి గురించిన విషయాలు తెలియడం మొదలైంది. ఆయనకు పుస్తక పఠనం పట్ల అమితాసక్తి. ఏ మంచి పుస్తకం గురించి తెలిసినా దానిని సేకరించి చదివేవారు. అవి ప్రాచీన కావ్యాలు కావచ్చు. చరిత్ర విషయాలు కావచ్చు. విజ్ఞాన సర్వస్వ సంపుటాలు కావచ్చు. – శ్రద్ధగా చదివి, విషయాలను గుర్తు పెట్టుకునేవారు. 1976లో మారిషస్‌లో జరిగిన "విశ్వహిందీ సమ్మేళనం" సందర్భంగా రాష్ట్ర విద్యాసాంస్కృతిక శాఖామంత్రి హోదాలో భారత ప్రతినిధి వర్గంలో సభ్యులుగా మండలి వెంకట కృష్ణారావుగారు మారిషస్‌కు పయనమైనారు. అప్పటి అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టర్ డాక్టర్ పి.యస్.ఆర్. అప్పారావుగారు మారిషస్‌లోని తెలుగు వారిని గురించిన ఒక నోటు తయారుచేసి మంత్రిగారికి పంపారు. మండలి వెంకట కృష్ణారావుగారు విద్యామంత్రిగా అంతర్జాతీయ తెలుగు సంస్థకు అధ్యక్షులు కూడాను. ఆ నోటును తండ్రిగారి కంటే ముందే చదివిన బుద్ధప్రసాద్‌గారు పి.యస్.ఆర్. అప్పారావుగారికి ఫోన్ చేసి, తెలుగు భాషా సమితి ప్రచురించిన విజ్ఞాన సర్వస్వం ఫలాన సంపుటంలో మారిషస్ తెలుగు వారికి సంబంధించిన మరింత సమాచారం ఉంది – చూడండి అని చెప్పారు. ఆ పుస్తకం తెప్పించుకు చూసిన అప్పారావుగారు దాదాపు 'షాక్'కు గురైనారు. 'అదేమిటి? నాక్కూడా తెలియని విషయం ఈ అబ్బాయికెట్లా తెలిసిం"దని ఆశ్చర్యపోయారు. బుద్ధప్రసాద్‌గారి పుస్తక పఠనాసక్తికి, విషయ గ్రహణకు ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

## తండ్రికి తగ్గ తనయుడు శ్రీ బుద్ధప్రసాద్

- ఆచార్య షేక్ మస్తాన్
అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం

సాధారణంగా ఆస్తికి వారసులుగా ఉండి వాటిని సొంతం చేసుకునే సంతానమే ఎక్కువగా ఉంటుంది. సాహిత్యం, కళలు మొదలైన సాంస్కృతిక అభిరుచి కలిగిన వారి సంతానం కూడా అదే బాటలో నడవటం అరుదుగానే ఉంటుంది. అలాంటి అరుదైన వ్యక్తుల్లో శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు ఒకరు. బుద్ధప్రసాద్‌గారు కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులుగా నిర్వహించిన చాలా కార్యక్రమాలకు వచ్చే అవకాశం నాకు లభించింది. నేనెక్కడో అలీఘర్‌లో తెలుగు అధ్యాపకునిగా పనిచేస్తున్నా నన్ను గుర్తు పెట్టకుని ప్రతి కార్యక్రమానికీ నన్ను ఆహ్వానించమని చెప్పే మండలి వారికి నా కృతజ్ఞతలు.

రాష్ట్రం సమైక్యంగా ఉండాలని చిత్తశుద్ధిగా పోరాటం సాగించిన కొద్దిమందిలో బుద్ధప్రసాద్‌గారి వాంఛ నెరవేరకపోయినా, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభకు ఎన్నిక కావటం, ఆ తర్వాత ఉపసభాపతిగా నియమితులు కావటం అభినందనీయం. దేశంలోని ప్రతి కేంద్రీయ విశ్వవిద్యాలయంలో తెలుగుని తప్పనిసరిగా ప్రవేశపెట్టించాలనే అభిప్రాయాన్ని వారు నాతో పలు పర్యాయాలు ముచ్చటించారు.

అవినీతికి దూరంగా, నిజాయితీకి నిలువెత్తు సంతకంగా, తెలుగు తల్లికి ముద్దుబిడ్డగా అందరి మన్ననల్ని పొందుతున్న మండలి బుద్ధప్రసాద్‌గారికి నా అభినందనలు. వారి నాయకత్వంలో తెలుగు భాషా సంస్కృతులు మరింత వికసిస్తాయని ఆశిస్తున్నాను.

పెద్దల పట్ల బుద్ధప్రసాద్ గారికి అపారమైన గౌరవం. సాహిత్యం, భాష, చరిత్ర, కళలు, సంఘసేవ వంటి అన్ని రంగాలలో తలమానికాలు అనదగ్గ పెద్దలందరితో ఆయనకు సన్నిహిత పరిచయాలు ఉండేవి. డా. అడపా రామకృష్ణారావు, ఆచార్య జి. యన్. రెడ్డి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ కోదాటి నారాయణరావు, డా. ఖండవల్లి లక్ష్మీరంజనం, డా. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, న్యాపతి రాఘవరావు దంపతులు, మాలతీ చందూర్ దంపతులు, శ్రీ జానుమద్ది

హనుమచ్ఛాస్త్రి వంటి తెలుగు ప్రముఖులే కాక మదర్ థెరిస్సా, మారిషస్ విద్యామంత్రి శ్రీ పరశురామ్, క్రైస్తవ మత ప్రచారకులరాలు జాయిస్‌మేరి, జర్మనీ సంఘసేవకుడు రూత్ డైక్‌మన్ వంటివారితో బుద్ధప్రసాద్‌గారికి చిన్ననాడే సాన్నిహిత్యం ఉండేది. ఇప్పుడు వారినెరిగిన జాతీయ అంతర్జాతీయ ప్రముఖుల గురించి చెప్పబూనుకోవడం సూర్యుడికి దివిటీ పట్టడమే.

## మనసావాచా కర్మణా సమైక్యవాది :

1972లో ఉద్ధృతంగా చెలరేగిన ప్రత్యేకాంధ్ర ఉద్యమానికి ఎదురొడ్డి నిలిచిన అతికొద్దిమంది ఆంధ్ర నాయకులలో మండలి వెంకట కృష్ణారావుగారొకరు. ఆ కారణంగా వారి కుటుంబం అనేక కష్టనష్టాలకు గురికావలసి వచ్చింది. నిందలు, దూషణలు భరించవలసి వచ్చింది. దాడులను ఎదుర్కొనవలసి వచ్చింది. కొంతకాలం ఆయన హైదరాబాదులోను, కుటుంబం అవనిగడ్డలోను ఉండవలసి రావడం వలన కుటుంబమంతా ఆవేదనకు, తీవ్రమైన మానసిక వత్తిడికి గురి కావలసి వచ్చింది. అవనిగడ్డలో రోజూ ఇంటి మీద దాడులు పెరిగాయి. ఉద్యమకారులు వారి ఇంటికి ఎవరినీ వెళ్ళనీయలేదు. చివరికి రజకుల్ని, క్షురకుల్ని కూడా వీరి ఇంటికి పోనీయకుండా అడ్డుకున్నారు. ఆ సమయంలో పదిహేనేళ్ళ చిరుప్రాయంలో ఉన్న బుద్ధప్రసాద్‌గారు తల్లి ప్రభావతి దేవి గారికి అండగా నిలబడి, బాలవీరుడుగా తండ్రి ఆశయాలను గౌరవిస్తూ, కార్యకర్తలను సమీకరించి, ప్రత్యేకవాదుల దాడులను ఎదుర్కొన్నారు. కృష్ణారావుగారి అనుచరుడైన హరిజన కార్యకర్త ఐ.ఎస్. ప్రకాశరావును అవనిగడ్డ వీధులో ప్రత్యేకాంధ్ర నినాదం చేయలేదన్న కారణంతో గుండు చేయించి, సున్నపు బొట్లు పెట్టి అమానుషంగా వేధించారు. ఆ సంఘటనను ఏ దినపత్రికా ప్రచురించలేకపోయింది. అప్పుడు బుద్ధప్రసాద్‌గారు అతనికి ధైర్యం చెప్పి, ఏలూరులోని 'స్నేహలత' సంపాదకులు శ్రీ అర్జా సూర్యనారాయణ వద్దకు అతనిని పంపించారు. అర్జా సూర్యనారాయణగారు తన పత్రికలో ఈ విషయాన్ని ధైర్యంగా ప్రచురించారు. ఆ వార్తను ఆంగ్ల దినపత్రికలు ప్రముఖంగా ప్రచురించడంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక ఉత్తర భారతదేశంలోను దానికి మంచి ప్రచారం లభించింది. దీనిపై పార్లమెంటులో చర్చ కూడా జరిగింది. అటువంటి వార్తను ధైర్యంగా ప్రచురించినందుకు 'స్నేహలత' వారపత్రిక కూడా ప్రశంసలందుకుంది.

కోసూరి పున్నయ్య భాగవతార్ వంటి కవుల చేత సమైక్యవాదాన్ని ప్రబోధిస్తూ వ్రాయించి, బుద్ధప్రసాద్‌గారు 'స్నేహలత'కు పంపుతుండేవారు. ఈ విధంగా రాష్ట్ర సమైక్యత కోసం చిన్ననాడే బుద్ధప్రసాద్‌గారు పోరాడారు.

2013లో ఏఐసిసి అధిష్ఠానం తెలంగాణ రాష్ట్రం ఏర్పాటుకు నిర్ణయం తీసుకోగానే ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్ష పదవికి రాజీనామా ప్రకటించి రాష్ట్ర సమైక్యత పట్ల తనకు గల నిబద్ధతను చాటుకున్నారు. రాష్ట్రాన్ని చీల్చే దిశగా కాంగ్రెసు అడుగులు వేస్తుంటే తట్టుకోలేక కాంగ్రెసు పార్టీ ప్రాథమిక సభ్యత్వానికి రాజీనామా చేశారు.

## అద్భుతమైన పఠనా వేగం, జ్ఞాపకశక్తి :

బుద్ధప్రసాద్‌గారు దేనినైనా అతివేగంగా చదువుతారు. ఒక సెకనులో పేజీ త్రిప్పేస్తుంటారు. అయితే ఎక్కడ తప్పు ఉందో లేక ఎక్కడ అవసరం లేదనుకుంటారో అక్కడ టక్కున కళ్ళు ఆగిపోతాయి. దాన్ని బట్టి ఆయన పఠనావేగాన్ని నేను గ్రహించగలిగాను. ఆయన జ్ఞాపకశక్తి అమోఘమైంది. ఏదైనా విషయాన్ని చదివితే ఎన్నేళ్ళ తరువాతైనా అది ఏ పుస్తకంలో ఎక్కడ ఉందో చెబుతారు. ఆయన రాజకీయవేత్త కాకపోయుంటే, ఒక గొప్ప అకడమీషియన్ అయి వుండేవారు.

## అజాతశత్రువు :

బుద్ధప్రసాద్‌గారు మొదటి నుంచీ రాజకీయాలలోనే ఉన్నా ఆయనకు శత్రువులు లేకపోవడం ఆయన స్నేహశీలతకు తార్కాణం. ఎవరెదురైనా నవ్వుతూ పలకరించడం ఆయన ప్రత్యేకత. వివాదాల జోలికి పోకుండా, ఎవరినీ నొప్పించకుండా మసలుకొనే స్వభావం వారిది. బుద్ధప్రసాద్ గారికి కుల, మత, ప్రాంతీయాభిమానులు లేవు. తెలుగుజాతి అంతా ఒక్కటే అన్న ఏకైక సూత్రానికి ఆయన కట్టుబడి వున్నారు.

బుద్ధప్రసాద్‌గారు పశుసంవర్ధక, మత్స్యశాఖ మంత్రిగా ఉన్నపుడు ఆ శాఖలో వెలుగుబంటి సూర్యనారాయణ అనేక ఒక ఉద్యోగి చేసిన దారుణమైన అవినీతి కుంభకోణం వెలుగులోకి వచ్చింది. అది ఒక దుమారంలాగా చెలరేగి, ప్రభుత్వాన్ని ఒక కుదుపు కుదిపింది. శాసనసభలో ప్రతిపక్షనేతలు ఈ అంశాన్ని లేవనెత్తగా ఆ శాఖ మంత్రిగా బుద్ధప్రసాద్‌గారు వివరణ ఇచ్చారు. ఎంతో గొడవ చేద్దామనుకున్న ప్రతిపక్షసభ్యులు బుద్ధప్రసాద్‌గారి వ్యక్తిత్వంపై, నిజాయితీపై ఉన్న గౌరవంతో ఆయన వివరణతో సంతృప్తిచెంది ఆ అంశాన్ని అక్కడితో వదలివేశారు. బుద్ధప్రసాద్‌గారి స్థానంలో వేరెవరున్నా అది అంతటితో ఆగేది కాదు.

ప్రతిపక్షనేతలు కూడా అభిమానించి, ఇష్టపడే ఏకైక రాజకీయ నాయకుడు మండలి బుద్ధప్రసాద్.

## తండ్రి నుంచి వారసత్వం :

బుద్ధప్రసాద్‌గారికి తండ్రిగారి నుంచి వారసత్వంగా సంక్రమించిన ఆస్తిపాస్తులు ఏమీ లేవు. మండలి వెంకటకృష్ణారావుగారు హైదరాబాదులో స్వంత ఇల్లు కూడా ఏర్పాటు చేసుకోలేదు. బుద్ధప్రసాద్‌గారికి తండ్రి నుంచి వారసత్వంగా సంక్రమించిన సంపద- తెలుగు జాతి ప్రాచీన వైభవం పైనా, తెలుగు భాషా సంస్కృతుల పైనా తన తండ్రికి గల అపారమైన మమకారం; ఆయనకు గల నిరాడంబరత, నిజాయితీ, స్నేహశీలత, సేవానిరతి, ఆయన అభిమానులు - స్నేహితులు పదిలంగా కాపాడుకుంటూ వస్తున్నారు. రాష్ట్రం విచ్ఛిన్నం అవుతున్నపుడు పదవులను తృణప్రాయంగా త్యజించారు. తెలుగు జాతి పూర్వవైభవాన్ని పునరుద్ధరించడానికి కంకణం కట్టుకున్న చంద్రబాబు నాయుడుగారితో జత కట్టారు. 2012 డిసెంబరులో తిరుపతిలో నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభలను ఘనంగా నిర్వహించడం వెనుక గల బుద్ధప్రసాద్‌గారి కృషిని అందరూ శ్లాఘించారు. ప్రపంచంలో ఎక్కడ తెలుగు సంస్కృతికి సంబంధించిన ఏ కార్యక్రమం జరిగినా అక్కడ బుద్ధప్రసాద్‌గారు ఉండటం తప్పని సరి. నిరాడంబరత తండ్రి నుంచి చిన్ననాడే బుద్ధప్రసాద్‌గారు అలవరచుకున్నారు. ఎప్పుడూ తెల్లని ఖద్దరు వస్త్రాలు తప్ప ఆయన మరొకటి ధరించరు.

బుద్ధప్రసాద్‌గారి నిజాయితీని ప్రశ్నించే పరిస్థితి ఇంతవరకు రాలేదు. ఏ రాజకీయ పార్టీల వారు ఆయన నిజాయితీ గురించి ఎప్పుడూ ఎక్కడా ఇంతవరకు అనుమానాలు వ్యక్తం చేయలేదు సరికదా నిజాయితీకి ఆయనను కొండంత నిదర్శనంగా పేర్కొంటారు.

తండ్రి నుంచి తనకు సంక్రమించిన సేవా కార్యక్రమాలను ఆయన ఎక్కడా కుంటుపడకుండా కొనసాగిస్తున్నారు. అవనిగడ్డలో గాంధీక్షేత్రం ఒక ధర్మసత్రం. అనాథలకు, అభాగ్యులకు, తుఫాను బాధితులకు అది ఆశ్రయం. దేశవిదేశాలకు చెందిన స్వచ్ఛంద సంస్థల సేవా కార్యకలాపాలకు అది కేంద్రస్థానం.

బుద్ధప్రసాద్‌గారి స్నేహశీలత విలక్షణమైంది. ఏ వ్యక్తయినా ఆయనతో ఒకసారి పరిచయం ఏర్పరచుకుంటే, ఇక జీవిత కాలంలో ఆయనను వదలరు. ఇంతవరకు సాగిన ఆయన జీవనయానంలో ఆయనకు పరిచయమైన ఎందరెందరో వ్యక్తులు ఆయన స్నేహఝురిలో ఓలలాడి, ఆయనతో పాటు కలిసి నడుస్తున్నారు.

బుద్ధప్రసాద్‌గారికి తన తండ్రి నుంచి సంక్రమించి మరొక ఆస్తి - తన తండ్రి స్నేహితులు, అభిమానులు. బుద్ధప్రసాద్‌గారు తన తండ్రి స్నేహితులు, అభిమానులు ఎవరినీ వదలలేదు. వారితో నిర[illegible] సంబంధాలు కొనసాగిస్తూ, వారి అభిమానాన్ని,

# పదహారణాల నాయకుడు

**- శ్రీ బి.వి. పట్టాభిరామ్**

నాయకుడంటే స్వతహాగా సేవకుడు అయ్యుండాలి. అటువంటివారే ఉత్తమ నాయకులుగా గౌరవం, గుర్తింపు పొందుతారనేది చారిత్రక సత్యం. అటువంటి కోవకు చెందినవారే శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు. ఆయన ఈనాడు ఉపసభాపతిగా ఉన్నా, గతంలో తగిన పదవిలో లేకపోయినా, తెలుగు భాషాభిమానుల హృదయంలోవారు అగ్రస్థానంలో ఉంటారు. అది తెలుగు జగమెరిగిన సత్యం.

సహృదయులు, అజాతశత్రువైన శ్రీ బుద్ధప్రసాద్‌గారు, సహజ నాయకుడు. బాల్యం నుండి తండ్రి వెంట ఉండి ప్రజల అవసరాలను, ఆవేదనను అవలోకనం చేసుకుని అంచెలంచెలుగా ఎదిగి ఈనాడు తెలుగు భాషను అంతర్జాతీయ స్థాయికి తీసుకు వెళ్ళగలిగారు.

ఒకసారి ఆయన్ని కలవటానికి వెళ్ళినపుడు వారి గుమాస్తా "ఆయన బయట పుస్తకాలు కొనటానికి వెళ్ళారు" అని చెప్పాడు. "ఏ షాపులోకి వెళ్ళారు" అని అడిగితే "రోడ్డు మీద ప్లాట్‌ఫారమ్ మీద పరిచిన పాతపుస్తకాల షాపుల్లో ఉంటారు" అని తడుముకోకుండా చెప్పాడు. ఆశ్చర్యం! అక్షరాలా ఆయన అలాగే పాత తెలుగు పుస్తకాలు వెతుకుతూ కనపడ్డారు. దశాబ్దాల క్రితం తెలుగులో వచ్చి, మళ్ళీ ప్రచురణకి నోచుకోని, పుస్తకాలు కొని, జిరాక్స్ చేయించి, ఆత్మీయులకు అందిస్తారు. ఆ విధంగా నాకు వారు ఇచ్చిన పుస్తకాలతో నేను రాసిన పుస్తకం "లీడర్‌షిప్". అటువంటి వారికి కృతజ్ఞతలు చెప్పటానికి మాటలు చాలవు, పుస్తకాలు సరిపోవు. వారికి ఆయురారోగ్యాలు అందించాలని ప్రార్థిస్తూ...

ఆశీస్సులను పొందుతూ, వారి సలహాలు తీసుకుంటూ వారందరికీ ఆత్మీయుడుగా మసలుకుంటున్నారు. తాను అలా వుండడమే కాక తన తనయుడు చిరంజీవి వెంకట్రామ్(రాజా)కు కూడా ఆ విధంగా ఇప్పటి నుంచే తర్ఫీదు ఇవ్వడం ముదావహమైన విషయం. అందరు బిడ్డలూ తమ తండ్రి వారసత్వాన్ని మండలి బుద్ధప్రసాద్‌గారిలా కొనసాగిస్తే, తండ్రులంతా అమరులవుతారు.



# రాజకీయ భాషోద్యమ స్ఫూర్తి -
# శ్రీ బుద్ధప్రసాద్

- శ్రీ ఐలాపురం వెంకయ్య

బుద్ధప్రసాద్‌గారు ఆధునిక రాజకీయ రంగంలో జాతీయ భావాలు దృఢంగా కలిగిన రాజకీయవేత్త! జాతీయ సమైక్యత కోసం జీవితాలను ధారపోసిన నాయకులంటే వారికి ఎనలేని అభిమానం!

ఇక సామూహిక సేవ చేసే వ్యక్తులంటే బుద్ధప్రసాద్‌గారికి అమితమైన ప్రీతి. ప్రకృతివైపరీత్యాలు జరిగిన సమయంలో, ప్రాంతంలో సామాజిక సేవలను అందించే వ్యక్తులను సంస్థలను సముచితంగా గౌరవిస్తారు. మదర్ థెరిస్సావంటి త్యాగమూర్తుల ప్రభావం వారి మీద ఉంది! ఈ సేవాభావమే నాకు బుద్ధప్రసాద్‌గారిలో నచ్చిన అంశం!

బుద్ధప్రసాద్‌గారంటేనే తెలుగు భాష! తెలుగు భాష అంటేనే బుద్ధప్రసాద్‌గారు! తెలుగు భాషావికాసం కొరకు భాషోద్యమాలు నడిపి, తెలుగును ప్రపంచ భాషగా తీర్చిదిద్దటానికి చేస్తున్న కృషి విశిష్టమైనది! ఆదర్శప్రాయమైనది! మొత్తం సాహితీరంగానికి ఒక స్ఫూర్తిగా భాషామూర్తి బుద్ధప్రసాద్‌గారు! వారితో కలసి దేశవిదేశాలలో అనేక సభలలో నేను పాల్గొన్నాను. తెలుగు భాష కీర్తిపతాకాన్ని వినువీధిలో ఎగురవేసిన ఘనత బుద్ధప్రసాద్‌గారికే దక్కుతుంది. అన్ని రంగాల వ్యక్తులను కలుపుకుని ఒకే బాటపై నడిపించే ఆత్మశక్తి ఉన్న బుద్ధప్రసాద్‌గారి నైపుణ్యం ఈనాటి యువతరం గ్రహించాలి! వైవిధ్యభరితమైన వారి ఆశయాలను అర్థం చేసుకొని ముందుకు నడవాలి నేటి యువతరం!!

ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఉపసభాపతిగా పదవీ స్వీకారం ఆంధ్రులందరికీ సంతోషకరమైన అంశం!! వారికి సాంస్కృతిక రాజధానియైన విజయవాడలో సాహితీసంస్థల ఆధ్వర్యంలో బుద్ధప్రసాద్‌గారికి జరిగే అభినందన సభ, తెలుగు వారికీ అభినందనం! సుదీర్ఘ కాలం నుంచి వారితో ఉన్న అనుబంధమైనది! చిరస్మరణీయమైనది. వారికి నా శుభాశీస్సులు!!

# తెలుగుజాతి నికేతనం

*- ఆచార్య కె. యాదగిరి*

మండలి బుద్ధ ప్రసాద్‌గారు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభకు ప్రథమ ఉపసభాపతిగా పదవీ స్వీకారం చేసిన శుభసందర్భంలో మొదటగా నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. ఇది తెలుగువారి పునర్వైభవానికి, అంతర్జాతీయంగా తెలుగు భాష అభివృద్ధికి, సాంస్కృతికంగా పురోగమించటానికి అంకురార్పణగా నేను భావిస్తున్నాను. ఇప్పటికే బుద్ధప్రసాద్ అటు రాజకీయ రంగంలో ఇటు తెలుగు భాషారంగంలో అరుదైన ఉద్యమాలు నడిపిన నాయకునిగా ప్రసిద్ధి పొందారు. భాషా సాహితీరంగానికి వారు చేస్తున్న కృషి- తెలుగు తల్లికి వారు చేస్తున్న సేవ వల్లనే వారు ఉన్నతమైన పదవులు పొందుతున్నారని నా విశ్వాసం!! అధికార భాషగా తెలుగును అమలు చేయించటంలో, అంతర్జాలంలో తెలుగుకు సముచిత స్థానం కల్పించటంలో తెలుగు భాషకు ప్రాచీన భాషా హోదాను సాధించటంలో ఆయన అందరితో కలసి తెలుగు వారిని కదిలించి నడిపించి విజయం పొందిన తీరు తెలుగు వారందరికీ ఒక జాతీయ పండుగ వంటిది!

తెలుగు అకాడమీ స్థాపనలో పురోగతిలో మండలి కృష్ణారావుగారి ప్రమేయము, ప్రోత్సాహము మూలంగా నిలిచింది. తెలుగు అకాడమి స్థాపనా ఉద్దేశ్యాలు, లక్ష్యాలు ఎంతో విలువైనవి! తెలుగు భాషకు జాతికి అత్యంత అవసరమైనవి! తెలుగు అకాడమీ అన్ని స్థాయిల్లోను తెలుగువారికి ప్రామాణికమైన గ్రంథాలను అందించిన కీర్తితో బుద్ధప్రసాదుగారికి కూడా భాగస్వామ్యం ఉంది! ఎప్పటికప్పుడు సముచితమైన మార్గ నిర్దేశనం చేస్తూ ఈ రోజు తెలుగు అకాడమీ అక్షరకల్ప వృక్షంగా వృద్ధి చెందటానికి వారి ప్రచోదన శక్తి శ్లాఘనీయం!!

బుద్ధప్రసాదుగారితో నా అనుబంధం- అక్షరసుగంధం. వారితో జరిపే అక్షరచర్య తెలుగు తల్లి నిత్యార్చనలో ఒక ఉపచారం!! భాషా సేవలో - ప్రజాసేవలో తరిస్తున్న బుద్ధప్రసాదుగారు మరింతగా తమ ఉద్యమస్ఫూర్తిని విస్తృతం చేసి తెలుగు కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపచేస్తారని, భవిష్యత్తులో ఉన్నత పదవులు అలంకరిస్తారని సంభావిస్తూ, వారి అభినందన సభ సర్వశుభప్రదంగా జరగాలని, వివిధ సంస్థల సహకారంతో దీనిని చేపట్టిన కృష్ణాజిల్లా రచయితల సంఘం వారిని అభినందిస్తున్నాను. 

# నిబద్ధత గల నాయకుడు

*-శ్రీ వై. వెంకటేశ్వరరావు*

దివిసీమ అభివృద్ధికి అహరహం శ్రమించే కార్యకదనశీలి శ్రీ మండలి బుద్ధప్రసాద్. ఏ పార్టీ చేపట్టని అనేక సంక్షేమ కార్యక్రమాలు చేపట్టి విజయపథం వైపు అవనిగడ్డ నియోజకవర్గాన్ని నడిపిస్తున్న ప్రజానాయకుడు. ఆంధ్రదేశంలో దూరంగా విసిరివేయబడినట్లుగా ఉన్న దివిసీమను దివ్యసీమగా చేయటానికి నడుం కట్టిన పోరాట యోధాగ్రేసరుడు. శ్రీ మండలి కృష్ణారావు జయంతి ఉత్సవాల సందర్భంగా దివి సీమ చరిత్రను, సంస్కృతిని పునరుద్ధరణ చేయటానికి మేధావుల చేత వ్యాసాలు వ్రాయించి, ఉపన్యాసాలు చెప్పించి, చర్చలు నిర్వహించిన ఆధునిక దివిసీమ నిర్దేశకులు శ్రీ బుద్ధప్రసాద్. జాతీయ స్థాయిలో అవనిగడ్డ నియోజకవర్గానికి పేరు ప్రఖ్యాతులు తీసుకువచ్చారు. మడమ తిప్పని పోరాట యోధుడిగా ప్రసిద్ధి పొందారు. పేద ప్రజల ఆశాజ్యోతిగా నిలిచారు. దివిసీమ వైభవాన్ని ఆంధ్రదేశానికి తెలియచేస్తున్నారు. 'గానగంధర్వ' ఘంటశాల వేంకటేశ్వరరావుగారి జన్మస్థలమైన టేకుపల్లి గ్రామంలో ఆయన విగ్రహాన్ని ఏర్పాటు చేశారు. దివిసీమలో జన్మించిన మహామహుల విగ్రహాలను వారు జన్మించిన గ్రామాలలో ప్రతిష్ఠించాలని బుద్ధప్రసాద్‌గారి సంకల్పం. ఆ మహా పురుషుల త్యాగాలు, అందించిన సందేశాలు ప్రచారం చేయటానికి తగు ప్రణాళికలను అమలు చేస్తున్నారు.

ఉన్నతమైన తెలుగు భాష ఈనాడు అనాదరణకు, నిర్లక్ష్యానికి గురైంది. ఇటువంటి నిరాశాజనకమైన క్లిష్ట పరిస్థితులలో తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి బుద్ధప్రసాద్‌గారు విశేష కృషి చేస్తున్నారు. 1990 డిసెంబర్‌లో మారిషస్ జరిగిన తృతీయ ప్రపంచ తెలుగు మహాసభలలో ప్రతినిధిగా పాల్గొన్నారు. ఆ మహాసభల విశేషాలతో "మారిషస్‌లో తెలుగు తేజం" అనే గ్రంథాన్ని రచించారు. పెదకళ్ళేపల్లిలో ప్రముఖ సినీకవి శ్రీ వేటూరి సుందరరామమూర్తితో కలసి మూడు రోజుల పాటు సంగీత సాహితీ వసంతోత్సవాలు నిర్వహించారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి విగ్రహాన్ని ఏర్పాటు చేశారు. "తెలుగు భాషా వికాసం"పై చర్చాగోష్ఠి నిర్వహించి, తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణకు సమగ్రమైన చర్చ జరిపారు. మాతృభాషా వ్యాప్తికి దీక్షా కంకణం ధరించి ప్రజలను, అధికారులను ప్రోత్సహపరుస్తూ బుద్ధప్రసాద్‌గారు తెలుగు భాషకు ప్రాచీన హోదా సంతరించి పెట్టారు.

సాహిత్యమంటే బుద్ధప్రసాద్‌గారికి ఎనలేని గౌరవం - ఆసక్తి ఉంది. కవులు, కళాకారులు, పండితులు, చరిత్ర పరిశోధకులు అంటే అపారమైన అభిమానం. తెలుగుజాతిని తీర్చిదిద్దే మహాపురుషులుగా వీళ్ళందరినీ సాదరంగా గౌరవించటం ఆయన సంస్కారానికి చిహ్నం. కృష్ణాజిల్లా రచయితల మహాసభలను అవనిగడ్డలోను, విజయవాడలో నిర్వహించారు. దివిసీమ సాహితీ సమితి పక్షాన కవితా గోష్ఠులు, సదస్సులు నిర్వహించారు. పుస్తక ప్రచురణలను కూడా చేపట్టి "విశ్వనాథ కథ", "హంసల దీవి (నవల)", "హంసల దీవి గోపాల శతకం" వంటి గ్రంథాలను వెలయించారు. దివిసీమ చరిత్రను సంగ్రహంగా తెలియచేసే "దివిదీపిక" గ్రంథాన్ని ప్రచురించారు.

వర్ధమాన కవులను, కళాకారులను పరిశోధకులను, సంఘ సేవా పరాయణులను, పార్టీ కార్యకర్తలను ప్రోత్సహించడం అంటే బుద్ధప్రసాద్‌గారి ఆసక్తి మెండు. ఆయన చొరవతో ఎన్నో గ్రంథాలు వెలుగులోకి వచ్చాయి. 2002 దివి మహోత్సవాల సందర్భంగా బుద్ధప్రసాద్‌గారి కృషి వలన "దివి రత్నాలు" అనే అద్భుత గ్రంథం వచ్చింది.

తండ్రి బాటలోనే తెలుగు భాష అభివృద్ధికి అన్ని విధాల కృషి చేస్తున్నారు. బుద్ధప్రసాద్‌గారు తెలుగు పరిరక్షణ కోసం తెలుగు భాషోద్యమ సమాఖ్య ఏర్పాటులో ఆయన కీలక సూత్రధారి. నర్సరీ నుంచి 10వ తరగతి వరకు విధిగా తెలుగును బోధించాలని అసెంబ్లీలో అనధికార తీర్మానం ప్రవేశపెట్టి రాష్ట్ర ప్రభుత్వంతో జీవో జారీ చేయించారు. సచివాలయం ముంగిట అధికార భాష అయిన తెలుగులో నామ ఫలకం పెట్టలేదని తెలుగు భాషాభిమానులతో కలసి ఆందోళన చేసి అరెస్టయ్యారు. తెలుగు పార్లమెంటు సభ్యులతో కలసి న్యూఢిల్లీలో ప్రధానిని కలిసి తెలుగుకు ప్రాచీన భాష హోదా ఇవ్వమని కోరారు.

భారతదేశంలో మరెక్కడా లేని విధంగా శ్రీకృష్ణదేవరాయల వారు కూర్చుని 'ఆముక్తమాల్యద' రచిస్తున్నట్లుగా ఉన్న కాంస్య విగ్రహాన్ని శ్రీకాకుళంలో ప్రతిష్ఠింపజేయడం, ఆ మారుమూల పల్లె నుండి తెలుగువాణిని రాజధాని వరకూ తీసుకెళ్ళడానికి చేసిన ప్రయత్నం బుద్ధప్రసాద్‌గారి సంకల్ప బలానికి తార్కాణం. సత్‌సంకల్పం, వనరులు, వ్యక్తులను సమీకరించడం, సమన్వయంతో రచించిన ప్రణాళికను, ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించడం మండలి బుద్ధప్రసాద్‌గారి సామర్థ్యానికి ప్రతీకగా నిలుస్తుంది. అలుపు ఎరుగని కార్యాచరణ, స్థితప్రజ్ఞత, నిండు గంభీర మూర్తిమత్వం కూడిన ప్రసాద్‌గారు తప్పక మరెన్నో విజయ పతాకలు ఎగురవేస్తారని అందరి నమ్మకం, ఆకాంక్ష. 'పదవులది

## అభినందన మందారమాల

-శ్రీ జిసనారా

అందమైన అవనిగడ్డ మండలిలో..
అహింస, సత్యాన్వేషణలను
గాంధీమార్గంలో ముందుకు కదిలించిన
చైతన్యమూర్తి మీరు!
బుద్ధదేవుని దయామృత త్రిశరణాలను...
తెలుగు వారి గుండెలలో...
వెలిగించిన కరుణామయుడు మీరు!
ఆంగ్లభాష మహమ్మారి...
ఆవహించి తెలుగు తల్లి-
తీయని పలుకుల దహించి...
నంగి నంగి తెల్లవారి...
కల్లబొల్లి పదాల చెల్లుబాటు చేసి పోగా...
తెలుగు భాష నుడికారము
తెలియజేయు సంస్కృతిని-
అధికారముతో తెచ్చిన
అపర భగీరధుడు మీరు!
మాటలలో, చేతలలో
మన భాషయే మీ మంత్రము...
మహాసభల నిర్వహణే మహాద్భుతము!
మహాశయా!
ఏ పదవిని వరించినా...
ఎప్పుడూ తెలుగు భాషోద్యమమే
మీ మనసున...
మీ జరిమి, కూరిమికి మనసార జేజేలు !

ఏముంది; వస్తుంటాయి పోతుంటాయి, మన తెలుగు సాహిత్య సంస్కృతుల పరిరక్షణ కోసం మన కార్యాచరణ కొనసాగుతూ ఉండాలి. అలా నిరంతరం పని చేసుకుంటూ పోవడమే మన పని అని నిరాడంబరంగా నవ్వేసే నిగర్వి ఆయన.

బుద్ధప్రసాద్‌గారు దివిసీమలో పుట్టడం ఆ సీమ చేసుకున్న అదృష్టమనడం అతిశయోక్తి కానేకాదు. బుద్ధప్రసాద్ తండ్రి మండలి కృష్ణారావు సమైక్యవాది. అదే బాట తనయుడిది కూడా. మండలి బుద్ధప్రసాద్ సమైక్యవాద బావుటాను ఎగురవేశారు. అందుకోసం పదవిని, పార్టీని వదలుకున్నారు. తెలుగు జాతి పూర్వ వైభవం కోసం నడుం బిగించారు. అవిశ్రాంతంగా శ్రమించడానికి సమాయత్తమైనారు. ఇదే లక్ష్యంతో ముందుకు పోతున్న చంద్రబాబు నాయుడుగారి అండన చేరారు.

మండలి బుద్ధప్రసాద్ గారి సంకల్పం నెరవేరి అచిరకాలంలోనే తెలుగు జాతి పూర్వవైభవాన్ని పొందుతుందని ఆశిద్దాము.

# తెలుగు పరిమళం - శ్రీ బుద్ధ ప్రసాద్

- డా॥ వేదాంతం రాజగోపాల చక్రవర్తి

బుద్ధప్రసాద్‌గారు ఒక విలక్షణమైన వ్యక్తి. మంచి స్నేహశీలి. రాజకీయ చాతుర్యంలో చక్కని ప్రశంసలు పొందే ఆయన ప్రవృత్తి రీతి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఒక విధంగా చెప్పాలంటే మండలి రాజహంస. పాలను, నీరును వేరు చేసే శక్తి హంసకు ఉన్నట్లుగా అవినీతి -నీతి కలసిపోయిన రాజకీయ నీర క్షీర న్యాయంలో క్షీరాన్ని గ్రోలే ముచ్చటైన మధురమూర్తి ఆయన! తన మనస్సును స్థిరంగా అదుపులో ఉంచుకొనే ఒక రకమైన మహర్షి ప్రవృత్తి వారిది! మనస్సు నిగ్రహంగా ఉంటే మాట, చేత సౌమ్యంగా ఉంటుంది. ఎదుటి వారిని గౌరవించే ఆత్మీయమైన భావన అలవడుతుంది. నేటి రాజకీయరంగంలో అరుదైన స్వభావంతో అందరి మన్నలను పొందుతున్న బుద్ధప్రసాద్‌గారిని డిప్యూటీ స్పీకర్ పదవి వరించటం శుభకరమైన పరిణామం!!

రాజకీయరంగంలో మండలి తీరుతెన్నులు ఆదర్శంగా ఉంటాయి. రాజకీయ రంగాన్ని సాహిత్యంతో భాషతో కళారంగంతో ముడిపెట్టి అందరినీ ఒకే బాట వైపు నడిపించే వినూత్న ప్రక్రియ ఒక్క బుద్ధ ప్రసాద్‌గారికే చెల్లింది. ఇది ఒక పద్ధతి. ఇక తన కన్నా సీనియర్లతో రాజకీయాది ఇతర విషయాలను ఎప్పటికప్పుడు చర్చిస్తూ తన తరానికి సంబంధించిన నాయకులతో ఆత్మీయ సంబంధాలు పెట్టుకొని వారి అభిప్రాయాలను గౌరవిస్తూ యువతరానికి తగు సలహాలు సహకారాలు అందిస్తూ 3 తరాల రాజకీయ నాయకులకు ప్రతినిధిగా ఉండటం సామాన్యమైన విషయం కాదు! ఇది రెండవ పద్ధతి. ఇక మూడవది రాష్ట్ర – దేశ ప్రయోజనాల కోసం, తెలుగు జాతి ప్రతిష్ఠ కోసం ఎటువంటి త్యాగానికైనా వెనుకాడని ధైర్యం! దీని కోసం తన రాజకీయ భవిష్యత్తును కూడా పణంగా పెట్టే ఒక విశాల దృక్పథం మనకు అర్థమవుతుంది. తెలుగు వారిపై అంతులేని మమకారం అవసరమైతే విమర్శించే తీరు గమనిస్తే బుద్ధ ప్రసాద్‌గారు వ్యక్తిత్వం లోతు అర్థమవుతుంది.

నిరంతరం ప్రజాసేవ కోసం ఆరాటపడే వ్యక్తిగా తెలుగు భాషను జాతిని ప్రేమించే వ్యక్తిగా మండలి పొందిన ప్రసిద్ధి అనితరసాధ్యం! ఒకప్పుడు యన్.టి. రామారావుగారు తెలుగు వైభవాన్ని దశదిశలా చాటి చెప్పారు. ఆయన అడుగుజాడల్లో నడిచే ఒక ఉదాత్తనాయకుడు బుద్ధప్రసాద్‌గారు. ఈ వారసత్వం కీ.శే. మండలి వెంకట కృష్ణారావుగారి నుంచి పౌరసత్వంగా బుద్ధప్రసాద్‌గారికి సంక్రమించిందని చెప్పుకొనవచ్చును. పార్టీలకు,

వ్యక్తులకు, ప్రాంతాలకు బుద్ధప్రసాద్‌గారు ప్రాధాన్యత ఇవ్వరు. అంతా ఉద్యమాలకు, తెలుగు భాషకు, తెలుసు సంస్కృతికి తొలి ప్రాధాన్యం ఇస్తారు. దీనికి అనుగుణంగా రాజకీయాలను నడిపిస్తారు. సమాజంలో ఉన్నత స్థాయిలో ఉన్న వ్యక్తులను భాష కోసం, సంస్కృతి కోసం, వారిని అన్వయింపచేయటంలో మండలి నైపుణ్యం ఇంక ఎవ్వరికి రాదు. వారి సభలు, మాటలు, సంభాషణలు, చర్చలు బాగా గమనించండి, అన్ని జల ప్రవాహాలను కలుపుకొని ఉధృతంగా ప్రవహించే గంగా ప్రవాహం వంటిది ఆయన జీవితం! ఒక విధంగా చెప్పాలంటే మండలి తెలుగుగంగ!!

మొదటి తెలుగు ప్రపంచ సభలను నిర్వహింపచేసిన ఘనత మండలి కృష్ణారావు గారిది అయితే, చిరకాలం తర్వాత ఆ సభలను మరల జరిపించిన కీర్తి బుద్ధప్రసాద్‌గారిది! పాత్రధారులు ఎంత మంది ఉన్నా సూత్రధారి ఆయనే! 2013 డిసెంబర్‌లో తిరుపతిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలు కొద్దిపాటి ఉద్రిక్త వాతావరణంలో జరిగినా, ఫలితాలు మాత్రం తెలుగు భాషా సాహిత్య కళా రంగాలకు అద్భుతమైన పుష్టినిచ్చే విధంగా వచ్చాయి. తెలుగు అకాడమీ సంచాలకులు ఆచార్య కె. యాదగిరిగారి నిర్వహణలో జరిగిన వివిధ చర్చాగోష్టులకు వచ్చిన స్పందన అనూహ్యం. ప్రతిష్ఠాత్మకంగా తెలుగువారి కోసం అకాడమీ ప్రచురించిన 150 గ్రంథాలు వెలుగులోకి వచ్చాయంటే బుద్ధప్రసాద్‌గారి కృషి సహకారం మూలంగానే! ప్రాంతం ఏదైనా భేదాలు ఎన్ని ఉన్నా, తెలుగు భాష కోసం - సంస్కృతి కోసం ముందుకు దూకుతారు ఆయన!! ఈనాటి తెలుగు జాతి వైభవం, భాష, సంస్కృతి, సాహిత్యాలకు ఆయనే దిక్సూచి! తెలుగుదేశంలో వారి రాజకీయ ప్రస్థానం తెలుగు భాషా సంస్కృతులతో పెనవేసుకొని సాగుతుంది. నవ్యాంధ్రప్రదేశ్‌కు ఇప్పుడు ఆయన వంటి ఉన్నతమైన వ్యక్తిత్వం కలిగిన రాజకీయ నాయకుల అవసరం ఎంతైనా ఉంది! తెలుగు భాషను - బుద్ధ ప్రసాద్‌గారి కృషిని విడదీయలేము. ఆ రెండు శబ్దార్థాలు వంటివి!!

అనేక ఉద్యమాలు, అనేక సంస్థల మనుగడ, అనేక మహాసభల నిర్వహణ,
అనేక సంస్థల ఆవిర్భావం, అనేక గ్రంథాల ప్రచురణ, అనేకమంది
వ్యక్తుల అభివృద్ధి, విభిన్న రాజకీయాలలో ఆత్మీయత్వం, మొదలైన
వాటికి నేపథ్యం, రథసారథి బుద్ధప్రసాద్‌గారే !

చివరగా ఒక మాట! ఎవరైనా ఈ ఆధునిక సమాజంలో ముఖ్యంగా రాజకీయ రంగంలో స్వీయచరిత్రను వ్రాసుకొనే అవసరం లేదు. ఒక గాంధీజీ, ఒక ప్రకాశం మొదలైన వారిని స్ఫూర్తిగా తీసుకొంటే ఆత్మ కథ రాయాలంటే ఎంతో నిజాయితీ, సముదాత్తమైన ప్రవృత్తి కావాలి! మూడు తరాల రాజకీయ నాయకులలో ఉన్న చెలిమి

# బుద్ధగీతి

- యు.టి.ఎఫ్. వెంకటేశ్వరరావు

భాష పట్టుకు బహుళము ప్రాకులాడి
భాష కొఱకయి నిరతము పాటుపడుచు
భాష బ్రతికిన చాలని పరితపించు
బుద్ధ! స్వామీ! మహాద్భుత బుద్ధి! స్వామి!

హిందీ ఆంగ్లములను అసహ్యించుకొనక
అమ్మ భాషను అత్యంత మాదరించి
పాత వైభవమునకును పట్టుబట్టి
అమ్మ స్థానమే తెస్తివి ఆంధ్రమునకు

ఉపసభాపతియను ఉన్నత పదవిని
ఆంధ్రజనుల యొక్క ఆర్తి బాప
ఉబుసుపోకగాళ్ళు ఊహించనట్లుగ
చేపడితిరి మీరు చేవజూప

బద్ధత గల యట్టి బుద్ధప్రసాదులు
ఒద్దిక గల యట్టి బుద్ధిమతులు
బుద్ధిమంతులైన సిద్ధమతులు మీరు
సిద్ధమతియె మీది స్థిరచరిత్ర

చేయలేని పనిని చేతగాదందురు
చేయగలిగిన పని చేతురయ్య
చేతగాని పనిని చేతనౌననియంచు
చెత్తమాట మీరు చెప్పరయ్య

అయ్యననుసరించి ఆత్మీతయను పెంచి
ఆర్తి బాప బుధుల స్ఫూర్తి నొంది
హంస బుద్ధి కలిగి ధ్వంసము నెదిరించి
రాజకీయమందు రాణకెక్కె

తంత్రముండదయ కుతంత్రమసలు లేదు
వ్యూహదుష్టతయును ఉండబోదు
పన్నగంపు బుద్ధి పన్నాగములు లేవు
మచ్చలేని చరిత కచ్చితముగ

క్షీర నీర విభజనారోగ్యమతిశాలి !
ధర్మ కర్మయోగి మర్మరహిత
తిరము నీతియందె తీర్థములాడుచు
పరమహంస వోలె పరగుమయ్య

బలంతో, పార్టీలకు అతీతంగా వ్యక్తులతో గల ఆత్మీయ సంబంధాలతో, సాంస్కృతి సాహిత్య సంస్థలనే జీవనాడులుగా కలిగి తెలుగు భాష కోసం జీవిస్తున్న బుద్ధప్రసాద్‌గారే దీనికి అర్హులన్న విషయంలో అందరి భావాలు ఒక్కటే! వారే కనుక స్వీయచరిత్రను వ్రాస్తే అది దశాబ్దాల తెలుగు చరిత్రకు కీర్తి పతాకంగా నిలుస్తుంది!! ఒక ప్రామాణిక గ్రంథంగా విశ్వవ్యాప్తిని పొందుతుంది అనటంలో సందేహం లేదు. ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఉపసభాపతిగా వెలుగొందుతున్న బుద్ధప్రసాద్‌గారి ద్వారా తెలుగు భాష అఖండజ్యోతిగా వెలుగొందాలని ఎక్కడున్నా తెలుగు ప్రజలు ఒక్కటేనని! భాష ఒక్కటేనని నినదించే బుద్ధప్రసాద్‌గారి వాణి ప్రపంచమంతా ప్రతిధ్వనించాలని భావిస్తూ వారికి శుభాకాంక్షలు!!

# స్థిత ప్రజ్ఞులు శ్రీ మండలి బుద్ధప్రసాద్

-ఆచార్య కె. సర్వోత్తమరావు

స్వాతంత్ర్యోద్యమ కాలంలో సర్వస్వం ధారవోసి శ్రమించిన రాజకీయనాయకులలో అత్యధికులు ఆధ్యాత్మిక చింతనాపరులు కవితా సంగీతాది కళాభిమానులు. స్వతః రచయితలు. వక్తలు కూడా. అలాగని స్వాతంత్ర్యానంతరం రాజకీయాలలో తమదయిన శైలిలో ప్రజాసేవకు తహతహలాడేవారు తక్కువేమీ కాదు. అయితే మా తరం వారికి 'పాతకొత్తల మేలు కలయికగా అనిపిస్తున్నవారు శ్రీ మండలిబుద్ధప్రసాద్‌గారు. మొగమాటం లేకుండా చెప్పాలంటే మండలివారు ముగ్ధభావావిలసితులయిన ముద్దుమోములవారు.

దివి తాలూకాలో కనీవినని ఉప్పెనతో కళా విహీనమయిన వేళ 'నా ప్రజలేరీ' అంటూ కన్నీరు కార్చిన శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి సుపుత్రులు శ్రీ బుద్ధప్రసాద్‌గారు కూడా సామాన్య ప్రజానీకం పట్ల, రైతుల పట్ల కరుణాసముద్రులనడానికి సవాలక్ష సాక్ష్యాలున్నాయి. "ఆత్మావై పుత్రనామాసి" అన్నట్టు తండ్రికి తగ్గ తనయులై సాంఘిక జీవితంలోనూ సాహిత్య ప్రపంచంలోను ఒడిదుడుకులున్నా తట్టుకుని నెగ్గుకు వస్తున్న సవ్యసాచి బుద్ధప్రసాద్.

ప్రసాద్‌గారితో నా తొలి పరిచయం 2004లో. శ్రీకాకుళంలో శ్రీ కృష్ణదేవరాయల విగ్రహ ప్రతిష్ఠాకార్యక్రమంతో బాటు ఒక సదస్సు జరిపితే బాగుంటుందని భావించి తి.తి.దే. అధికారులను కలిశారు. చేస్తున్నది మంచిపని, నిర్వహించేవారు దీక్షాదక్షులు కావడంతో ఉన్నతాధికారులు సమ్మతించారు. అయినా వారు ఈ కార్యక్రమ నిర్వాహకు లెవరని అడిగి అన్నమాచార్య కళామందిరానికి వచ్చారు. అప్పట్లో నేను విశ్వవిద్యాలయ ఆచార్య పదవీ విరమణ చేసి ఆళ్వార్ దివ్య ప్రబంధ ప్రాజెక్టు అధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్నవాణ్ణి. వారు రావడంతో అన్నమాచార్య కళామందిరానికే కళ వచ్చినట్టయింది. వారు మాట మొదలెడుతుంటే 'ఈ కళా మందిర భవన ప్రారంభకులు మండలి వెంకట కృష్ణారావుగారే అని చెబుతూ వారి పేరున్న శిలాఫలకం చూపించగానే నేనిక్కడికి రాకపోతే నాకు ఈ విషయంతెలిసేది కాదు. ఇతర భవనాల ప్రారంభోత్సవం ఒక ఎత్తు. అన్నమాచార్య కళామందిర ప్రారంభోత్సవం మరో ఎత్తు' అని ధన్యవాదాలు చెప్పారు. తి.తి.దే. ప్రోత్సాహంతో శ్రీకాకుళంలో 'న భూతో న భవిష్యతి'గా ఆ కార్యక్రమాలు జరిగాయి. మాన్యులు శ్రీ. కె. రోశయ్యగారు విగ్రహావిష్కరణం చేయడం నాకింకా బాగు గుర్తు.

అప్పుడే కాదు విజయవాడ శ్రీ సిద్ధార్థ కళాశాలలో శ్రీ జెట్టిగారి ఆధ్వర్యంలో బసవజయంతి ఉత్సవాలు జరిగే వేళ శ్రీ ప్రసాద్‌గారు విద్యార్థులు ఆకట్టుకొనేలా ప్రసంగించారు. ఆ సందర్భంలో అప్పుడు భారత ఉపరాష్ట్రపతి శ్రీ జెట్టిగారికి తన తండ్రికి గల అనుబంధాన్ని గుర్తు చేశారు. కృష్ణాజిల్లా రచయితల సభల సందర్భాలలో ప్రచురించే విశేష సంచికలలో నాకు వ్యాసాలు సమర్పించే అవకాశమిచ్చారు. వివిధాంశాలపై నేను వ్యాసాలు సమర్పించడం, అవి ముద్రితం కావడం శ్రీ బుద్ధ ప్రసాద్‌గారి ప్రోత్సాహమనడమే సబబు. ప్రసాద్‌గారిని కలుసుకోవడం ఒక తీపి గుర్తు.

ఇటీవల తిరుపతిలో శ్రీ ఆకెళ్ళ అచ్చన్న శాస్త్రిగారి సాహిత్య పురస్కార ప్రదానోత్సవ సమయంలో వేదికపై నేను కూడా ఆసీనుడు కావడం కాకతాళీయమయినా వారు తమ చిరపరిచయాన్ని స్పష్టం చేయడం మనసున్నవారి కెవరికయినా మాన్యతను పెంచే విషయం. అలాగే తమిళనాడులో తెలుగు పాఠశాలల పరిస్థితి. తెలుగు పండితులగు స్థితులను ఏకరువు పెడుతుంటే ఒకసారి, తప్పక తమిళనాడులో "తెలుగు"ను జీవింపచేద్దామనడం ఆవేదన గలవారికి ఆత్మీయమయిన భరోసా అనక తప్పదు.

కొందరు కొన్ని రంగాలలోనే రాణిస్తారు. కాని శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు పదవి వున్నా, లేకపోయినా పదుగురితో కలిసి వుంటూ అందరి ఎదలోని మనిషిగా నిలవడం స్థితప్రజ్ఞత్వానికి నీరాజనం.

**దివి తాలుకాలోని దేవాలయంబుల**
**అరయుట యందుబలాట నీకు**
**కవి పండితశ్రేణి ఘనముగా కీర్తింప**
**నెమ్మది యుండుట నేర్పు నీకు**
**భాషాభివృద్ధికి బహుపథకంబుల**
**నిపుణత కూర్చుట నిష్ఠ నీకు**
**ఎవ్వరే మన్నను ఎంచక యుండెడి**
**దరహాస వదనంబు వరము నీకు**

# అర్థవంతమైన అచ్చతెలుగు వాక్యం శ్రీ బుద్ధప్రసాద్

*- శ్రీ కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి*

ఆయన రాజకీయాల్లో జనరంజికత, నిబద్ధత, మానవీయత ముప్పేట పెనగి వో ప్రామాణికతగా ఆకృతించిన బుద్ధుడు. తెలుగు భాషోద్యమాల్ని ప్రగతిబాట పట్టించేందుకు నడుము కట్టి నిలచిన నిబద్ధుడు.

ఆయన ఏ పదవి చేపట్టిన నియమ నిష్ఠలతో ప్రజలకు అందించే ప్రేమపూర్వక సేవాతత్పరతతో కూడిన వినమ్రత సంస్కారంతో అర్పించే నమస్కారంగా భావిస్తారే కాని, అదో అహంకారపు సింహాసనంగా తలచరు.

వసివాడని చిరునవ్వు, ఆత్మీయతా పలకరింపు కల్లాకపటమెరుగని కలుపుగోలుతనం, ఎన్నో ఆదర్శాలను పుణికి పుచ్చుకున్న అర్థవంతమైన అచ్చతెలుగు వాక్యం లాంటి వ్యక్తిత్వం ఆయన సొంతం.

సామాజిక ప్రయోజనోద్యమాలకు వెన్నుదన్ను ఆయన గళం. సామాజిక విలువలతో కూడిన చైతన్యానికి చేయూత ఆయన కలం.

ఒక అపురూపమైన అనుభవానికి చెరిగిపోని జ్ఞాపకాలకు తడియారని సెంటిమెంటుకు నిలువెత్తు తెలుగుదనం విలువలు పెంచే అనిర్వచనీయమైన సంతకమాయన.

తెలుగుభాషావ్యధలు, సొదలను, ధర్మాగ్రహాన్ని ఉద్యమంగా మలచిన చరిత్ర ఆయనిది. మనిషికి మానవీయతా వలువలుగట్టి, కార్యదీక్షా తిలకం దిద్ది, సేవా భావపు సుగంధం అద్ది క్షాత్రానికి సాత్త్విక సూత్రాన్ని ముడివేస్తే మిత్రత్వం ఉట్టిపడే మండలి బుద్ధప్రసాద్ అనవచ్చు.

సమతకు మమతకు అండదండగా నిలిచే మండలి బుద్ధప్రసాద్ మరెన్నో పదవులు అలంకరించాలని ఆయురారోగ్యాలతో సుఖశాంతులతో ప్రజాసేవే ప్రాణంగా జీవించాలని ఆశిస్తూ అభినందనలు తెలియజేస్తున్నాను.

# బుద్ధ ప్రసాదం

- డా॥ గుమ్మా సాంబశివరావు

ఉ॥ తెల్లని నవ్వువాడు కడుతీయని మాటల పల్కరించు వా
డెల్లర కండయై తెలుగు టెక్కము నెప్పుడు విశ్వ వీధులం
దుల్లము పొంగగా నెగురుచుండెడి నట్లుగ చేయువాడు-ఉ
త్ఫుల్ల సరోజమై వెలుగు బుద్ధ ప్రసాదుని ప్రస్తుతించెదన్.

సీ॥ వర్తించు నొక వేళ వాత్సల్యమూరియై
ఆర్తుల నెల్లర నాదరింప
రాజకీయుని వోలె రాణించు నొకవేళ
వక్తయై మిక్కిలి వరలుచుండు
అలరించు నొకవేళ అద్భుత ప్రతిభతో
అతిపూర్వ విషయాల నందజేసి
కోపించు నొకవేళ కుటిల వర్తనులపై
ప్రేమించు నెప్పుడు ప్రియ సఖులను
అతడె మండలి కృష్ణరాయ సుతుడతడె
ఉపసభాపతి స్థానమందుండి, తాను
ఆంధ్ర శాసనసభలోన నలరుచుండె
సద్వినుతుడయి బుద్ధ ప్రసాదు ఘనుడు.

తే॥ ముఖము మనసు భావమునకు ముకురమనుచు
పల్కుచుందురు జగతిలో ప్రాజ్ఞులెపుడు
మీరు ధరియించు వస్త్రాలు 'మిగుల తెలుపు'
మీ మనమ్ము స్వచ్ఛమనుచు మేటి రీతి

కం॥ నరనరమున తెన్గుదనము - వరగంగా ఝరిని బోలి ప్రవహింపంగా
వరలెడు బుద్ధప్రసాదుకు - స్థిరయశమగు గాక శ్రీలు చిందుచునుండన్

చం॥ జయమగుగాక మండలికి శాసన సభ్యులు గౌరవింపగా
జయమగు గాక సౌమ్యతకు సాక్ష్యముగా వెలుగొందు మూర్తికిన్
జయమగుగాక మాటలను చల్లని గంధము వోలె పూయగా
జయమగు గాక తెల్గులకు స్వచ్ఛత సాగెడి మీదు వర్తనన్



# బుద్ధ

**- డా॥ జి. యస్. వరదాచారి**

సమకాలీన రాజకీయ రంగంలో మండలి బుద్ధప్రసాద్‌గారిది విశిష్ట వ్యక్తిత్వం. ఆయన వేషభాషలు ఎంత పరిశుద్ధంగా ఉంటాయో ఆయన ఆలోచనలు అంత నిర్మలంగా ఉంటాయి. సమాజ సేవా తత్పరత కొందరికి నిచ్చెన వంటిది. పైకి ఎగబాకడానికి తోడ్పడుతుంది. ప్రసాద్ గారికి అది స్వాభావిక లక్షణం. నిరాడంబరత, నిష్పాక్షికత ఆయనకు జన్మతః అబ్బిన గుణాలు. భాషాభిమానం, భాషా సేవ ఆయనకు వారసత్వంలో లభించిన పెట్టుబడి. ఆయన మందస్మిత ముఖారవింద జనాకర్షకం. ఆయన మృదుభాషి. మధురభాషి. నిజమైన గాంధేయవాది. సామాజిక నిబద్ధత. ఆయన దీక్ష సాంస్కృతిక కళారంగాలకు తోడ్పాటు ఆయన దైనందిన వ్యాపకం. 'బాల' పత్రిక సంపాదక మండలి అనుబంధం ఆయనలో చిన్ననాడే భాషాభిమానాన్ని వికసింపచేసింది, ఆయనను తెలుగు భాషాభివృద్ధికి అంకితమయేట్టు చేసింది.

శాసనసభ్యుడుగా ఉన్నా, మంత్రిగా ఉన్నా, అధికార భాషా సంఘం అధ్యక్షుడుగా ఉన్నా ఏ పదవీ లేకున్నా తెలుగు భాషాజ్యోతి కొడిగట్టిపోకుండా చూడటం పైనే దృష్టి. తెలుగు వైభవం చెక్కు చెదరకుండా కాపాడాలన్నదే ఆయన తపన. అందుకే తెలుగుకు ప్రాచీన భాషా ప్రతిపత్తి సాధించడం కోసం అలుపెరుగక శ్రమించారు. తెలుగుకు యూనికోడ్ సభ్యత్వం సంపాదించడంలో భాగస్వాములయ్యారు. ఖతులు రూపొందించిన వారికి చేయూత నందించారు. తంజావూరు గ్రంథాలయములో అపురూప తెలుగు ప్రతుల పరిరక్షణకు మాటసాయం చేసారు. తెలుగు స్థానాన్ని పదిలపరిచేందుకు ఎవరు ఏ ఆందోళన చేపట్టినా, ఉద్యమం నడిపినా అండగా నిలబడ్డారు. ఈ ఉద్యమాలకు ఊపిరి పోయడానికి ఉద్దేశించిన సమీకృత భాషోద్యమ సమాఖ్య నిర్మాణ భారాన్ని మోశారు. అధికారభాషా సంఘం అధ్యక్షపదవి దక్కినప్పుడు తిరుపతిలో నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభలను అనితర సాధ్యమైన రీతిలో నిర్వహించి బుద్ధిజీవులందరి మన్ననలు అందుకున్నారు.

తెలుగు భాషకు ఎనలేని సేవ చేసిన వారిని స్మరించుకోవడం నవతరం భాషా సేవకులకు స్ఫూర్తిదాయకంగా ఉంటుందని నమ్మి మా వయోధిక పాత్రికేయ సంఘం పండిత పాత్రికేయుడు తిరుమల రామచంద్ర శతజయంతి ఉత్సవం జరపాలని నిర్ణయించినప్పుడు బుద్ధప్రసాద్ నేనున్నానంటూ ముందుకు వచ్చారు. మేము తలపెట్టిన

## మండలికి అభినందన

-శ్రీ రేపాక రఘునందన్

గాంధేయం మూర్తీభవించిన వ్యక్తిత్వం
సాంప్రదాయంలో తెలుగుదనం
భాషణంలో నిండుదనం
అదే మండలి నైజం...
అందరి కోసం ఒక్కడిగా
ఆశయం ఏదైనా ఆదర్శం ఒక్కటే
అంటూ ఆప్యాయత కురిపించే
అమృతమూర్తి మా మండలి...
తెలుగువారన్నా, తెలుగు భాషన్నా
ఎనలేని ఆర్తి, అదే మన మండలి కీర్తి

తెలుగు పాల కావిడి
మా దివిసీమ మండలి
తెలుగు సభల్ని ప్రతిభతో నిర్వహించి
తెలుగు ఖ్యాతిని విశ్వశోభితం చేసిన
కళా ప్రపూర్ణుడు మా మండలి...
పాలనలో ప్రతిభకు పట్టం
శాసనసభకు ఉపసభాపతి ఘట్టం
తెలుగు చిరునవ్వు
పెదవులపై నాట్యం చేయ
తెలుగు భాష పులకించి
దీవించే నిన్ను సుఖీభవ...

లఘు గ్రంథ ప్రచురణ, జాతీయ స్థాయీ విద్వద్గోష్ఠి మాత్రమే కాకుండా ఆయన అముద్రిత రచనలన్నిటినీ ప్రచురించాలని సూచించి వెన్ను తట్టారు.

ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి పదవిని అలంకరించిన సందర్భంగా ముఖ్యమంత్రి, మంత్రులు, సభ్యులు చేసిన అభినందన ప్రసంగాలలో బుద్ధప్రసాద్ భాషా సేవ దీక్షనే ఎక్కువగా ప్రస్తావనకు వచ్చిందంటే కారణమిదే. దివిసీమ ప్రజల సామాజిక, ఆర్థిక అభ్యున్నతి బుద్ధప్రసాద్‌గారు చేసిన సేవలు తక్కువేమీ కాదు. ఏ అంశాన్ని తీసుకున్నా సంపూర్ణ అవగాహనతో ఆచరణాత్మక కార్యక్రమంతో ముందుకు సాగడం ఆయన ప్రత్యేకత. “మధుర భాష వల్ల మర్యాద ప్రాప్తించు” అన్న కరుణశ్రీ పద్యభాగాన్ని తన సమాధానంలో ఆయన సభలో ఉల్లేఖించడం ఆయన మనస్తత్వానికి అద్దం పడుతుంది. ఈ సద్గుణాలు బుద్ధప్రసాద్‌గారు మరిన్ని ఉన్నత శిఖరాలు అధిరోహించడానికి తోడ్పడుతాయంటే పునరుక్తి మాత్రమే అవుతుంది. వారికి మా అభినందనలు.

# నిలువెత్తు తెలుగుదనం

- డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ

సామాజిక చింతనాపరులు, దేశభక్తి కల రాజకీయవేత్త. వీటికి మించిన తెలుగు భాషా సంస్కృతుల పట్ల అభిమానం కల సౌమ్యమూర్తి శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు. వీరి తండ్రిగారు కూడా నైతిక రాజకీయాలకు, తెలుగు భాషాభివృద్ధికి కృషి చేసిన ఆదర్శమూర్తి.

బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరొందిన బుద్ధప్రసాద్‌గారిలో నిరాడంబరత ప్రధానమైన లక్షణం. కలుపుగోలు గుణం ఆయనకు అలంకారం. ముఖ్యంగా యువతను ఇష్టపడే స్వభావమున్నా. అనుభవజ్ఞులను పెద్దలను ఆదరించే సంస్కార శీలి.

తెలుగు రచయితల పట్ల, కవి పండితులు పట్ల, కళాకారుల పట్ల ఎంతో గౌరవం కల మహనీయులు. వీరిలో ప్రాచీనతను ఆదరించే గుణమున్నది. కొత్తదనాన్ని ప్రోత్సహించే ధీరత్వం కూడా ఉంది. ఎందరో ప్రాచీన, అర్వాచీన రచయితలు తమ పుస్తకాల్లోని జ్ఞాపకాల్లో మండలి వారితో వారికుండే ఆత్మీయతను అక్షరంగా పదిలపరచుకొన్నారు.

మండలి వారు స్వచ్ఛంద సేవా తత్పరులను, జనసామాన్యాన్ని అభ్యుదయ పథంలో నడిపే మహనీయులను ప్రోత్సహిస్తారు. వారికి వెనుబలంగా నిలుస్తారు. మండలివారిలో కనిపించే మరో ప్రధానాంశం. వారి రాజకీయ, సాహిత్య, సమాజపరమైన ధోరణిలో ఎక్కడా వివాదాలు లేకపోవడం. గొప్ప సమన్వయశీలి. దశాబ్దకాలంలో వారితో నాకు పరిచయముంది. ఏ రోజునా ఎవరిపైనా పరుషంగా మాట్లాడడం జరగలేదు. వారి సన్నిహితులు ఎవరూ వారి కంటిలో ఏనాడు చిన్న ఎరుపు జీర చూసి ఉండరు.

ఆ మహనీయుడితో కలసి ఒక సాహితీరూపంలో కృష్ణదేవరాయ జయంతి వేళ పాలుపంచుకోవడం గొప్ప అనుభూతి. వారిని మా నాన్నగారి పేరిట ఏర్పాటు చేసిన 'బ్రహ్మశ్రీ ఆకెళ్ళ అచ్చన్న శాస్త్రి స్మారక పురస్కారాన్ని 'మహామహోపాధ్యాయ' శ్రీ పాదూరు రంగరాజన్ గారికి ప్రదానం చేయడానికి ఆహ్వానించాను. వారు తిరుపతికి వచ్చి, సభకు అధ్యక్షత వహించి నిర్వహించారు. ఈ పురస్కార సభలు ప్రతి సంవత్సరం కొనసాగించాలని ఆత్మీయంగా ఆదేశించారు. ఇలా కవి పండిత పక్షపాతిగా, వెలుగొందుతూ తెలుగువారి హృదయాలను గెలుచుకొన్న మృదువచస్వి అలఘు యశస్వి శ్రీ మండలి బుద్ధప్రసాద్. వీరికి కలియుగదైవం శ్రీనివాసుడు మరింత అభ్యుదయాన్ని సకలైశ్వర్యాలను కటాక్షించాలని ఆకాంక్షిస్తున్నాను.



# శాసన పీఠంపై ప్ర'బుద్ధ'నేత

- డా॥ తుర్లపాటి కుటుంబరావు (పద్మశ్రీ అవార్డు గ్రహీత)

"మండలి బుద్ధప్రసాద్ మన రాజకీయ రంగంలో విశిష్ట వ్యక్తి" మొన్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ఇవే మాటలలో కాకపోయినా, ఇదే అర్థంలో – అసెంబ్లీలో అన్నారు.

"ఔను ముఖ్యమంత్రి అన్నమాట అక్షరాల నిజం. అయిదారు సంవత్సరాల క్రితం ఒక ప్రముఖ రాజకీయనాయకుడితో కలసి వెళుతుండగా, "మన రాజకీయవేత్తలలో విశిష్ట వ్యక్తులు ఎవర"న్న చర్చ వచ్చింది. ఆయన ముగ్గురు పేర్లు చెప్పగా, వారిలో బుద్ధప్రసాద్ వున్నారు! నా అభిప్రాయం ఎప్పటినుంచో అదే! అయితే, సమకాలీన రాజకీయవేత్త అయిన ఆయన తనకంటే చాలా చిన్నవాడైన మండలికి ఇంతటి కితాబు యివ్వడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

వర్తమాన రాజకీయ రంగం భ్రష్టుపట్టి పోయింది. భారత స్వాతంత్ర భానూదయానికి పూర్వమే ఇప్పటికి 70 సంవత్సరాల నాడు రాజకీయ పాత్రికేయరంగంలో అడుగిడిన నేను నెహ్రూ, టంగుటూరి ప్రకాశం ప్రభృత మహానాయకుల దగ్గర నుంచి ఇప్పటి నాయకుల వరకూ అందరినీ సన్నిహితంగా అధ్యయనం చేస్తూ వచ్చాను! కాగా, ఇటీవల 'పాలిటిక్స్ ఈజ్ ది లాస్ట్ రిసార్ట్ ఆఫ్ ఏ స్కాండ్రల్" అన్న ప్రఖ్యాత బ్రిటిష్ నాటకకర్త, జర్నలిస్టు జార్జి బెర్నార్డ్‌షా మాటలు నాకు తరచుగా జ్ఞాపకం వస్తున్నాయి. స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచి మన రాజకీయ రంగం క్రమంగా ఏ విధంగా దిగనాసిల్లిపోతున్నదో చూస్తూ ఉంటే, బాధ కలుగుతుంది.

ఇలాంటి మన రాజకీయ రంగంలో అక్కడక్కడ వెలుగు తేగలుగుతున్న కొన్ని ఆశాజ్యోతులు కానవస్తూ వుంటాయి. అలాంటి వెలుగు దివ్వెలలో మండలి బుద్ధప్రసాద్ ఒకరు. ఈ రాజకీయ కారు చీకటిలో కాంతి పుంజం వెలుగులు విరజిమ్మడం కష్టమే. అయినా, బుద్ధప్రసాద్ తన ప్రబుద్ధ వ్యవహార శైలితో నేటి రాజకీయ రంగం విలక్షణంగా, విశిష్టంగా భాసిల్లుతున్నాయి. ఈ విషయాన్ని మొన్నటివరకూ బుద్ధప్రసాద్ ప్రత్యర్థిపక్షంలో వున్న చంద్రబాబునాయుడు గుర్తించడం ఆయన రాజనీతి పరిణతికి నిదర్శనం.

రాష్ట్ర అసెంబ్లీ డిప్యూటీ స్పీకర్ పదవి మండలికి విశేష పదవి కాదు. ఆయన 2007-09 మధ్య రాష్ట్ర మంత్రిగా వున్నారు. అంతకంటే కూడా మంత్రి హోదాతో అధికార భాషా సంఘం అధ్యక్షుడుగా సంవత్సరానికిపైగా పనిచేశారు. రాష్ట్ర మంత్రిగా కంటే భాషా

# సహృదయ గని

- డా॥ జముళ్ళముడి

ప్రతిభావంతులను వెతికి బయటికి తీసె
ప్రతిభాశాలి సువిశాలి శ్రీ బుద్ధప్రసాద్ సహృదయ గని

మనిషిని చూస్తే చాలు మనసు నిండిపోవు
చేయిచాచి సాయమంటె నిండుమనసులోని నీరమిస్తారు

తండ్రి ముఖ్యమంత్రి తనయుడు మంత్రి
అతిశయాలు పనికిరాని ఈ కాలపు మాన్యముని

సంఘం అధ్యక్షుడిగా తనకే కాక,ఆ సంఘం పేరు ప్రతిష్టలు పెంచారు. టి.ఎన్. శేషన్ ఎన్నికల కమీషన్ అధినేతగా వచ్చిన తరువాతే అలాంటి కమీషన్ ఒకటి వున్నదని ప్రజలు తెలుసుకున్నారట! అధికార భాషా సంఘం విషయంలో అలా లేముకాని, మొత్తం మీద బుద్ధ ప్రసాద్ తన కొద్దిపాటి పదవీకాలంలో తెలుగు భాషకు అదివరకు ఎన్నడూ ఎవ్వరూ సాధించలేని ప్రత్యేకతను, ప్రాచుర్యాన్ని సాధించారని చెప్పవచ్చు. ఇందుకు తాను అధ్యక్షుడిగా వచ్చిన మూడు నెలలకే తిరుపతిలో జరిగిన చతుర్థ ప్రపంచ తెలుగు మహాసభల సాఫల్యంలో ఆయన నిర్వర్తించిన కీలకపాత్రే నిదర్శనం.

తెలుగు భాషామతల్లి గారాబు బిడ్డ 'మండలి' ఎక్కడ వున్నా, తన భాషామతల్లిని విస్మరించరని చెప్పవచ్చు. ఆయన ప్రభుత్వంలో తన పలుకుబడిని ఉపయోగించే, తెలుగు భాషాజ్యోతి కొడిగట్టకుండా చూడగలరని చెప్పవచ్చు.

ఎందరో వుండే మంత్రులలో ఒకరుగా వుండే కంటే "చుక్కల్లో చంద్రుడి" వలే స్పీకర్ పదవే గొప్పదని నేను వారికి కొన్ని సన్నివేశాలలో సూచించాను.

కాగా, ఏ పదవిలో వుంటే, ఆ పదవికి వన్నెతెచ్చి, దానిపై తన ముద్రవేసే మండలి బుద్ధప్రసాద్ అసెంబ్లీ డిప్యూటీ స్పీకర్‌గా కూడా తన విశిష్టతను చాటుకోగలరని ఆశించుదాం! ఆయన భవిష్యత్తులో మరిన్ని ఉన్నత శిఖరాలు అధిష్టించాలని ఆశీర్వదించుదాం.



# "ఎదిగిన కొద్ది ఒదిగిన మనిషి" - మండలి

- శ్రీ కిలారు ముద్దుక్రిష్ణ

నిరాడంబరతకు నిలువెత్తు నిదర్శనంగా నిలచిన వ్యక్తి శ్రీ మండలి బుద్ధప్రసాద్. అధికార పదవిలో వున్నా లేకపోయినా చెరగని చిరునవ్వుతో తెలుగు భాషాభివృద్ధే తన ధ్యేయం అన్న విధంగా బుద్ధప్రసాద్ నిరంతరం శ్రమిస్తున్నారు. అందుకే దేశ విదేశాల్లో వున్న తెలుగు వారందరు ప్రాంతీయ, రాజకీయ భేదాలు లేకుండా మండలి బుద్ధప్రసాద్ గారిని మనసారా అభిమానించడం నేను కళ్ళారా చూసాను.

రాజకీయాలలో విలువలు పడిపోతున్న ప్రస్తుత తరుణంలో రాజకీయవేత్తగా అందరి అభిమానాలను పొందటం బుద్ధప్రసాద్‌కే దక్కింది. ఇప్పటి వరకు మండలి బుద్ధప్రసాద్ మూడు పర్యాయాలు అమెరికాలో పర్యటించారు. మంత్రిగా, ఏ పదవీ లేకుండా, ఆయన పలుపర్యాయాలు అమెరికా తదితర దేశాల పర్యటనకు వెళ్ళారు. వారితో కలసి అమెరికా లండన్‌ల పర్యటనలో పాల్గొనే అవకాశం నాకు కలిగింది. 2008వ సంవత్సరంలో జూన్ నెలలో జరిగిన సిలికాన్ వ్యాలిలో సిలికానాంధ్ర సంస్థ ఆధ్వర్యంలో నిర్వహించిన మొదటి ప్రపంచ కూచిపూడి ఉత్సవాలకు మండలి బుద్ధప్రసాద్ ముఖ్య అతిథిగా విచ్చేసి ఆ ఉత్సవాలను గిన్నిస్ పుస్తకంలో ఎక్కించడానికి చేసిన కృషి అందరి ప్రశంసలు అందుకుంది. 2011 సెప్టెంబరు నెలలో మళ్ళీ ఇదే ప్రదేశంలో సిలికానాంధ్ర ఆధ్వర్యంలో నిర్వహించిన మొదటి ప్రపంచ తెలుగు అంతర్జాల సదస్సులో బుద్ధప్రసాద్ పాల్గొని తెలుగు భాషను విశ్వవ్యాపితం చేయడంలో విశేషమైన కృషి జరిపారు. 2013మే నెలలో డల్లాస్ నగరంలో నిర్వహించిన తానా మహాసభలకు బుద్ధప్రసాద్ విశిష్ట అతిథిగా విచ్చేసి మూడు రోజుల పాటు కీలకోపన్యాసాలు చేసి అమెరికాలోని భాషాభిమానులు ఆకట్టుకున్నారు. బుద్ధప్రసాద్ అమెరికాలో పాల్గొన్న ఈ మూడు పర్యటనలో ఆయనతో పాటు నేనూ పాల్గొని అక్కడ ఆయనకున్న అభిమానాన్ని వీక్షించాను.

2011 డిసెంబర్ నెలలో మారిషస్‌లో నిర్వహించిన తృతీయ ప్రపంచ తెలుగు మహాసభలకు బుద్ధప్రసాద్ తనతో బాటు నన్ను కూడా వెంట తీసుకొని వెళ్ళారు. వారం రోజుల పాటు మారిషస్‌లో తెలుగు ప్రజల మధ్య వారితో కలిసి గడపటం నా అదృష్టం

# 'ఉచితాసనం'పై శ్రీ మండలి

- శ్రీ యజ్ఞప్రసాద్

చూడగానే సౌమ్యశీలి అన్పిస్తారు. కానీ, కార్యదక్షత కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. అనుకున్న పని పూర్తికానిదే నిద్రపోని తత్త్వం. ఆయన వదనంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

సాహిత్యాన్ని ప్రోత్సహించాలనే తపన, ఆయన ప్రతిమాటలోనూ ధ్వనిస్తుంటుంది. అందుకేనేమో వ్యక్తుల మీద ఆధారపడకుండా, సంస్థల మీద కాకుండా సాహిత్య సేవే పరమావధిగా తానొక్కడై మెరుస్తుంటారు. ఆ మెరుపులో ఒక ఆశావాదం. ఒక ఆత్మ విశ్వాసం గాఢంగా కన్పిస్తాయి.

ఇలాంటి అపురూపమైన తత్త్వం మనకు చాలా అరుదుగా కన్పిస్తుంది. రాజకీయ నాయకుల్లో అసలు గర్వించరు. ముఖ్యంగా తెలుగు నాట సాహిత్యాభిమానం ఉన్న రాజకీయ నాయకులు బహు అరుదు. ప్రస్తుత కాలంలో శ్రీ బుద్ధప్రసాద్‌ని ప్రథముడిగా లెక్కించాలి. అభిమానాన్ని మాటల్లో కాకుండా నరనరాన జీర్ణించుకొని ప్రతివారిలోను ఉత్తేజాన్ని కల్గిస్తూ ఉంటారు.

పోరాటాలకు వెరవని తత్త్వం, రాజకీయంగా దెబ్బ తగుల్తుందని తెలిసినా, భాష కోసం ఎంతదాకా అయినా వెళ్ళగలిగే ధీశాలి ఆయన.

రాష్ట్రానికి సభాపతి ఉపసభాపతి స్థానాలలో బుద్ధప్రసాదుగారులాంటి వ్యక్తులు ఉంటే సభకు వన్నె తెస్తారు. శ్రీ బుద్ధప్రసాదుగారిని ఉపసభాపతిగా ఎన్నుకున్నారన్న వార్త చదివినప్పుడు కొత్త రాష్ట్రానికి మంచి శకునాలు కన్పిస్తున్నాయని ప్రతి ఒక్కరూ భావించారు. శ్రీ బుద్ధప్రసాదుగారికి నా అభివాదాలు.

మారిషస్ నలుమూలలా నివసిస్తున్న తెలుగు ప్రజలకు ఆయన తండ్రి మాజీ మంత్రివర్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావుకు చిరపరిచితులు. వందల సంవత్సరాల క్రితం మారిషస్ దేశం వెళ్ళి స్థిరపడిన తమకు భాషపట్ల అభిమానం పెరగడానికి మండలి క్రిష్ణారావు ఆయన కుమారుడు బుద్ధప్రసాద్‌లు జరుపుతున్న కృషిని అక్కడి తెలుగువారు మర్చిపోలేకుండా వున్నారు.

2012వ సంవత్సరం జులై నెలలో లండన్ లోని బ్రిటిష్ లైబ్రరీలో యు.కె. తెలుగు సంఘం నిర్వహించిన ప్రథమ చరిత్ర తెలుగు మహాసభలకు బుద్ధప్రసాద్ తనతోబాటు నేను కూడా పాల్గొనే విధంగా ఏర్పాటు చేశారు. ఈ మహాసభలలో తెలుగు జాతి చరిత్రకు సంబంధించి బుద్ధ ప్రసాద్ చేసిన కీలకోపన్యాసం అందరికిని ఆకట్టుకుంది. లండన్‌లోని బ్రిటిష్ గ్రంథాలయంలో ఉన్న వేలాది తాళపత్ర గ్రంథాలలో నిక్షిప్తమై వున్న తెలుగు జాతి చరిత్రను వెలుగులోకి తీసుకురావడానికి బుద్ధప్రసాద్ చేసిన సూచనలు ఆకట్టుకున్నాయి. తెలుగు భాష అభివృద్ధి కోసం విశేష కృషి చేసిన సి.పి. బ్రౌన్ సమాధిని లండన్ పర్యటనలో భాగంగా బుద్ధప్రసాద్‌తో కలసి సందర్శించడం మర్చిపోలేని అనుభూతి.

తన ఎదుటి వారిలో వున్న సామర్థ్యాన్ని తెలివితేటలను గుర్తించటంలో బుద్ధప్రసాద్‌కున్న వున్న శక్తి మరొకరికి వుండదనేది నా అభిప్రాయం. విదేశాలలో తనతో పాటు పర్యటించిన నన్ను పలుమార్లు ప్రపంచ మహాసభల్ వేదికపై సత్కరించడం ఆయనలో వున్న స్నేహ గుణానికి నిదర్శనం. స్వదేశంలోను బుద్ధప్రసాద్‌తో పాటు పలుచోట్ల పర్యటించే అవకాశం నాకు కలిగింది. గత ఏడాది తమిళనాడులో తెలుగు భాష అమలు తీరు గురించి బుద్ధప్రసాద్ ఐదు రోజుల పాటు తంజావూరు, తదితర ప్రాంతాలలో జరిపిన పర్యటనలోను పాల్గొనే అవకాశం నాకు కల్పించారు. తంజావూరులో వున్న తమిళ విశ్వవిద్యాలయం తరహాలో ప్రత్యేక ఆంధ్రప్రదేశ్ ఒక తెలుగు విశ్వవిద్యాలయాన్ని తెలుగువారు గర్వించే విధంగా ఏర్పాటు చేయాలనేది వారి సంకల్పం.

తిరుపతిలో ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణలో బుద్ధప్రసాద్ పోషించిన పాత్ర యావత్ తెలుగు ప్రజల ప్రశంసలను అందుకుంది. బుద్ధప్రసాద్ మంచి స్నేహశీలి. మాలాంటి సామాన్యులను సైతం వారానికి ఒక్కసారైనా ఫోన్‌లో పలకరించి యోగక్షేమాలు తెలుసుకోవటం బుద్ధప్రసాద్‌కు వున్న ప్రత్యేక లక్షణం. ఒక్కమాటలో చెప్పాలంటే ఎదిగిన కొద్దీ ఒదిగిన మనిషి బుద్ధప్రసాద్. ఆయన మరిన్ని ఉన్నత పదవులు అధిరోహించాలని తెలుగు భాషాభిమానులంతా మనసారా కోరుకుంటున్నారు.

# 'మండలి'కి సన్మండలి తరపున...

- శ్రీ గోళ్ళ నారాయణరావు

మనుషులకు ఉండవలసిన మంచిలక్షణాలు ప్రోగుపడి ఒక రూపం ధరిస్తే, ఆ రూపం **మండలి బుద్ధప్రసాద్** గారు. ఆయన సామాజిక స్పృహ - సాంస్కృతిక స్పృహ సమపాళ్ళలో కలిగిన అరుదైన వ్యక్తి. గాంధేయవాదం - భాషాభిమానం - సేవాతత్పరత లలో తండ్రిని తలపించిన తనయుడు.

కొన్ని దశాబ్దాలుగా వలసల వల్ల, పేదరికం వల్ల, నిరాదరణ వల్ల తెలుగు సంస్కృతి అవసానదశలో వుంది. ఉత్తమ కళలు నిరాధారమై పోతున్నాయి. సుసాంప్రదాయాలు కనుమరుగై పోతున్నాయి. మానవ సంబంధాల విలువలు పతనమై పోతున్నాయి. వెరసి, మంచి సాంస్కృతిక వాతావరణం ధ్వంసమై పోతున్నది. భవిష్యత్ తరాలవారు క్షమించలేనంతగా జాతి ప్రగతి కుంటుపడుతున్నది. ఈ పరిస్థితి చక్కదిద్దాలంటే ఆలోచనా పరుడు - శక్తివంతుడు - సమర్థుడు అయిన **బుద్ధప్రసాద్**గారి లాంటి నాయకుడు కావలసిందే - రావలసిందే.

ఆయన తెలుగుజాతి వికాసంకోసం, భాషోద్యమాన్ని భుజానికెత్తుకొని, రాజకీయ రంగం కన్నా సాస్కృతిక రంగానికి ప్రాధాన్యత యిస్తున్న సహృదయుడు. తెలుగు భాషకు - కళలకు అవిశ్రాంత సేవచేస్తున్న ఆదర్శ ప్రాయుడు - మార్గ దర్శకుడు. అందుకే మావంటి లక్షలాది తెలుగు భాషోద్యమ సైనికులకు ఆయన సర్వసైన్యాధ్యక్షుడు.

అభిమానులు - కార్యకర్తలు గమనించినంతలో **మండలి బుద్ధప్రసాద్ - యార్లగడ్డ లక్ష్మీప్రసాద్**గార్ల స్నేహం - ఆశయం - ప్రణాళిక - ఆచరణలు అత్యంత శ్లాఘనీయం. తెలుగు తల్లి అధిరోహించిన సాంస్కృతిక ప్రగతి రథానికి మావంటి వారలం చక్రాలమైతే, వారిద్దరూ రెండు అశ్వాల వంటి వారు.

ఒక నాయకుని నాయకుడని చెప్పుకోవడానికి, మంచి నాయకుడని చెప్పుకోవడానికి, ఎంతో తేడావుంటుంది. తలపెట్టిన మంచి పనులను మొదలుపెట్టటం, మొదలు పెట్టిన మంచి పనులను పూర్తి చేయటం, పూర్తిచేసిన మంచి పనులను మర్చిపోవటం ఆయన నైజం. అందుకే మనం **బుద్ధ ప్రసాద్**గారిని మననాయకుడని - జన నాయకుడని ఆనందంగా సగర్వంగా చెప్పుకోగలం.

సాహిత్యకారులను - కళాకారులను ఒకవైపు, భాషోద్యమకారులను - పరిశోధకులను ఒకవైపు, ప్రజలను - ప్రభుత్వాన్ని ఒకవైపు, చక్కని సమన్వయ దృక్పథంతో, తెలుగువారి సామాజిక - సాంస్కృతిక ప్రయోజనాల సంరక్షణా బాధ్యతను నిర్వహిస్తున్న **మండలి** కారణజన్ముడు.

స్వచ్ఛమైన మనస్సాక్షితో, వివేకం కలిగిన దూరదృష్టితో, విశిష్టమైన అనుభవంతో, వివక్షచూపని సేవా నిరతితో, ఆదర్శవంతమైన ఉద్యమ స్ఫూర్తితో, **బుద్ధప్రసాద్**గారు మన తెలుగువారి ఆకాంక్షలకు అనుగుణంగా గమ్యనిర్దేశం చేయవలసివుంది - ప్రయాణం జరపించవలసివుంది.

సమ్మె ఎంత ఐక్యంగా చేసినా, సమైక్యంగా ఉండలేకపోయాము. సున్నిత మనస్కుడైన **బుద్ధప్రసాద్**గారు పడిన బాధ వర్ణనాతీతం. ఇప్పుడు మన ముందు ఉన్న కర్తవ్యం మన సహోదర రాష్ట్ర ప్రజలను కూడా తెలుగు సంస్కృతి పట్ల వారికిఉన్న భావనలను సవ్యంగా ఉంచటం - బాధ్యతలను సక్రమంగా నిర్వర్తింప చేయడం. ఇంకా రూపొందని ఈ ఉద్యమం ఎప్పటికీ ఊపందుకొంటుదో? ఈనాడు తెలుగుజాతి తమ ఆశలను **బుద్ధప్రసాద్**గారి వంటి వారిపైనే పెట్టుకున్నదన్నదే నిర్వివాదం.

'కాకిచేసుకున్న కర్మమేంటి? కోయిలచేసుకున్న పుణ్యమేంటి? మధుర భాషణవల్ల మర్యద ప్రాప్తించు' అని శాసన సభలో ఆయనే ఉదహరించిన కరుణశ్రీ మాట, ఆయనకే అందంగా అతికినట్లు సరిపోతుంది.

ఆయన తన ఉత్తమ సాంస్కృతిక సంస్కారం ఉన్నత సాంస్కృతిక వ్యక్తిత్వాలతో తెలుగుజాతి చరిత్రలో ఆచంద్రతారార్కం నిలిచిపోగలరని ఆశిస్తున్నాం.

**మండలి**కి సాహిత్య - సాంస్కృతిక - సాన్నిహిత్య **సమ్మండలి** తరఫున హృదయపూర్వక అభినందనలు...

# శుభాశీస్సులు

'సాహిత్యరత్న' శ్రీ గేరా జీవరత్నం

"నేను ఆకలి గొంటిని, మీరు నాకు భోజనము పెట్టితిరి. దప్పిగొంటిని, నాకు దాహమిచ్చితిరి, పరదేశినైయుంటిని, నన్ను చేర్చుకొంటిరి, దిగంబరినైయుంటిని, నాకు బట్టలిచ్చితిరి; రోగినైయుంటిని, నన్ను చూడవచ్చితిరి, చెరసాలలో ఉంటిని, నా యొద్దకు వచ్చితిరి. మిక్కిలి అల్పులైన ఈ నా సహోదరులలో ఒకనికి మీరు చేసితిరి గనుక నాకు చేసితిరి అని యేసు చెప్పెను. **(మత్తయి 25 : 35,36,40)**

గౌరవమాత్యులు మండలి వెంకటకృష్ణారావుగారు ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మాత్యులు గాను, అవనిగడ్డ ప్రాంతములో చేసిన పరిచర్య సేవ, ముఖ్యముగా 1977 సం॥ వచ్చిన పెనుతుఫాను సమయంలో అచ్చట వీరు సల్పిన సేవ ప్రజల మస్తిష్కములలో మరవలేని ముద్ర వేసింది. అది చిరస్మరణీయం, అట్టి మహనీయుని ముద్దుబిడ్డయిన మన మండలి బుద్ధ ప్రసాద్‌గారు తండ్రిని మించిన తనయుడిగా ఆ ప్రాంత ప్రజలకేకాక నవ్యాంధ్ర ప్రాంతమునకు చేసిన, చేయుచున్న సేవ ఘనమైనది. రాబోవు కాలములో దీన్ని విస్తృత పరచి కొనసాగించగలరు మన ప్రగాఢల విశ్వాసము.

అవనిగడ్డలోని 'గాంధీక్షేత్రంలో' వయోజన విద్యా కేంద్రానికి మా నాన్నగారు కీ.శే. శ్రీ గేరాప్రేమయ్య తరచూ దర్శించేవారు. కృష్ణారావుగారితో మాకు సన్నిహిత సంబంధముంది. నేను ఆ విద్యా కేంద్రంను నా పరిశోధనలో ఒక సాంపుల్‌గా (థీసిస్) వ్రాసి నాగార్జున విశ్వ విద్యాలయానికి సమర్పించితిని. మరియు నా పుస్తకము 'సుబోధ బృంగనాదము"నకు బుద్ధప్రసాద్ గారు తొలిపలుకులు "విశ్వమానవ సందేశాన్ని విన్పించే రచన" వ్రాసిరి. అది నా హృదయం తాకింది, మేము ఆయాసందర్భాలలో కలిసినప్పుడు 'బాగున్నారా' అనే వారి అప్యాయత పలకరింపుకు ఇంకేం కావాలి – కడుపు నిండుతుంది. మరొక్కమాట – వీరు శాసనసభ సభ్యులు గాను, మంత్రిగాను తెలుగు అధికార భాష అధ్యక్షులుగాను ఏ పదవిలో ఉంటే దానికి వన్నె తెచ్చారు.

ఆయన వినమ్రుడు, త్యాగశీలి, దార్శనికుడు, దళిత ఆశాజ్యోతి. అవసరంలో నున్న వారికి స్నేహహస్తాన్ని అందించే సుగుణ శీలి. జ్ఞానాన్వేషి, పండితుడు, పరిశీలనాదక్షుడు; అన్నిటికి మిన్న – సహనశీలి, మతసామరస్య మహోన్నత సంస్కృతి గల మహనీయుడు మన మండలి. దేశ ప్రజల అభ్యున్నతికి అహరం పరితపించే అన్వేషి. వీటిలో ఏదీ అతిశయోక్తి కాదు, వినమ్రత వాస్తవాలు. దేవుడు వీరికి సకల ఐశ్వర్యము, పరిపాలన శక్తిని, దక్షతను ప్రసాదించాలని ఆకాంక్షిస్తూ ప్రార్థిస్తూ సెలవ్.



# అతడు

- శ్రీమతి వి. ఉమామహేశ్వరి

దివిసీమ దివిటీ అతడు

కృష్ణాజిల్లా మణిమకుటం అతడు

ఆంధ్రప్రదేశ్ కీర్తి పతాకం అతడు

**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

ఆకాశమండలాన తారక అతడు

భూమండలాన సుమ సౌరభం అతడు

మానవతామూర్తి అతడు

**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

తెలుగుభాషా పరిరక్షణకు కంకణధారి అతడు

తెలుగు కీర్తిని లోకానికి చాటి సవ్యసాచి అతడు

తెలుగు మకరందాన్ని పంచిన అమృతమూర్తి అతడు

తెలుగు భాషా కృషీవలుడు అతడు

**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

అహంకారరాహిత్యం అతని శిరో భూషణం

నిరాడంబరత్వం అతని కంఠాభరణం

వినయవిధేయతలు అతని అలంకారం

మన్నన మర్యాదల నెలవు అతడు

**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

# ఆయనను కాదన్నవారు లేరు...

-శ్రీ జి. వెంకటరామారావు

దాదాపు పదేళ్ళమాట...

ఆంధ్రప్రభ దినపత్రికలో స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావుగారిపై నేనొక వ్యాసం రాశాను. దీని ద్వారా నాకు వారి కుమారుడు మండలి బుద్ధప్రసాద్‌గారి పరిచయ మేర్పడింది. ఒక సాహిత్య సభకు బుద్ధప్రసాద్‌గారొస్తున్నారని వెళ్ళి స్వయం పరిచయం చేసుకున్నాను. నేను "మీ వ్యాసాలను నలభై ఏళ్ళ కిందట కృష్ణాపత్రికలోనే చదివాను. ఆ నాటి నుంచి క్రమం తప్పకుండా చదువుతూనే ఉన్నాను. ఇప్పుడు పత్రికలు రాసేవారు మీరొక్కరే కనిపిస్తున్నారని నన్ను అభినందించారు.

1985లో కాంగ్రెసు శతజయంతి ఉత్సవాల సందర్భంలో ఆ సంవత్సరమంతా ఆంధ్రజ్యోతిలో కొన్ని, ఆంధ్రప్రభలో కొన్ని కాంగ్రెసు చరిత్రపై వ్యాసాలు రాసాను. ఇన్ని చదువుతున్నా బుద్ధప్రసాద్‌గారు ఆ వ్యాసాలు చదువకుండ ఉన్నారా? సాహిత్యం, చరిత్రలంటే ఆయనకు పంచప్రాణాలు.

2006 అక్టోబరులో 'తెలుగు పసిడి' ప్రారంభోత్సవ సభలో పాల్గొనటానికి నేను విజయవాడ వెళ్ళాను. ఆ సభలో బుద్ధప్రసాద్‌గారు 'ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ చరిత్ర' ను మీతో రాయించాలనుకుంటున్నాము అనే విషయాన్ని నా చెవిలో వేశారు. వినగానే నేను అదిరిపోయి 'అది నాకెలా సాధ్యం' అని సవినయంగా చెప్పాను. 'ఆంధ్ర కాంగ్రెస్' అంటే చిన్న విషయం కాదు. ఆంధ్రాలో కాంగ్రెసు నాయకులు పుణేలో జరిగిన తొలి సమావేశం నుంచి పాల్గొంటున్నారు. ఆంధ్రాలో కొండా వెంకటప్పయ్య, బులుసు సాంబమూర్తి, ప్రకాశం పంతులు, డా. పట్టాభి అయ్యదేవర, రంగాలాంటి మహానాయకులున్నారు. వారి చరిత్రలు తెలిసిన వారి చేత రాయిస్తే బాగుంటుంది' అని నేనన్నాను. 'సరే, అలా రాసే వారెవ్వరున్నారో మీరే చెప్పండి, శ్రీ మాదాల వీరభద్రరావు పోయిన తరువాత చరిత్రలు రాసేవారు మీరొక్కరే కనిపిస్తున్నార'నగానే నేను మారు మాట్లాడలేకపోయాను. ఆ గౌరవం దక్కించుకొనే ప్రయత్నంలో పడ్డాను. అన్నానే గాని సమాచారం సేకరించడం అంత సులభమా? ఎవరి దగ్గరుంది?

ఆంధ్రరత్న భవనంలో ఉన్న  కాంగ్రెసు దప్తరాలను హైదరాబాద్‌లో ఉన్న గాంధీ భవన్‌కు తరలిస్తే గాంధీ భవన్‌లో వాటిని తగలపెట్టారనే సంగతి, గాంధీభవన్ అధికారి చిదంబర శాస్త్రిగారి ద్వారా తెలిసింది. అందులో స్వామీ రామానంద తీర్థపై నేను రాసిన వ్రాతప్రతి  కూడా ఉంది. ఇలా నేను స్వంత ప్రయత్నాలు చేసుకోవలసి వచ్చింది. అంటే పాత పత్రికలను తిరిగి తోడడం.

కాంగ్రెసు చరిత్రనంతా ఔపోసనం పట్టిన వ్యక్తి బుద్ధప్రసాద్‌గారు. ఎంత తగ్గించినా 450 పేజీల ఉద్గ్రంథం తయారైంది. ఆయన ఎక్కడా కోతలు విధించలేదు. కామా, ఫుల్‌స్టాఫ్‌లు కూడా మార్చలేదు. అదే వారిలోని గొప్పతనం. విమర్శలను సహృదయతతో స్వీకరించగల ఉన్నత సంస్కారం ఉన్న వ్యక్తి. నా శక్తి సామర్థ్యాలు గమనించి కృష్ణా జిల్లా రచయితల సంఘం ప్రచురించిన పెక్కు వ్యాస సంపుటాలలో నా రచనలను వేసుకున్నారు. అందుకు కృతజ్ఞతా పూర్వకంగా ఇటీవల నేను రాసి ప్రచురించిన, భారతదేశంలో సంకీర్ణ ప్రభుత్వాలు' అనే గ్రంథాన్ని వారు అంకితం పొంది నాకు ఎనలేని గౌరవం చేకూర్చారు.

విడిపోయినా విడిపోని మనస్సు బుద్ధప్రసాద్‌గారిది.  ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాల సాహిత్యం, రాజకీయాలు ఆయనకు కరతలామలకం. నా అనుభవంతో చెబుతున్నాను. తెలంగాణ విషయంలో ఆయనకు తెలియని రాజకీయాలు లేవు. సాహిత్య సంఘటనలు లేవు. కవులు లేరు. రచయితలు లేరు. సప్త దేశాలలో ఉన్నా ఆ ప్రదేశం నాదే అనుకునేంత విశాల హృదయం కలవారు. గొప్ప మనుషులలో గొప్ప వ్యక్తి మండలి బుద్ధప్రసాద్. రాజకీయాలలో ఆయనను సమర్థించినవారున్నారు. విమర్శించినవారున్నారు కానీ సాహిత్య రంగంలో ఆయనను కాదన్నవారు లేరు.

# తండ్రి బాటలో తనయుడు...

*- శ్రీ కళారవి ఆర్. రవిశర్మ*

రాముడు పితృవాక్య పరిపాలకుడేగాని, పితృబాట వెంట నడిచినవాడు కాదు, మనలో చాల మందికి తరాల అంతరాల వలన, తన తండ్రులు, తాతలు, నడిచిన విధానం కంటే వేరు మార్గంలో వెళ్ళే అలవాటు ఉంది. అలా కొన్ని సంవత్సరాలు తనదైన మార్గంలో వెళ్ళిన తర్వాత, అలా వెళ్ళిన దారిలో చాల పొరపాట్లు కనిపించి మరల తన పెద్దల మార్గాన్ని నడవటానికి సిద్ధపడతారు. ప్రతి యువకుడు, మధ్యవయస్కులకు ఇటువంటి అనుభవం స్వానుభవమే!

అలా జీవితంలో ఆందోళనకు గురికావలసిన అవసరం, భాషా విద్యావేత్త శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి రాలేదు. కారణం వడ్డించిన విస్తరిలాగా, ఆయన జీవితానికి మార్గదర్శి ఆయన తండ్రిగారైన శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు. వారు జీవిత కాలంలో చేసిన కృషిని తన చిన్ననాటినుండి అధ్యయనం చేస్తూ, ఆయన మార్గాన్ని, మార్గదర్శిగా నిర్ణయించుకున్నారు. అందుకే బుద్ధప్రసాద్‌గారు అందరికంటే చాలా స్థిమితంగా, శాంతంగా ఉంటారు. అలజడికి, ఆందోళనకు గురికారు.

మరొక ముఖ్య విషయం మన మాజీ ప్రధాని పి.వి.నరసింహారావు గారిలా అలనాటి కృష్ణదేవరాయలు, మొన్నటి మన ప్రధాని వాజ్‌పేయ్, మన మొదటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూలా వారు మంచి సాహితీవేత్త. అనేక గ్రంథాలని, తెలుగు సాహిత్యాన్ని, సంపూర్ణంగా అధ్యయనం చేసిన వ్యక్తి. ఆయన తెలుగు భాషకి ఒక నడిచే నిఘంటువు. దేశ చరిత్రగాని, బాషా చరిత్రగాని, కళల గురించి గాని ఆయనకు తెలిసినంతగా తెలుగు భాషలో ఉన్నవారికి కూడా తెలియదనటానికి సందేహం లేదు.

తెలుగు భాషకు ప్రాచీన భాష హోదాకావాలంటే రాజశేఖర్ రెడ్డిగారు శ్రీ బుద్ధప్రసాద్ మీద ఆధారపడ్డారు. అలాగే 4వ ప్రపంచ తెలుగు మహా సభలు, కిరణ్‌కుమార్ రెడ్డి జరిపారంటే బుద్ధప్రసాద్‌గారిని భాషాధ్యక్షుడిని చేసి, ప్రపంచ తెలుగు మహా సభలు జరుపగలిగారు. ఆయనది నిజాయితీ, నిష్కళంక తత్వం. ఆయన పదవిలో లేకపోయినా ప్రభుత్వాన్ని నడుపగలిగారు.

సభలలో సి.నా.రె లాంటి వారు ఆయనను రాజకీయవేత్తగా కంటే, సాహితీవేత్తగానే గౌరవించారు. ఇది ఒక్కటే ఆయనకి గొప్ప కితాబు!

## మండలీ! మీరొక మహాసంస్థ!

- శ్రీ కొట్టి రామారావు

మీకు జన్మనిచ్చింది గాంధీక్షేత్రం !
మిమ్మల్ని పెంచి పోషించింది
'గాంధీ మార్గం'
తెలుగును విహాయసంలో
విహరింపజేస్తున్న
నిత్యపథికులు మీరు
మీ మనసంతా తెలుగు వెలుగులే
మీ నడకంతా
సేవా పథంలో అడుగులే !
మీ కార్యదీక్షకు స్వపక్షమేకాదు
విపక్షమూ జేజేలు పలుకుతుంది!
నిబద్ధతా, నిజాయితీ
మీ దీక్షాకంకణాలు
మీరొక వ్యక్తి కాదు శక్తి!
భాషా సేవకు నిరంతర స్ఫూర్తి!
పదవులకు ఎగబ్రాకడం కాదు మీమతం
పదవులకే వన్నె తేవడం మీ అభిమతం!
తెలుగు నేత మీరు
జాతినేతగా రావాలి!
అదే మా అందరి ఆకాంక్ష!
శతమానంభవతి !

ఇటీవల ఎన్నికలలో ఆయన పార్టీ మార్పిడికి అస్మదీయులం చాల వ్యతిరేకించాం! దానికి కారణం ఆయన తండ్రి, తాతలు నిఖార్సయిన గాంధీ మార్గంలోనే నడిచారు, కాంగ్రెస్ పార్టీ నిర్జీవం అయిపోయింది అని ఆయన చెప్పిన రాజకీయజోస్యం నిజమయ్యింది.

ఆయన మంచి సాహితి, సాంస్కృతిక కార్యకర్తగానే కాక, భవిష్యత్తులో మంచి రాజకీయవేత్త అయి, తెలుగు దేశాన్ని పరిపాలించగలరేమో!

ఆయన ప్రస్తుత రాజకీయ రంగంలో, "గంజాయి వనంలో తులసి మొక్క" వంటివారు. తులసీ దళం, పూజకు, ఆరోగ్యానికి మంచిది.

బుద్ధ ప్రసాద్ మరొక బుద్ధుని ప్రతిరూపం! ఆయనను జాతీయస్థాయి నాయకుడుగా చూడాలని మాబోంట్ల కోరిక!



# అక్షర సుమహారం

- శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి

తండ్రికి తగ్గ తనయునిగా
తండ్రి ఆశయాలూ,
ప్రజల ఆకాంక్షలకు ప్రతీకగా
నాడు దివిసీమకు తలమానికంగా
నేడు రాష్ట్రానికే ఉపసభాపతిగా
సార్థక నామధేయుడై, అజాత శత్రువుగా,
అతి నిరాడంబరునిగా, నిగర్విగా,
తెలుగుతల్లికి ముద్దుబిడ్డగా
తెలుగు వెలుగులు
విశ్వవ్యాప్తం చేస్తున్న తెలుగు బిడ్డగా
తెలుగు భాషకే మణిహారంగా
కృ.జి.ర.సం. గౌరవాధ్యక్షునిగా
మానవత్వం నిండా మహా మనీషిగా
తెలుగువారి ఐక్యతను కోరే ఆశావాదిగా
ఎల్లవేళలా అందరి ఆత్మీయునిగా
ఎంత ఎత్తుకెదిగినా ఒదిగుండే వ్యక్తిగా .....
సదాసాహితీసుమాలను విరబూయించే దిట్టగా .....
కృష్ణమ్మకు మణిహారంగా
దివిసీమలో వారధి నిర్మాణానికి శక్తిగా నిలిచిన
ధీమతికి ఇదే అక్షరసుమహారం సభక్తికంగా!



54:B




తమిళ్‌నాడు గవర్నర్ గా॥ శ్రీ కొణిజేటి రోశయ్య గారిచే సత్కారం



శ్రీమతి రావు బాలసరస్వతి, శ్రీమతి యస్.జానకి గార్లతో...



కర్నాటక రాష్ట్ర తెలుగు ప్రముఖులచే శ్రీ బుద్ధప్రసాద్‌కు సత్కారం



లండన్ బ్రిటీష్ లైబ్రరీలో జరిగిన తొలి తెలుగు ప్రపంచ చరిత్ర మహాసభలో
బ్రిటన్ విదేశాంగ మంత్రి, శ్రీ చక్రపాణి, శ్రీ చిరంజీవి తదితరులు

54'D



భారత మాజీ రాష్ట్రపతి శ్రీ అబ్దుల్ కలామ్ గారికి స్వాగతం పలుకుతూ



బౌద్ధమత గురువు శ్రీ దలైలామా గారితో...

54·E



సి.పి.బ్రౌన్ సమాధి (లండన్) వద్ద శ్రీ బుద్ధప్రసాద్



కిన్నెర ఆర్ట్ థియేటర్స్ వారి సత్కారం




సిలికానాంధ్ర అంతర్జాతీయ కూచిపూడి నాట్య సమేళనంలో శ్రీ బుద్ధప్రసాద్



తానా అమెరికా వారి సత్కారం



ఆంధ్రప్రదేశ్ శాసన మండలి అధ్యక్షులు శ్రీ చక్రపాణి గారి సత్కారం



మారిషస్ తెలుగు సంఘం వారి సత్కారం

54.H



వాగ్గేయకారుడు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారితో...



సీనియర్ పాత్రికేయులు శ్రీ జి.యస్.వరదాచారి గారిని సత్కరిస్తూ...

# రేపటి తరం బలం - శ్రీ మండలి బుద్ధప్రసాద్

*- శ్రీ నండూరి రాజగోపాల్*

ఒకరోజుని మనం పదిలపరచుకోవాలంటే ఒక మంచి మాటతో ప్రారంభమవ్వాలి లేదా ఒక మంచి పాట వినాలి లేదా ఒక మంచి కవితని చదవాలి లేదా ఒక మంచి దృశ్యాన్ని చూడాలి. లేదా ఒక మంచి పుస్తకంలో కొన్ని అక్షరాలనైనా హత్తుకోవాలి. అప్పుడు ఆ రోజు మనలో భద్రంగా ఉంటుంది. తెలుగు ప్రజలకి అన్ని రోజులు ఇలా దాచుకునేలా చేయడానికి ప్రచారం అక్కర లేని ప్రయాణాన్ని గత కొన్ని దశాబ్దాలుగా చేస్తున్నా తెలుగు సంస్కృతీ ప్రేమికుడు, తెలుగు సాహిత్య పాఠకుడు, తెలుగు భాషా ఆరాధకుడు, తెలుగు సమాజాన్ని బలంగా చేయడానికే కావిడి ఎత్తుకున్నా శ్రామికుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్.

సాహిత్య, సాంస్కృతిక, ఉద్యమ సభలలో మంత్రిగా, శాసన సభ్యుడిగా, అధికార భాషా అధ్యక్షుడిగా, ఇపుడు డిప్యూటీ స్పీకరుగా రకరకాల హోదాలతో కనపడే బుద్ధప్రసాద్‌గారు ఎప్పుడు ఎవరి చేత ఒక 'రాజకీయ నాయకుడు'గా అనిపించుకోలేదు. అదీ విచిత్రం,అదీ విశిష్టత. ఎందుకంటే ఒక రాజకీయనాయకుడిగాకన్నా రాజనీతిజ్ఞుడిగానే ఆయన అందరి అభిమానాన్ని పార్టీలకి, వ్యక్తులకు, సంస్థలకు, అతీతంగా పొందగలిగారు. రాజకీయ నాయకుడు ఎన్నికలు గురించి, పదవి గురించి, ప్రభుత్వ హోదాగురించి ఆలోచిస్తే... రాజనీతిజ్ఞుడు రాజ్యం గురించి, రేపటి గురించి ఆలోచిస్తారు. బుద్ధప్రసాద్‌గారు చేయాలనుకున్న, చేసిన, చేస్తున్న పనులన్నీ కూడా ఇప్పటికిప్పుడు ఫలితాలు ఇవ్వడానికి కన్నా భవిష్యత్తును శాశ్వతంగా బలపడేలా చేయడానికి ఉపయోగపడతాయన్నది. భాష గురించి, మన సంస్కృతి, సాహిత్యం గురించి, బుద్ధప్రసాద్‌గారు అనేక చోట్ల బలంగా వినిపించడం వలన ఇప్పుడు కాకపోతే రేపైనా... మనదైన, మన సొంతమైన, మన బలమైన వారసత్వాన్ని తిరిగి దక్కించుకొని నిర్మాణాత్మకమైన సమాజానికి శ్రీకారం చుడదామనే ఆశ కలుగుతోంది !

తెలుగు నేల రెండు రాష్ట్రాలుగా విడిపోయిన ఈ సందిగ్ధ సమయంలో... శ్రీ బుద్ధ ప్రసాద్ రచయితలకి, కళాకారులకి ఉపాధిని, గౌరవాన్ని ఇచ్చే ఒక హోదాను సాధిస్తారని, ఇవాళ అందరి తెలుగు వారిలోనూ ఆశ కొలువుంది! ఆంధ్రప్రదేశ్‌ని దేశంలోనే గొప్ప వెలుగు దివ్వెల సీమగా నిలబెట్టడంలోనూ శ్రీ మండలి తన వంతు ప్రయత్నం చేస్తూనే ఉంటారని, ఈ ప్రయత్నంలో ఆయనకి అన్ని విధాల సహాయ సహకారాలు అందాలని ఆశిస్తున్నాను.



## సాహిత్య నిబద్ధప్రసాద్

# శ్రీ మండలి బుద్ధ ప్రసాద్

- డా॥ బూదాటి వెంకటేశ్వర్లు

ఎక్కడ బుద్ధ ప్రసాద్‌గారుంటారో అక్కడ సాహిత్య పరిమళం గుభాళిస్తుంది. ఆయనను బుద్ధప్రసాద్ గారన్నారు గాని (సాహిత్య నిబద్ధ ప్రసాద్) అంటే సమంజసమేమో!

'వానలో తడియని వారు, మద్దురు వధాన మృదూక్తి మరందధారలో కదుగని వారు కానగరారు తెన్గునాడునన్'- అని విశ్వనాథ వారన్న సూక్తిని మండలివారికి సమన్వయించవచ్చు. ఎందుకంటే వారిచేతి మీదుగా సత్కారాన్ని పొందటమో, పుస్తకాన్ని ఆవిష్కరింప చేసుకోవటమో, వారి సాయంతో పుస్తకాన్ని ప్రచురించుకోవటమో, వారితో వేదికను పంచుకోవటమో చేయని తెలుగు సాహితీవేత్తలు తెలుగునాట కనిపించరు.

రాజకీయాలలో సంస్కారానికి ఆస్కారంలేదని బాధపడేవాళ్లు బుద్ధప్రసాద్‌గారిలో రాజకీయాలకు ఆస్కారంలేనిసంస్కారం చూసి సంబరపడతారు. భాషా సాహిత్యాల ప్రేమికునిగా వారు ఒక కృష్ణదేవరాయలనే స్ఫురింపజేస్తారు. ఏ ఆర్భాటమూలేని వారి వ్యవహార శైలి సవ్వడి చేయని కవ్వడిని స్ఫురింపజేస్తుంది.

ధవళకాంతులీనే వస్త్రాలను ధరించి చెదరని చిరునవ్వుతో ఎదమాయని సాహిత్య సంస్కారాన్ని ప్రోది చేస్తున్నట్లు సామజవరగమనుడై ఆత్మీయంగా చూపులతోనే పలుకరిస్తు భాషా ప్రేమికుల్ని అలరించే బుద్ధప్రసాద్ గారు మండలి వంశాబ్ధిని ఉదయించిన చంద్రుడు. తెలుగు తల్లి ఎదమీటిన భావతరంగాలతో ఎగసిపడే సముద్రమే.

శ్రీకాకుళంలో కృష్ణదేవరాయల ఉత్సవాలు జరిపినా, పెద్ద కళ్లేపల్లిలో వేటూరివారి కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించినా, కృష్ణాజిల్లా రచయితల సంఘంవారి ఆధ్వర్యంలో ప్రపంచ తెలుగు రచయితల సభలు జరిపించినా, అధికార భాషా సంఘం అధ్యక్షులుగా ప్రభుత్వం చేత ప్రపంచ తెలుగు సభలు జరిపించినా, అటా-తానా వారి సభలకు అతిథిగా విచ్చేసినా వారి వ్యక్తిత్వం ఎప్పుడూ తొణకని బెణకని నిండుకుండే ప్రపంచ వ్యాప్తంగా తెలుగు వారున్న ప్రతిచోటా పరిమళించే శ్రీగంధమే.

"రమ్మంటె చాలుగాని రాజ్యాలు విడిచిరానా
నీ చిన్ని నవ్వులకోసం స్వర్గాలు గడిచిరానా" అన్న ఉర్దూ కవి ప్రేమభావన బుద్ధప్రసాద్‌గారి విషయంలో సాహిత్యానికి, భాషకు అన్వయించవచ్చు. అటువంటి

## 'బుద్ధం శరణం గచ్ఛామి'

**- శ్రీ మహమ్మద్ సిలార్**

వేలనాళ్ళ క్రిందట బుద్ధుడు తపమాచరించాడు ప్రజల దుఃఖ కారణం వెతికి బట్టుకున్నాడు. మానవుల కోర్కెలే దుఃఖకారణం అన్నాడు. జనులకు 'దమ్మపథం' చెప్పి మోక్షం చూపాడు. జనం 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నాడు. జనులు ధర్మమార్గాన సంఘం శరణుజొచ్చారు. రాజులు సర్వజన హితాయ, సుఖాయ అన్నారు.

ధర్మదేవత నాల్గుకాలాల నాల్గుపాదాలా నడిచింది. ఏండ్లూ పూండ్లూ గడిచాయి - వలసరాజ్యం పోయింది గాంధీ నెహ్రూలు గతించారు - గాంధీల రాజ్య మొచ్చింది. అర్థరాత్రి స్వతంత్రం 'అరచేత' వైకుంఠమయింది.

గడ్డీగాదం తినే రెండుకాళ్ళ పశువు లొచ్చాయి. సంక్షేమరాజ్యంలో 'సంక్షేమం' కొంతమందిదయింది భారతమాత సంక్షోభంలో కూరుకుపోయింది. గనులు, ఖనిజాలు, మడులూ, మాన్యాలు, నదీనదాలు, అడవులు, గుట్టలు, కావేవీ తింటానికనర్హం. రాజకీయ వాతానబడిన సంఘం చచ్చుబడింది. మూడుకాళ్ళూ మూలబడి, ధర్మం ఒంటికాలదేకింది. అందుకే మరో బుద్ధుని అవసరం వచ్చింది. ఆనాటి బౌద్ధం 'సంఘం శరణం' గచ్ఛామి అన్నది. నేటి 'దివి సమాజం' బుద్ధం శరణం గచ్ఛామి అన్నది. ఆంధ్రరాజ్యానికి మండలి బుద్ధుడు (వర) ప్రసాదుడయ్యాడు.

అనుభవమే నాకు జరిగింది. నేను సత్తుపల్లి ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో పనిచేస్తున్నప్పుడు 'మాతృభాషాదినోత్సవం' - పేరుతో తొలిసారిగా సత్తుపల్లికి వారిని ఆహ్వానించాను. అప్పటి స్థానిక రాజకీయాలు, అప్పుడు వారున్న రాజకీయ పార్టీకి భిన్నమైనవి. వారు వస్తారని నేను భావించలేదు. 'గాలికి పోయే పేలపిండి రామార్పణం' - అన్నట్లుగా మామూలుగానే పిలిచాము. ఆహ్వాన పత్రం పంపాం. ఏ హంగూ ఆర్భాటాలు చేయలేదు. కాని కార్యక్రమం ఇంకా ఒక గంటకు ప్రారంభమవుతుందనగా ముందే వచ్చి ఆర్&బి అతిథిగృహంలో దిగి, పి.ఏ.తో కబురు చేశారు. ఆ కబురు విన్న నాకు ఎంత ఆనందం కలిగిందో అంత భయమూ వేసింది. అతిథిగృహానికి వెళ్లి కలిసి, భారీ ఏర్పాట్లేవీ చేయలేదని భయపడుతున్న నన్ను భుజాన చెయివేసి మా శ్రీకాకుళ తీర్మానాన్ని ముందుకు తీసుకుపోవటానికి మాకొక

కార్యకర్త దొరికినందుకు ఎంతో సంతోషంగా ఉందని కరచాలనం చేసి ఆత్మీయంగా దగ్గరకు తీసుకున్నారు.

వారి రాకతో ఆ రోజు సభాభవనం క్రిక్కిరిసిపోయింది. ఆ రోజు అర్ధరాత్రి వరకు స్థానిక భాషాభిమానులు, సాహిత్యవేత్తలు, విద్యార్థులు, రాజకీయాలకు అతీతంగా అందరితో ముచ్చటిస్తూనే గడిపారు. వెంగళరావుగారితో మెలగిన ఆ తరం నాయకులు అతిథిగృహానికి వచ్చి, వెంకట కృష్ణారావుగారు, వెంగళరావు గార్ల అనుబంధాన్ని, ఆ స్మృతుల్ని ముచ్చటించటంతో బుద్ధప్రసాద్‌గారు ఆ రోజు ఎంత సంతోషపడ్డారో నాకిప్పటికీ మరపురాని స్మృతి. ఈ సంఘటనే "రమ్మంటే చాలుగాని రాజ్యాలు విడిచిరానా, నీచిన్ని నవ్వుల కోసం స్వర్గాలు గడిచిరానా?" - అన్న ఉర్దూ కవి రుబాయి నా గుండె తలుపులు తట్టింది. అప్పటి నుండి వారి స్నేహ్నాగణంలో నేను ఒకడినైనాను.

నేను ద్రావిడ విశ్వవిద్యాలయానికి వచ్చాక వారు మా విశ్వవిద్యాలయానికి రెండు మూడుసార్లు విచ్చేశారు. మా విశ్వవిద్యాలయంలో జరుగుతున్న పరిశోధనను భాషావిషయికంగా జరుగుతున్న కృషిని చూసి ద్రావిడ విశ్వవిద్యాలయంలో జరుగుతున్న కృషి ప్రచురించిన పుస్తకాలు బయట ప్రచారంలో లేవని బాధపడ్డారు. తెలిసిన ప్రతి వారికి మా సంస్థ గురించి చెప్పేవారు.

ప్రపంచ సభలలో ప్రధాన వేదికపై మా విశ్వవిద్యాలయ ప్రచురణల్ని ఆవిష్కరింప చేయటంగాని, ఒక సదస్సు మా విశ్వవిద్యాలయం నిర్వహించటానికి ప్రపంచసభలలో అవకాశం లభించటంగాని వారివల్లనే మాకు సాధ్యమైంది. అధికార భాషా సంఘం అధ్యక్షులుగా తెలుగు కోసం వారు పడ్డ తపన స్ఫూర్తిదాయకమైంది. వావిలాల గోపాలకృష్ణయ్య గారి తరువాతి ఆ సంస్థకు అంతటి చాకిరీ చేసింది మండలి వారే. అధికార భాష అమలు కోసం న్యాయస్థానాలలో, స్వాతంత్ర్యానికి పూర్వం ఇచ్చిన తెలుగు తీర్పుల్ని కూడ గాలించిన గవేషణ వారిది. అందుకోసం వారు ఎన్నో సదస్సుల్ని నిర్వహించారు. ప్రతి బోర్డు పుట్టలో తెలుగు కోసం వెదికారు. పైరవీలు లేనివే పై రవి కూడా కదలని ఈ కాలంలో సమర్థతను అంచముక్కులా వెదుక్కునే వారి విశిష్ట వ్యక్తిత్వమే ఎందరినో ఉన్నత స్థానాల్లో నిల్పింది. రాష్ట్రేతరులుగా, ప్రవాసులుగా ఉన్న అందరి నోళ్లల్లో తెలుగంటే గుర్తుకొచ్చే స్ఫురన్మాధురీ మూర్తి మండలివారే. రాష్ట్రం రెండుగా విడిపోయినప్పుడు తెలుగు భాషా ప్రేమికుడిగా వారు పడ్డవేదన మాటల్లో వర్ణించడానికి వీలులేదు. వారు మరి ఎన్నో విజయాలు సొంతం చేసుకోవాలని ఆకాంక్షిస్తూ, సరస సాహసౌదార్య ఘనపౌరుషాలతో వర్ధిల్లాలని కోరుతున్నాను. 

# కృష్ణా డెల్టా పరిరక్షణ- శ్రీ బుద్ధప్రసాద్ కృషి

*-శ్రీ టి. శోభనాద్రి*

నవంబరు 19వతేది, 1977వ సంవత్సరం, కృష్ణాజిల్లాలోని దివిసీమ పెను తుఫానుకు గురైంది. తుఫాను బీభత్సానికి దివిసీమంతా అల్లకల్లోలమై కాలువలు రోడ్లు నామరూపాలు లేకుండా కొట్టుకుపోయాయి. 1955లో నిర్మించిన 9 అడుగుల ఎత్తు కరకట్ట దివిసీమ చుట్టూ ఉన్నది కొట్టుకుపోయినది. 10,000 మంది ప్రాణాలు కోల్పొయారు. దివిసీమ పునర్మిణాన్ని చేపట్టటం, నీటిపారుదల వ్యవస్థను పునరుద్ధరించి, సకాలంలో వ్యవసాయ భూములకు నీరందించటం, ఎట్లాగ అని కొట్టుమిట్టాడుతున్న తరుణంలో, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, మా ఇంజనీర్లు, కార్మికుల స్వచ్ఛందసంస్థల మధ్యనే మసలుతూ, నిరంతరం పాటుపడినందు వలనే దివిసీమ దివ్యసీమైంది. అటువంటి విపత్కర పరిస్థితులలో అందరితోను ఉండి అనన్య సామాన్యమైన సేవలందించారాయన. శ్రీ బుద్ధప్రసాదు తండ్రికి చేదుడువాదోడుగా నిలిచారు. దివిసీమ పునరావాస పునర్నిర్మాణంతో పాటు కృష్ణాడెల్టా సమస్యలను ఎప్పటికప్పుడు పరిష్కరించుటకు నిర్మాణాత్మకమైన చర్యలు చేపట్టడం, అనుకున్న పనిని సాధించటం, బుద్ధప్రసాదు గారి ప్రత్యేకత. 1998 అక్టోబరులో కృష్ణానది వరదలు చుట్టుముట్టినప్పుడు, దివిసీమలోని చిరువోల్లంక మొదలైన గ్రామప్రజల రక్షణార్ధం ప్రజలను ఉత్తేజపరచి వరద బాధనుండి కాపాడిన వారు బుద్ధప్రసాద్. 2005, 2006 సంవత్సరములలో కృష్ణా నదికి వరదలు వచ్చినప్పుడు జిల్లా అధికార యంత్రాంగాన్ని సమన్వయపరచి, ప్రాణనష్టంగాని, పశు నష్టం గాని జరగకుండా చర్యలు తీసుకొన్నారు.

2003, 2004సం॥లో పులిగడ్డ –పెనుమూడి వంతెన నిర్మాణ స్థలం మార్పిడిని నిరోధించి తన ఎం.యల్.ఎ. పదవిని సైతం పణంగా పెట్టి, ప్రజా ఉద్యమం చేపట్టి, ముందుగా నిర్ణయించిన చోటునే వంతెన నిర్మాణానికి ప్రభుత్వాన్ని అంగీకరింపచేసి నాటి ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు గారిచే శంకుస్థాపన చేయించింది శ్రీ బుద్ధప్రసాదే. దీనివలన కృష్ణా గుంటూరు జిల్లాలు మరింత దగ్గరవటమే కాకుండా నరసాపురం – ఒంగోలులకు 150 కి.మీ దూరం తగ్గినది. ఆంధ్రప్రదేశ్ నూతన ప్రభుత్వం రూపొందించు చున్న కోస్టల్ కారిడారు కు కూడా ఈ వంతెన ద్వారా రవాణా సులభతరం అవుతుంది.

2004 సం॥లో వర్షాభావ పరిస్థితుల వలన కృష్ణాడెల్టాకు మొదటి పంటకు కూడా నీరు అందని పరిస్థితులలో, ప్రజా ఉద్యమాన్ని చేపట్టి, డెల్టా పరిరక్షణ పేర మచిలీపట్నం

కోనేరు సెంటరులోనూ దరిమిలా ప్రకాశం బ్యారేజీపైన నిరాహార దీక్ష చేసి ప్రభుత్వాన్ని స్పందింపజేసి సకాలంలో డెల్టాకు నీటిని విడుదల చేయించిన ఘనత శ్రీ బుద్ధప్రసాదుదే.

కృష్ణా డెల్టాను, నీటి కష్టాలనుండి గట్టెక్కించడానికి పులిచింతల ప్రాజెక్టు నిర్మించితే 45 టి.యసి.ల నీరు నిలువ ఉంటుంది. అని ఒప్పించి ఆనాటి ముఖ్యమంత్రి గౌ. కీ॥శే॥ రాజశేఖరరెడ్డి గారిచే పులిచింతల ప్రాజెక్టుకు శంఖుస్థాపన చేయించినది శ్రీ మండలి బుద్ధప్రసాదు.పులిచింతల ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయినది. ది. 9.12.2013 తేదీన అప్పటి ముఖ్యమంత్రి శ్రీ కిరణ్‌కుమార్ రెడ్డి గారు ప్రాజెక్టును ప్రారంభించారు. ఇది గుర్తింపదగిన చరిత్రాంశము.

కృష్ణాడెల్టా ఆధునీకరణ పనులు చేపట్టుటకు, ప్రణాళికలు రూపొందింపజేసి, యనమలకుదురు నుండి మోపిదేవి వరకు కృష్ణానది కరకట్ట రోడ్డు నిర్మాణాన్ని సాకారం చేసినది శ్రీమండలి బుద్ధప్రసాదు. దీనివలన విజయవాడ నుండి మోపిదేవి వరకు 20 కి॥మీ దూరం తగ్గినది. ప్రయాణకాలం కూడా తగ్గింది.

కృష్ణానదిపై మహారాష్ట్ర ప్రభుత్వం ఆలమట్టి డాం నిర్మించటం దానిపై తలుపుల నమర్చటం, దానిని బ్రిజేష్‌కుమార్ ట్రిబ్యునల్ సమర్థించటం, మన ప్రాంతం నష్టపోయే పరిస్థితి ఏర్పడటం మనకు అశనిపాతం. దీనిపై శ్రీ బుద్ధప్రసాదు వెంటనే స్పందించి 2011 జనవరిలో రాజకీయాలకు అతీతంగా బ్రిజేశ్ తీర్పు ఏర్పడిన విపత్కర పరిస్థితిని ఎదుర్కొనేందుకు పోరాటం చేయాలని నిర్ణయించి విజయవాడలో రైతు ప్రతినిధులు, ఇంజనీర్లతో వేదిక నిర్వర్తించారు. దీనిని సాకారం చేయుటకు రిటైర్డు లోకాయుక్త శ్రీ ఆర్. రామానుజం విశ్రాంత హైకోర్టు న్యాయమూర్తి శ్రీ అంబటి లక్ష్మణరావు గారు, మాజీ మంత్రులు విశ్రాంత చీఫ్ ఇంజనీర్లతో, విజయవాడలో మరల 11.1.2011న ఒక రౌండ్ టేబుల్ సమావేశం ఏర్పరచారు. తదుపరి నాటి ముఖ్యమంత్రివర్యులను ఒప్పించి బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ తీర్పుపై సుప్రీంకోర్టులో దావా వేయటం, సుప్రీంకోర్టు స్టే యివ్వటం, గత రెండు సంవత్సరాలలో జరిగిన పరిణామం.

కృష్ణానది అన్నా, కృష్ణాడెల్టా అన్నా, కృష్ణా తీరవాసులన్నా, కృష్ణానది జలాలతో సేద్యంచేసే రైతాంగమన్నా, వల్లమాలిన అభిమానం శ్రీ మండలి బుద్ధప్రసాదుకు! డెల్టా పరిరక్షణ పేరుతో రైతాంగ సమస్యలను పరిష్కరించాలనే సహృదయుడు శ్రీ బుద్ధప్రసాదు. శ్రీ బుద్ధప్రసాదు గారు కృష్ణాజిల్లా ముద్దుబిడ్డ అనటం అతిశయోక్తి కాదు. ఆంధ్రరాష్ట్ర నూతన శాసనసభకు ఉపసభాపతిగా శ్రీ బుద్ధప్రసాదుకు భగవంతుడు అన్ని విధాలా శక్తి సామర్థ్యాలను ప్రసాదించు గాక.



## ప్రజాప్రతినిధికి నిర్వచనం
# మండలి బుద్ధప్రసాదీయం

**- డాక్టర్ ఘంటా విజయకుమార్**

రాజకీయాల్లో ఆదర్శాలను వల్లించని నాయకులు లేరు. నైతికవిలువ గురించి నిత్యం ప్రవచించే అధినాయకులకు కొదవలేదు. అయితే నమ్మిన సిద్ధాంతాలను కార్యాచరణలో పెట్టే నాయకుల కొరత వర్తమానంలో అధికంగా ఉంది. ఆ లోటును భర్తీచేస్తూ, నేటి ప్రజాప్రతినిధులకు పూర్తి భిన్నంగా, ఉన్నత వ్యక్తిత్వంతో రాజకీయ నాయకుడంటే ఇలా ఉండాలన్పించుకునే అతికొద్దిమందిలో ఒక్కరు మా మండలి బుద్ధప్రసాద్.

ఉగ్గుపాలతోనే గాంధీయిజాన్ని నరనరాన, నెత్తుటి కణకణాన నింపుకున్న యువనేత ఆయన. అమ్మను మరచినా, అమ్మ భాషను మరచినా పుట్టగతులుండవంటారు. ఇద్దరిని నమ్ముకున్న వారు జాతిని జాగృతంచేసే దిశలో మున్ముందుకు సాగుతారు. ప్రజల హృదయాల్లో శాశ్వత స్థానం పొందుతారు. బుద్ధప్రసాద్‌గారు అంతే! ఆయన తెలుగుదనాన్ని ప్రేమించినంతగా ఎవ్వరినీ ప్రేమించి ఉండకపోవచ్చు. ఆయన మాటల్లో తెలుగు కొత్త అత్తరు సువాసనతో గుభాళిస్తుంది. బుద్ధప్రసాద్‌గారు తన తండ్రి రాష్ట్ర దివంగత విద్యాశాఖామంత్రి మండలి కృష్ణారావునుంచి వారసత్వంగా స్వీకరించిన సంపద వినయం, విధేయత, ఓర్పు, ఒదుగుదల. అన్నింటికి మించి మాతృభాషాభిమానం. ప్రపంచ తొలి తెలుగు మహాసభలకు పునాది మండలి కృష్ణారావుగారయితే తెలుగుకీర్తిసౌధానికి గట్టిపట్టు బుద్ధప్రసాద్. ఇలా చెప్పుకుంటూ పోతే అన్ని పొగడ్తలు లాగానే కన్పిస్తాయి. చాలా సందర్భాలలో నిజాలు అలానే ధ్వనిస్తాయి. ఎందుకంటే వాటిలో నిజాయితీ ఉంటుంది. ఆయన వ్యక్తిత్వాన్ని విశ్లేషించే కొద్ది నిజాయితీ, నిబద్ధత, కార్యదక్షత సాక్షాత్కరిస్తాయి. బుద్ధప్రసాద్ బహుముఖప్రజ్ఞాశాలి. తెలుగుసాహిత్యంలోని లాలిత్యాన్ని గుర్తించి, అమృతం కన్నా మిన్నయిన మన మాతృభాష వైభవాన్ని దశదిశలు చాటగలిగిన సత్తా ఉన్న అచ్చ తెలుగువాడతను. ఎంత చదువరో.. అంతలోతుగా విశ్లేషించి విమర్శించగల నేర్పరి. లండన్‌లో తెలుగువారికి తొలి నిఘంటువును లిఖించిన మహనీయుడు సిపిబ్రౌన్ సమాధి ప్రాంగణాన్ని అభివృద్ధి చేయటంలో ఆయన చూపిన చొరవ మరువరానిది. జిల్లా తెలుగురచయిత (త్రు)ల సంఘానికి గౌరవాధ్యక్షునిగా ఉండి, ప్రపంచస్థాయిలో తెలుగు రచయిత సభలను నిర్వహింపచేయటంలో ఆయన మార్గదర్శకత్వం స్ఫూర్తిదాయకం. 2012లో ప్రపంచ తెలుగుమహాసభల నిర్వాహణకు ఆయన చేసిన పూర్వరంగ కృషి

అనితరసాధ్యమయినది. ఓ రాజకీయపార్టీలో క్రియాశీలకభూమిక నిర్వహిస్తున్నప్పటికి రాజకీయాలకతీతంగా డెల్టా ఆయకట్టు భూమి పరిరక్షణ ఉద్యమాన్ని అన్ని పార్టీల నేతలను కలుపుకుని నిర్వహించిన తీరు మరువలేనిది. మంత్రిగా, శాసనసభ్యునిగా ఆయన కృషి ఫలితంగా పెనుమూడి వంతెను, పులిగడ్డ –విజయవాడ కరకట్ట అభివృద్ధి సాధ్యమయ్యాయి. తెలుగుభాషోన్నతికి మండలి నిర్వహిస్తున్న కృషి మరువలేనిది.

తెలుగుభాష పట్ల అపార ప్రేమాభిమానాలున్న బుద్ధ ప్రసాద్ తెలుగుజాతిని రెండు ముక్కలుగా చేసే చర్యలను తట్టుకోలేక తరతరాలుగా తమ కుటుంబం నమ్ముకున్న కాంగ్రెస్‌కు వీడ్కోలు చెప్పారు. మంత్రిహోదా వున్న అధికారభాషాసంఘం ఛైర్మన్ పదవిని వదులుకున్నారు. తెలుగు ఆత్మాభిమానానికి ప్రతీకగా ఆయన నిలిచారు. శాంతమూర్తయిన బుద్ధప్రసాద్ కాంగ్రెస్‌ను వదిలి తెలుగుదేశంలోకి అడుగుపెడితే ఆయన నియోజకవర్గప్రజలు ఆయనతోనే నడిచారు. ప్రజలు మెచ్చిన నాయకునిగా ఎదిగిన బుద్ధప్రసాద్ అత్యంత ప్రతిష్టాత్మక ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఉపసభాపతిగా ఎన్నిక కావటం గాంధేయ వాదాని కిచ్చిన సముచిత గౌరవం. ఆయన ఉన్నత శిఖరాలను అధిరోహించటం వ్యక్తిగతంగా మా అందరికి అనిర్వచనీయ ఆనందం.

# పేరే మందారం

**- శ్రీమతి చలసాని వసుమతి**

మాతాపితలు సాంఘిక సాహిత్య ప్రియులు
వసంతంపరిచిన ఊయలకదా కన్నా నీది.
కృష్ణమ్మ సాక్షిగా
తథాగతుడు సదాగామిగా
నీ ఆహార్యాన్ని కూర్చి కనువిందు చేశాడు.
అవునా నాన్నా!
నిండు సభలకు దివ్య ప్రభవు
పలుచని సభలకు నిరాడంబరుడివి
రాకపోకలకు విలువలు కట్టి
లోపాలను తాపంగా మార్చుకునే
తోటి వేదిక మిత్రులకు ఆదర్శమూర్తివి
కష్ట సుఖాలకు,
విలువల ఆరోహణ, అవరోహణలకు
అతీతంగా సిద్ధార్థుడవై నిలిచావు.
రామనామంలా మాతృభాషా మమత పెంచి
లక్ష్మణ రేఖను గీసి
ఆంగ్ల శబ్దానికి హద్దుపెట్టావు.
సాహిత్య సభలకిప్పుడు వసంతాలే
ప్రథమ వీక్షణంలోనే
సిద్ధార్థుడే ఈ బిడ్డ అని తలచిన నన్ను
నిజంగానే యశోదమ్మా అని పిలిచావు,
రంగరించిన ప్రేమతో.
నాన్నా రచయితల పూలతోటకిప్పుడు
నువ్వు వనమాలివి
చిరంజీవివై వర్ధిల్లాలని అమ్మ ఆత్మీయంగా.

# ఆనందాభినందనలు

**- శ్రీ బి. హనుమారెడ్డి**

భారత ఉపఖండంలోని తెలుగు ఖండానికి బుద్ధిప్రసాదిత వరం శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు.

తెలుగు జాతికోసం, తెలుగు భాషకోసం, తెలుగు సంస్కృతికోసం తన విలువైన సమయాన్ని వెచ్చించి ఆంధ్రప్రాంత ప్రజల్లో, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంలో ఒక గొప్ప కదలికను చైతన్యాన్ని తెచ్చిన వ్యక్తి శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు. తెలుగుభాష, సంస్కృతిపై ప్రేమతో పలు సాహితీ సాంస్కృతిక సంఘాల సహకారం కూడగట్టి తెలుగు భాషా సంస్కృతీ చైతన్య యాత్రను తీరప్రాంత జిల్లాలలో నడిపారు.

తన తండ్రి నుండి పుణికిపుచ్చుకున్న భాషా ప్రేమతో తండ్రి వలెనే ప్రపంచ తెలుగు భాషా మహాసభలను తిరుపతిలో నిర్వహించటంలో పూర్తి బాధ్యతలను స్వీకరించి ప్రభుత్వంచే భాషాపరంగా పలుచర్యలకు మూలకారకులైనారు.

అన్ని రంగాలలో, తెలుగును వాడటానికి అధికారభాషా సంఘాధ్యక్ష పదవి అవకాశం వచ్చినప్పుడు అవసర చర్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్ళారు. అధికార భాషాసంఘం ద్వారా కొన్ని అవసర గ్రంథాలను ప్రచురింపచేసి, సభలు సమావేశాలు జరిపి, మాతృభాషా పరిరక్షణకు కంకణం కట్టుకున్నారు. తెలుగుభాష – మాతృభాషను దయనీయ స్థితినుండి ఉద్ధరించే మహాయత్నంలో, ప్రభుత్వం వైపు నుండి, ఒకపక్షం ప్రజలనుండి వచ్చిన వ్యతిరేకతలనుకూడ తన నైపుణ్యంతో అధిగ మించగలిగారు. తెలుగు భాషా సంస్కృతులకు పూర్వవైభవం తేవటానికి ప్రజలను, ప్రభుత్వాన్ని జాగృత పరచారు.

బుద్ధప్రసాద్‌గారు మృదు స్వభావి. మనిషి, మనసు, మాట అన్నీ మృదువుగానే ఉన్న వ్యక్తి. తన పూర్వీకులు, ప్రత్యేకించి తన తండ్రిగారి వద్ద నుండి వచ్చిన జన్యువులు తనను మంచి స్థాయికి తెచ్చాయి. ఆ కుటుంబం ఎల్లప్పుడూ ప్రజలతో మమేకమై, ప్రజల అవసరాలను తీర్చి ప్రజల హృదయంలో ప్రతిష్ట చేయబడ్డది. ఏ సత్ఫలితం పొందాలన్నా ప్రజల భాగస్వామ్యం అవసరమని ధృడంగా నమ్మారాయన. తనలోని వినయం సౌభ్రాతృత్వం చిన్న–పెద్ద, తక్కువ–ఎక్కువ వారినందరిని సమ దృష్టితో స్వీకరించే మంచి మనసు ఆయనకు తరగని ఆస్తి. ఆయన చిరునవ్వు అందరినీ జయించగల మహాయుధం. వారికివే నా ఆనందాభినందనలు.

# అందరివాడు.... శ్రీ మండలి

- శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి

తండ్రి చేతిలో తన చేయి ఉంచి
తప్పటడుగుల ప్రాయంలో
తండ్రిని అనుసరించి
వెన్నంటి తానుండి... కనుసన్నల మెలగి
తండ్రి ఋణము తీర్చుకున్న
తనయుడితడు !
తెలుగు తల్లి బాధ తెలిసి...
తెలుగు సంస్కృతి నిలుపదలచి
అమ్మ చేతి గోరు ముద్దలో
తీపిదనం గుర్తుకొచ్చి
వీధులన్నీ తిరిగి వాడలందు కూడి
కృ.జి. ర.సం సహకారం
సభలకు శ్రీకారం !
తెలుగు అన్నదమ్ముల కలుపుకుని
భాష యొక్క విలువ తెలిపి
తెలుగు తల్లి ఋణం తీర్చుకున్న
తనయుడితడు !
జల ప్రళయ బాధితులకు సహకారమందించి
పదుగురి కోసం ప్రతిదినం శ్రమియించి
తాగునీటి కోసం ఒంటరిగా ఉద్యమించి
అన్నదమ్ముల విడదీయద్దని పలుమార్లు
ప్రార్థించి
విడదీసిన వైనానికి నిరసించి – నీరసించి
పదవే వద్దని వదిలి ప్రజాక్షేమానికి తపించిన
తెలుగు ప్రజల అన్న ఇతడు !
మాటకు బద్ధుడై.... శాంతికి బుద్ధుడై
ప్రజాహితానికి నిబద్ధుడైన
నవ్యాంధ్రకు తొలి 'ఉపసభాపతి'
శ్రీ మండలి బుద్ధ ప్రసాదు గారికి
మా హృదయపూర్వక శుభాభినందనలు!!

# మాణిక్యం

- శ్రీమతి సింహాద్రి పద్మ

రూపుదాల్చిన గాంధేయ వాదంతో
వన్నె తెచ్చిన నాయకుడివి !
సాహిత్యం ఆత్మీకరించిన
తెలుగు భాషోద్యమ రథసారథివి !
సమస్యల పోరాటంలో–
సాధనా సాకేతుడవు!
మెచ్చి వచ్చిన పదవులతో –
ఖ్యాతి నందించే జోతవు !
సమాదరణీయ ప్రజలకు,
వినయ సంపాదకుడవు!
కవిత్వ సంచాలకులకు వివేక సంపాతివి!
తెలుగు పద్య తాత్పర్యమైన
దివిసీమ కృష్ణరాయుడవు!
తెలుగు మహాసభలకు ప్రపంచ నేతవు
వరించిన విజయలక్ష్మికి వరసిద్ధార్థుడవు!
బుద్ధప్రసాదు మండలి వంశ మాణిక్యవీణ!
మీటిన చాలు రతనాల వాన!

# బుధానాం ప్రియ శ్రీ బుద్ధప్రసాద్

- శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్

"ఒక మట్టి గడ్డ తత్త్వం తెలిస్తే విశ్వ మృత్తికా, దాని తత్త్వం తెలిసినట్లే" అంటుంది వేదం. అలాగే మనిషిలోని ఒక గుణాన్ని కనిపెడితే అతని ఆంతర్యాన్ని ఆవిష్కరించవచ్చు. ఆత్మ క్షేత్రంలో జీవించే జీవితమే జీవితమని ఆ అనుభూతిని అందరూ పొందాలని సత్యమే గమ్యమని త్యాగమే మార్గమని జీవితానికది మూలాధారమని స్వార్థం లేని క్షణంలోనే మనం నిత్య జీవిత సుఖాన్ని, మనలోని దివ్యత్వాన్ని దర్శిస్తామని స్వామి వివేకానంద తెలియజేశారు. మాటలు అందరం చెప్పగలం కాని ఆ మాటలకు నిలబడి జీవితంలో వేసే ప్రతి అడుగులోనూ అది ప్రతిబింబింపజేసే వారు కొద్ది మంది మాత్రమే ఉంటారు. అందుకే వారు బుధజనులకు ఇష్టంగా ఉంటారు దేవతలకు ప్రియులౌతారు. అలాంటి అరుదైన వ్యక్తిత్వం ఉన్న వారు ఈ నాటి సన్మానితులు, కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఉపసభాపతి గౌ.శ్రీ మండలి బుద్ధప్రసాద్.

ఎవరికీ లేని, పట్టని తెలుగు భాషా, భారతీయ సంస్కృతులు ఆయనకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. వాటి సంరక్షణకు, పరివ్యాప్తికి అహరహం కష్టపడే తత్త్వం ఉన్నవారు శ్రీ బుద్ధప్రసాద్‌తో నా తొలిపరిచయం వారి స్వగ్రామం అవనిగడ్డలో.

ప్రభుత్వానికే పట్టని నేతాజీ శుభాస్ చంద్రబోస్ శత జయంతిని ఆయన అక్కడ నిర్వహించారు. పేపర్‌లో వార్త చూసి వెళ్లాను. ఎంత హుందాగానో, భక్తితత్పరతతోనో జరిపారు. అప్పుడే ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడు శ్రీ ఎస్.వీ.రామారావుగారు పరిచయమయ్యారు. ఆ తర్వాత భారతీయ సాహిత్య పరిషత్ కృష్ణాజిల్లా అధ్యక్షులు, ప్రముఖ కథా రచయిత, నాకు అత్యంత ఆప్తులు శ్రీ ఆర్.ఎస్.కే మూర్తిగారు "కథా సదస్సు"ను అవనిగడ్డలో శ్రీ బుద్ధప్రసాద్ ఆధ్వర్యంలో నిర్వహించినప్పుడు రెండోసారి పరిచయం జరిగింది. ఈ రెండు సభల్లో బుద్ధప్రసాద్ గారి కార్యదీక్ష, అంకిత భావం పెద్దల యెడ గౌరవం, మాటలో సంస్కారం, నడవడిలో సభ్యతా, విషయ పరిజ్ఞానం నాకు తెలిశాయి. ఆయన అంటే ఆరాధనతో కూడిన సాన్నిహిత్యం ఏర్పడింది. అప్పటి నుండి ఆయన ప్రతి కదలికా నాకు ఆదరణీయం అయింది. శ్రీ మధురాంతకం రాజారాం గారు గాంధీ గారిపై "తాత దిగిపోయిన బండి" కథలను సంకలనం చేసి బుద్ధ ప్రసాద్ గారి ఆధ్వర్యంలో ముద్రించారని తెలిసి వీలుంటే ఒక కాపీ ఇమ్మని అడిగితే ఇంటికి పంపించి తెప్పించి ఆత్మీయంగా ఇచ్చారు.

# తెలుగు తల్లి ముద్దుబిడ్డ

- శ్రీ వెలమల సిమ్మన్న

శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు నాకు రెండు దశాబ్దాలుగా పరిచయం. తెలుగు భాషకు సంబంధించిన ఏ సభ జరిగినా అక్కడ ప్రత్యక్షమయ్యే మొదటి వ్యక్తి బుద్ధప్రసాదు గారు. ప్రపంచ తెలుగు మహాసభల్ని మొట్టమొదటిసారిగా నిర్వహించి తెలుగు వారి కీర్తిని దశదిశలా వ్యాపింపజేసిన ఆనాటి విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి కృష్ణారావుగారి వారసత్వాన్ని పుణికి పుచ్చుకొన్నారు. కృష్ణాజిల్లా రచయితల సంఘానికి గౌరవ అధ్యక్షులుగా ఉండి ప్రపంచ తెలుగు రచయితల, మహాసభల్ని నిర్వహించటమే గాకుండా తెలుగు పసిడి, వజ్రభారతి, ప్రాచీన భాషా ప్రతిపత్తికి సంబంధించిన గ్రంథం, కృష్ణా జిల్లా సర్వస్వం, తెలుగు మణిదీపాలు లాంటి మహోన్నత గ్రంథాల్ని వెలువరించిన తెలుగు తల్లి ముద్దుబిడ్డ మండలి బుద్ధప్రసాద్‌గారు.

బుద్ధప్రసాద్‌గారితో భాషాచైతన్య యాత్రల్లో పాల్గొనే అదృష్టం నాకు కలిగింది. అంతేకాదు వారు నిర్వహించిన ప్రపంచ తెలుగు రచయితల మహాసభల్లో ఒక కార్యకర్తగా పాల్గొనే అవకాశం నాకు లభించింది. విశాఖ పట్టణం ఎప్పుడు వచ్చినా తప్పనిసరిగా వారిని కలుస్తూ ఉంటాను. తెలుగుభాష సంస్కృతుల్ని గూర్చి తప్పక మరే విషయమూ మా మధ్య ప్రస్తావనకు రాదు. బుద్ధప్రసాద్‌గారు రాజకీయ నాయకుని కంటే సాహిత్య అభిమానిగా ఉండటానికే ఇష్టపడతారు. అందరినీ ఆప్యాయంగా, నవ్వుతూ పల్కరించే సాత్త్వికమూర్తి ఆయన. పదవుల కోసం ప్రాకులాడే తత్త్వం కాదు వారిది. తన పని తాను చేసుకుపోతుంటే ఫలితం అదే వస్తుందని నమ్మే మంచిమనిషి బుద్ధప్రసాద్‌గారు. అందుకే ఆయనను ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి పదవి వరించింది. ఆ పదవి వల్ల బుద్ధప్రసాద్ గారికి, బుద్ధప్రసాద్‌గారి వల్ల పదవికి కీర్తి లభిస్తుందని ఆశిస్తున్నాను. వారికి నా శుభాకాంక్షలు తెలుపుతున్నాను.

కృష్ణా జిల్లా రచయితల సంఘం మొదటి జాతీయ తెలుగు రచయితల సదస్సును విజయవాడలో నిర్వహించినప్పుడు సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు గారు ఒక రోజు నాకు ఫోన్ చేసి "సెకండరీ స్థాయిలో తెలుగులో విద్యా బోధన" అన్న అంశంపై వ్యాసం రాయమని కోరారు. అప్పటిదాకా ఆయనతోనూ నాకు ప్రత్యక్ష పరిచయం లేదు. ఆ వ్యాసం రాయటం "తెలుగు పసిడి" లో అచ్చుఅవటం సభల్లో శ్రీ బుద్ధ ప్రసాద్ గారితో

శ్రీ జి.వి.పూర్ణచంద్‌తో పరిచయం గాఢమైంది. మొదటి ప్రపంచ సభలు రెండవ ప్రపంచ సభల్లో శ్రీ బుద్ధ ప్రసాద్ అద్వితీయ చాతుర్యం సభా రంజకమైన స్ఫూర్తిదాయక ఉపన్యాసాలు, ప్రతి క్షణం వేదిక దగ్గరే ఉండి కార్యక్రమాలను అత్యంత నియమబద్ధంగా నిర్వహించటం, పర్యవేక్షించటం తగిన సూచనలు చేయటం, "వజ్ర భారతి", "తెలుగు వెన్నెల" పుస్తక ప్రచురణలు, వాటిలో నాతో వ్యాసాలురాయించటం, మరింతగా బాంధవ్యం బలపడింది. భాషా సమస్యపై సదస్సులు న్యాయ స్థానాల్లో తెలుగు అమలు జేయటంపై సెమినారు ఆయన ఆలోచనా సరళికి అద్దం పట్టాయి. తెలుగు దేశంలో వివిధ రంగాలలో లబ్ధప్రతిష్టులైన మనీషుల జీవితాలను "తెలుగు మణి దీపాలు" పేర అందరితో రాయించి వెలుగులోకి తేవటం ఆయన ఆలోచనా వైవిధ్యానికి మచ్చుతునక. "ఘంటసాల" గారిపై నాతో ఇందులో వ్యాసం రాయించారు సంఘం "సూర్య చంద్రులు".

పురాతత్వ శాఖ, రచయితల సంఘం సంయుక్తంగా శ్రీ బుద్ధప్రసాద్ నాయకత్వాన మచిలీపట్నం ఫ్రెంచ్ వారి కోటలో కృష్ణాజిల్లా పూర్వ వైభవంపై జరిపిన సదస్సు ఎన్నో కీలక అంశాలను వెలుగులోకి తెచ్చాయి. ఈ ఆలోచన రావటం దాన్ని ఆచరణ సాధ్యం చేయటం ఎక్కడెక్కడి నుంచో నిష్ణాతులను ఆహ్వానించి ప్రసంగాలు చేయించటం పేపర్లు తయారు చేయించటం భగీరథ ప్రయత్నంగా చేయించారు. "ఉపన్యాసాలు గాలికే పోతాయి అవి పుస్తక రూపంలోకి వస్తేనే భావి తరాలకు ఉపయోగపడుతుంది" అని ఆయన ఎప్పుడూ చెప్పేవారు. అలాగే ఈ సదస్సులోని వ్యాసాలను "కృష్ణాజిల్లా సర్వస్వం" గా రూపొందేట్లు కృషి చేశారు. అందులో నేను "కృష్ణాజిల్లా సంస్థానాలు - సాహితీ పోషణ" అనే వ్యాసం రాశాను. ఆధునిక తెలుగు కథకు వందేళ్ళు వచ్చిన సందర్భంగా ప్రత్యేక కార్యక్రమం, తానా వారితో కలిసి "తెలుగు సంస్కృతీ" కార్యక్రమ నిర్వహణ శ్రీ బుద్ధప్రసాద్ ఆలోచనలే. తెలుగు భాషోద్యమ వ్యాప్తికి ఆంధ్రదేశమే కాదు తమిళనాడు, కర్నాటక, ఒడిసా మొదలైన రాష్ట్రాలలో పర్యటించి అక్కడి తెలుగు స్థితిగతులను తెలుసుకొని కావలసిన సాయాన్ని ప్రభుత్వం ద్వారా అందించే ఏర్పాటు చేశారు. మలేషియా, మారిషస్, ఇంగ్లాండ్, అమెరికాలు మొదలైన దేశాలు పర్యటించి అక్కడి తెలుగు వారితో కలిసిపోయి, జరుగుతున్న భాషా సాంస్కృతిక వికాసాలను తెలుసుకొని,మనం మరచిపోయిన వాటిని వారు నిలబెట్టు కొంటున్నారని ప్రతి సభలోనూ చెప్పి మనం అనుసరించాలని సూచన చేసేవారు. ఎంత చేసినా తెలుగు వ్యాప్తికి సాంకేతికత అవసరం అని గుర్తించి అంతర్జాలంలో తెలుగు వ్యాప్తికి, యునికోడ్‌లకు, ఫాంట్‌లను ప్రభుత్వమే ఉచితంగా అందించేట్లు కృషి చేశారు.

తన పర్యటన వివరాలనూ పుస్తకాలుగా తెచ్చిన ఘనత శ్రీ బుద్ధప్రసాద్ గారిది. శాసన సభ్యులుగా, వ్యవసాయ మంత్రిగా అధికార భాషా సంఘాధ్యక్షులుగా భాషా గౌరవాన్ని ఇనుమడింపజేయటానికి తీవ్ర ప్రయత్నమే చేశారు. పదవిలో ఉన్నా లేకున్నా ఆయనకు భాషా సంస్కృతిల గురించే అనుక్షణం ఆలోచిస్తారు. బహుశా ఇలా ఇంత తపనతో ఉన్న వ్యక్తి మరెవ్వరూ మనకు కనిపించరు. ఈ కార్యక్రమాలన్నిటిలో శ్రీ సుబ్బారావు, శ్రీ పూర్ణచంద్‌గార్ల సంపూర్ణ సహకారం ఉండటం వల్లనే సాధ్యమయ్యాయి. ఆలోచన ఆయనది ఆచరణ వీరిద్దరిది. వీరు వాటి విజయాలకు నాలాంటి వారిని అందులో భాగస్వాములను చేశారు. అందుకే వీటన్నిటికి నేను సాక్షిభూతుడిగా ఉన్నాను. ఏ సభనైనా ఆదర్శవంతంగా చరిత్రలో నిలిచిపోయేట్లు సంపూర్ణంగా సమగ్రంగా నిర్వహించాలన్నది ఆయన కృత నిశ్చయం. అలానే జరిగాయి. అన్నీ దేశ విదేశాలనుండి వచ్చిన పెద్దలన్నా, అతిధులన్నా, పండితులన్నా, శాస్త్రవేత్తలన్నా, కళాకారులన్నా శ్రీ బుద్ధప్రసాద్‌కు అమిత గౌరవం, ఆరాధనా భావం. అందుకే "బుధ జన విధేయుడు" అని, బుధ జనులకు కూడా ఈయనపై గౌరవాదరాలు, ప్రేమ, ఆత్మీయత ఉండటం వలన "బుధానాం ప్రియుడు" అయ్యారని నాకు అని పిస్తుంది.

ఉయ్యూరులో సరసభారతి నిర్వహించిన తెలుగు భాషా సదస్సుకు, ఉగాది కవి సమ్మేళనాలకు, పుస్తకావిష్కరణలకు గురజాడ, రవీంద్రుల నూట యాభైవ జయంతి వేడుకలకు పిలిచిన వెంటనే స్పందించి శ్రీ బుద్ధప్రసాద్ వచ్చి కీలక ఉపన్యాసాలను చేసి సదస్యులను ప్రభావితం చేశారు. ఏ ప్రసంగం చేసినా మూలాలను తరచి, అందులోని సారాన్ని అందించటం ఆయన ప్రత్యేకత.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శ్రీ చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఏర్పడటం అందులో శ్రీ బుద్ధప్రసాద్ గారి సర్వ సమర్ధతను నిజాయితీని నిర్మల మనస్సును, అజాత శత్రుత్వాన్ని, కలుపుగోలుతనాన్ని, హుందాతనాన్ని, మర్యాదాభూషణాన్ని గుర్తించి గౌరవ ప్రదమైన ఉపసభాపతి పదవి అందజేసి అత్యంత గౌరవాన్ని కల్గించటం అందరికి గర్వకారణం. ఈ పదవిలో అత్యంత సమర్ధవంతంగా పనిచేసి అందరి మన్ననలను అందుకొంటూ మరింత ఉన్నత పదవిని పొందాలని, ఈ పదవిలో ఉండికూడా తెలుగు భాషా సంస్కృతులకు ఇతోధిక సేవచేసే మహద్భాగ్యం కలగాలని కోరుకొంటున్నాను.

# భాషా పరితపన

- శ్రీ నూర్ బాషా రహంతుల్లా

తెలుగు భాష అభివృద్ధి కోసం నిరంతరం పరితపించే నాయకునిగా ఆయనకున్న పేరు అందరికీ తెలిసిందే. భాషాభివృద్ధి కోసం ఏం చెయ్యాలో మరొకరు ఆయనకు చెప్పవలసిన పనిలేదు. పదవిలో ఉన్నా లేకపోయినా తెలుగు భాష అభివృద్ధి కోసమే ఆయన పరిశ్రమించారు. సదా పరితపిస్తూనే ఉంటారు. తెలుగు అనగానే మండలి బుద్ధప్రసాద్ గారే మనకు గుర్తుకొస్తారు. మన తెలుగు కోసం ఈ స్థాయిలో కృషి చేసే రాజకీయ నాయకులు మరొకరు లేకపోవటమే అసలు కారణం. ప్రతి ఒక్కరినీ మరచిపోకుండా పలకరించే మంచి మనసు ఉంది. ప్రజల అవసరాలకు అనుగుణంగా స్పందించే సుగుణం ఉంది. సౌమ్యత ఉంది. ఇంతకంటే ఏ ప్రజలైనా కోరుకునేదేముంది?

2012 ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంగా నన్ను మరచిపోకుండా ఆయనే ఫోన్ చేసి తిరుపతి రమ్మన్నారు. అప్పుడు నేను కొన్ని కోరికలను వారి దృష్టికి తీసుకువెళ్ళాను. అవి స్థూలంగా ఇవి; వ్యక్తిగతంగా ప్రసాద్ గారు శ్రద్ధతీసుకొని కొన్ని పనులు సాధించారు. అలా అమలయినవి కొన్ని, అమలుకావాల్సినవి కొన్ని ఇంకా మిగిలి ఉన్నాయి.

1. నాగార్జున వెన్న, కొలిచాల సురేశ్ లాంటివారు తమ సాంకేతిక పరిజ్ఞానంతో తెలుగుకు అద్భుతమైన సేవ చేశారు. యూనికోడేతర ఫాంట్లన్నిటినీ యూనీకోడ్‌కీ మార్చేలాగా ఫాంటు మారక ఉపకరణాలు తయారుచేశారు. తరువాత ఇంకొందరు సాంకేతిక నిపుణులు శ్రీ కృష్ణదేవరాయ, పెద్దన, తిమ్మన, తెనాలిరామకృష్ణ, సూరన్న, రామరాజ, మల్లన్న, ధూర్జటి, రామభద్ర, గిడుగు, గురజాడ, సురవరం, యన్.టి.ఆర్., మండలి, నాట్స్, పొన్నాల, రవిప్రకాష్, లక్కిరెడ్డి లాంటి అక్షరరూపాలను విడుదల చేశారు. అనువాద ఉపకరణాలు, నిఘంటువులు, లెక్కకు మిక్కిలిగా రావాలి. ఆన్‌లైన్‌లోనూ ఆఫ్‌లైన్‌లోనూ వాటిని విరివిగా లెక్సికన్లు వాడుకునే సౌలభ్యాలు కలగాలి. వాటిని తయారు చేసే సాంకేతిక నిపుణులకు నిధులు ఇవ్వాలి, ప్రతి యేటా తెలుగు వైతాళికుల పేరు మీద ప్రోత్సాహక బహుమతులు ఇవ్వాలి.

2. ఆనాటి సమన్వయ సమీక్షలో ఉన్నత విద్యాశాఖ మంత్రి, అధికార భాషా సంఘం అధ్యక్షుడు, మాధ్యమిక విద్యా మంత్రి కలిసి చేసిన ఉమ్మడి ప్రకటనలో తెలుగు భాషా రక్షణ అభివృద్ధికై మంత్రిత్వ శాఖను ఏర్పాటు చేశాక తెలుగును రెండవ జాతీయ భాషగా

ప్రకటించాలని అసెంబ్లీలో తీర్మానం చేయించటానికి ప్రయత్నిస్తామన్నారు. కళాశాలల్లో ఇక నుంచి తెలుగును ఒక బోధనాంశంగా చేరుస్తామన్నారు. ప్రతి విద్యార్థికి తెలుగు వచ్చి తీరాలి కాబట్టి ప్రభుత్వ, ప్రైవేటు ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత స్థాయి పాఠశాలలతో పాటు, కళాశాలలన్నింటిలో తెలుగును బోధనాంశంగా తప్పనిసరి చేస్తామన్నారు. తెలుగు భాషను ఉన్నత విద్యాస్థాయి వరకూ తప్పనిసరి చేస్తామన్నారు, తెలుగు భాషా సంస్కృతి, లలితకళలపై పాఠ్యాంశాలను చేరుస్తామన్నారు. తెలుగు మీడియంలో కంప్యూటర్ చదువులు కూడా రావాలి. గ్రూప్1, గ్రూప్2 సర్వీసు ఉద్యోగాలలో డిగ్రీ తెలుగు మీడియంలో చదివిన వారికి గతంలో ఇచ్చిన మాదిరే 5% ప్రోత్సాహక మార్కులు ఇవ్వటానికి కృషి చేస్తామన్నారు. తెలుగు మాధ్యమంలో చదివిన విద్యార్థులకు ప్రోత్సాహకాలిస్తామన్నారు.

3. మన రాష్ట్రంలో తెలుగు మాతృభాషగల నాలాంటి 'తెలుగు ముస్లిములు' లక్షలలో వున్నారు. ఉర్దూ మాట్లాడే ముస్లింలలో కూడా పలువురికి ఉర్దూ చదవడం, రాయడం రాదు. వీరంతా తెలుగులోనే రాతకోతలు సాగిస్తుంటారు. ఉర్దూ రాని ముస్లింలకు కూడ వివాహ ధృవీకరణ (నిఖానామా) పత్రాలను ఉర్దూలోనే జారీ చేస్తున్నారు. తెలుగు ముస్లిముల సౌలభ్యం కోసం ఖాజీలు తెలుగులోనే నిఖా ప్రసంగాలు చేస్తున్నారు. ఖురాన్, హదీస్‌వంటి మూల గ్రంథాలన్నిటిని తెలుగులో ముద్రించారు. అలాగే వివాహ ధృవీకరణ పత్రాలను కూడ తెలుగులో ముద్రించి ఇస్తే తెలుగులోనే పూరించి ఇస్తామని ఖాజీలు అంటున్నారు. కాబట్టి వక్ఫ్‌బోర్డు వివాహ ధ్రువపత్రాలను తెలుగు భాషలో కూడా ప్రచురించటానికి ప్రయత్నిస్తామన్నారు.

4. తెలుగు జాతీయాలూ, నుడికారాలూ, పదబంధాలూ కూర్చిన మహా నిఘంటువు, జాతీయాలు, సామెతలు, జానపదగీతాలు, పాత చిత్రాలలోని పాటలు మొదలైన సాహిత్య గ్రంథాలు ముద్రింపజేస్తామన్నారు. 1975లో లకంసాని చక్రధరరావు, ఆంధ్రా యూనివర్శిటీ ప్రొఫెసర్ సంపాదకత్వంలో "తెలుగు వ్యుత్పత్తి కోశం" పేరుతో తెలుగు నుండి తెలుగు నిఘంటువు 1,08,330 పదాలతో 8 సంపుటాలుగా వెలువడినది. ఈ సంపుటాలను ఆన్‌లైన్‌లో పెట్టించటానికి ప్రయత్నిస్తామన్నారు.

ఇవన్నీ మళ్ళీ ఇప్పుడు అడగటం ఎందుకంటే తెలుగు భాషాభివృద్ధికోసం చిత్తశుద్ధితో పనిచేసే రాష్ట్ర నాయకుల్లో పెద్ద దిక్కుగా మిమ్మల్నే ప్రజలు భావిస్తున్నారు గనుక ఉప సభాపతి హోదాలో మండలి బుద్ధప్రసాద్ గారు పై కోర్కెల సాధనకు నడుము బిగించాలని కోరుతున్నాను.



# శుభాభినందనలు

*- డా॥ నాగసూరి వేణుగోపాల్*

"అందరూ తెలుసు, అందరూ తెలియదు" - ఇలాంటిది మా లాంటి ఉద్యోగుల పరిస్థితి. మనతోపని ఉన్నప్పుడు పలకరిస్తారు, తర్వాత పనిలేదు కనుక మరచిపోయే అవకాశం ఎక్కువ ఉంది - మరీ ముఖ్యంగా పెద్ద అధికార్లకూ, మరీపెద్ద వారయిన రాజకీయ నాయకులకు! అయితే ఒక్కోసారి కొందరు మాత్రం మన అభిప్రాయం తప్పు అని తమ చేతల ద్వారా విశదం చేస్తారు. ఏడెనిమిదేళ్ళ క్రితం మంత్రిగా ఉన్న బుద్ధ ప్రసాద్ గారు విశాఖపట్నం వచ్చి ఒక సభలో పాల్గొన్నారు. సభలో ప్రసంగం చేస్తూ - జనం మధ్యలో ఉన్న నన్ను గమనించి, గుర్తుపట్టి నా పేరు ప్రస్తావించారు. ఇది వారి సహృదయత. నాకు మాత్రం ఎంతో ఆశ్చర్యం కల్గించింది, ఆనందం కల్గించింది. విజయవాడ నుంచి బదిలీ అయ్యి, అనంతపురం వెళ్ళే ముందు ఠాగూర్ లైబ్రరిలో ఒక కార్యక్రమంలో పాల్గొన్నాను 'మీరీ పుస్తకం చూడాలని' ఒక రచయిత్రి తన పుస్తకం ప్రతి ఒకటి తీయబోయింది. అంతలో మరో వ్యక్తి మాటల మధ్య చొరబడి - మీరు అనంతపురం వెళ్తున్నారా అని అన్నారో లేదో - ఇటు రచయిత్రి తన పుస్తకం అలాగే సంచిలో వెనక్కి వేసి, చక్కావెళ్ళిపోయింది. బదిలీ అయిన అధికారికి పుస్తకం ఇవ్వడం వల్ల ప్రయోజనం ఏమిటని ఆవిడికి సందేహం కల్గిఉండవచ్చు. ఈ అనుభవాన్ని పేర్కొవడం ఎందుకంటే - మండలి వారి సహృదయతనుపట్టి చూపడానికే!

నా పుస్తకం ఏది వెలువడినా, నా వ్యాసం ఏది పత్రికలో ప్రచురింపబడినా - వారు చదువుతున్నారని బోధపడింది. విశాఖలో ఉన్నా, హైదరాబాదులో ఉన్న, కడపలోఉన్న - వారితో పరిచయం కొనసాగింది. నేను మద్రాసు ఆకాశవాణి కేంద్రానికి రావడం వారికి చాలా ఆనందం కల్గించింది. వారెప్పుడు మద్రాసు వచ్చినా - కొంతసేపు తప్పక కలువ గలుగుతున్నాం. అలాగే మాలతీచందూర్ గారిని వారితో పాటే వెళ్ళి కలిశాను. ఆ రోజు కలవకపోయి ఉంటే మాలతీ గారిని చూసి ఉండేవాడిని కాదేమో! అంతేకాదు, తిరుమల రామచంద్రగారి సతీమణి అనంతలక్ష్మిగారినీ, ఘంటసాల వారి సతీమణి సావిత్రమ్మగారినీ- ఇలాగే (నాడు తెలుగుదేశం ఎం.ఎల్.ఏ. అయ్యాక) కలిశాం. అంతకు మించి తంజావూరు, తమిళ విశ్వవిద్యాలయం, శ్రీరంగం, తిరువయ్యారు, మేలట్టూరు, మధురై, రాచపాళ్యం, శ్రీవిల్లిపుత్తూరు, కుర్తాళం - ఇలా కొంతమంది మిత్రులతో సహా తెలుగుయాత్రలు చేశాం.

# భాషాప్రేమికుడు మండలి

- డా॥ వెన్నా వల్లభరావు

తెలుగు భాష అన్నా, సంస్కృతి అన్నా మిక్కిలి మక్కువ గలిగిన భాషా ప్రేమికుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు. వీరి తండ్రిగారు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు నేను సప్తగిరి కళాశాలలో అధ్యాపకునిగా పనిచేస్తున్న సమయంలో ఒకసారి అక్కడకు అతిథిగా వచ్చారు. వారు చెప్పిన "సమాజం మనకు ఏం చేసిందని గాకుండా, మనం సమాజానికి ఏం చేశామని ఆలోచించుకోవాలని" చెప్పిన మాటలు నన్నెంతో ఆలోచింపజేశాయి. కృష్ణాజిల్లా రచయితల సంఘానికి గౌరవ అధ్యక్షులుగా ఉన్న శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు తండ్రికి తగ్గ తనయునిగా, ఒక్కోసారి తండ్రిని మించిన తనయునిగా కనిపిస్తారు.

తెలుగు భాషకు ప్రాచీన ప్రతిపత్తిని సాధించటానికి ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారు, శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు సాధించిన కృషి అమోఘం. ఆ సందర్భంగా వీరి "తెలుగే ప్రాచీనం" అనే గ్రంథరచనకు ప్రోత్సహించారు. ఆ గ్రంథాన్ని నేను "తెలుగూ హీ ప్రాచీన్ హై" అనే పేరుతో హిందీలోకి నాతో అనువాదం చేయించారు. ఉత్తరాది వారికి తెలుగు భాషా ప్రాచీనతను తెలియజేసే అవకాశం ఆ విధంగా లభించింది. అనువాద రచన నన్ను ప్రోత్సహించిన ప్రసాద్ ద్వయానికి నా కృతజ్ఞతలు.

ప్రజల కోసం పని చెయ్యటం కంటే మించిన పదవి లేదని భావించే బుద్ధప్రసాద్‌గారికి కొత్త రాష్ట్రంలో "శాసనసభకు ఉపసభాపతి బాధ్యతల నిర్వర్తించే అవకాశం లభించినందుకు తెలుగు భాషాభిమానులందరికీ సంతోషంగా ఉంది. వీరు మరిన్ని మంచి పదవులందుకుని తెలుగు తల్లికి సేవ చెయ్యాలని ఆకాంక్షిస్తున్నాను.

తెలుగు గురించి వారి ప్రేమ, అభిమానం విశేషమైనవి. ఆంధ్రప్రదేశ్ విధానసభ ఉపసభాపతిగా బాధ్యతలు స్వీకరించిన మండలి వారు తెలుగుకు, తెలుగులకూ, తెలుగు సంస్కృతికి గొప్ప ఊరట కల్గిస్తారని మా వంటి వారికి ఆశ!

మామూలుగా ఎన్నికలు ముందు రాజకీయ పార్టీలు మ్యానిఫెస్టోలు ప్రజల ముందుకు వస్తాయి. ఇక్కడ మండలి వారి ముందు తెలుగు ప్రేమికుల మ్యానిఫెస్టోను మనం తెలియబరుద్దాం. ఇటీవల అల్లూరి సీతారామరాజు, డాక్టర్ కె.ఎల్.రావు జయంతులను, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికారిక కార్యక్రమాలుగా చేయడం అభినందనీయం. మనకు ఆత్మవిశ్వాసాన్ని కల్గిస్తూ, బాధ్యతలు గుర్తు చేసే కార్యక్రమాలు చాలా జరగాలి.

ఏటా ఒక నిర్దిష్ట తేదీలలో తెలుగు ఉత్సవాలు కనీసం ఒక వారం పాటు జరిగేలా చర్యలు తీసుకుంటే మంచిది. ఈ రకమైన కృషి కర్ణాటకలో కన్నడ గురించి జరుగుతోందని గమనించాలి.

రాజమండ్రి వంటి నగరాన్ని సాంస్కృతిక కేంద్రంగా తీర్చిదిద్ది ప్రచారం చేసి, తెలుగువారికి సంబంధించిన అంశాలకు ఒక ప్రదర్శనా నగరిగా మార్చాలి. విజయ నగరంలో సంగీత విశ్వవిద్యాలయం, కూచిపూడిలో నృత్య విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలి.

గొప్పవారయిన తెలుగు వారిని గుర్తు చేసుకునే సందర్భాలు ఆనవాయితీగా మారాలి.

ఇతర ప్రాంతాలలో ఉండే తెలుగు గ్రంథాలకు, తాళపత్ర గ్రంథాలనూ కనీసం ఇపుడయిన మనం సేకరించి దాచుకోవాల్సిన అవసరం ఉంది. అంతేకాదు తెలుగు వారికి పనికి వచ్చే పుస్తకం ఏదైనా భద్రపరిచే మంచి సదుపాయం ఇపుడయినా కలగాలి. ఈ పుస్తకాలు కేవలం గతానికి సంబంధించినవే కానక్కరలేదు. అలాగే తెలుగు పుస్తక ముద్రణలో రచయితలకు తోడ్పాటు లభించాలి.

దక్షిణ భారత హిందీ ప్రచార సభలాగా ఇతర ప్రాంతాలలో ఉండే తెలుగు వారికీ, తెలుగునాట నివసించే ఇతర భాషల వారికీ ఒక వ్యవస్థకావాలి. తగిన పుస్తకాలు ముద్రించడం, పంపిణి చేయడం, పరీక్షలు నిర్వహించి ఫలితాలు ప్రకటించడం ఈ సంస్థ లక్ష్యం కావాలి.

# వారధిని నిర్మించినవాడు.....

**- శ్రీ జాన్‌సన్ చోరగుడి**

సంస్కారవంతమైన - సబ్బు. సంస్కారవంతమైన రాజకీయ నాయకుడు. ఈ రెండు మాటలు పెద్దగా సీరియస్‌గా తీసుకోదగ్గవి కాదని, మొదటిదాని మాదిరిగానే రెండవది కూడా ఉనికిలో ఉండే అవకాశం లేదని మనకున్న గట్టి నమ్మకం. అంతేకాదు, రాజకీయ నాయకులు వారి అధికార దర్పం ముందు, సామాన్యులం - మనకెందు కొచ్చిందిలే, అని పక్కకు తప్పుకోవడానికే ప్రయత్నిస్తాం. అయితే అది విషయానికి ఒక పార్శ్వమే. అంతగా మోర ఎత్తిమరీ వాళ్ళ 'ఎత్తు'ను చూస్తూనే, మరొక వైపు ప్రైవేట్‌గా వాళ్ళను నోటికి ఎంత మాట వస్తే అంతమాట నిస్సంకోచంగా అనేస్తాము!

అదేంటి, ఇంత వైరుధ్యం ఎలా కుదురుతుంది? అధికారం ద్వారా భయం కలుగుతున్నదిగాని, గౌరవం దక్కడం లేదు. ఇక భక్తి ఊసే లేదు. మనది ఏ ప్రాంతమైనా అన్ని చోట్ల ఈ పరిస్థితి ఒక 'వాతావరణం' మాదిరిగా ఇప్పుడు నెలకొని ఉంది.

దీనికి ఒక మినహాయింపు ఉంది. ఆ ప్రాంతం ప్రక్కన ప్రవహించే నది కారణమా, ఆ ప్రాంత పురావైభవం కారణమా, లేక ఆ నది సాగర సంగమమయ్యే స్థల ప్రభావం కారణమా అంటే - ఇదని చెప్పడం కష్టమేనేమో? కాని - ఆ వ్యక్తి శ్రీ మండలి బుద్ధప్రసాద్ అని చెప్పిన తర్వాత, అవునని ఒప్పుకోవడం కష్టం కాదు.

ప్రస్తుతం మనమున్న ఈ కాలంలో రెండు మూడు తరాల రాజకీయ కుటుంబ నేపథ్యం నుంచి వచ్చిన వారు కొందరు ఉన్నారు. కానీ, ఇంత బలమైన 'రూట్స్'తో ప్రజాజీవనంలోకి వచ్చి, తన నేపథ్యాన్ని తానే కనుమరుగు చేసుకుంటూ స్వీయ ప్రకాశంతో నిలదొక్కుకున్న వ్యక్తి శ్రీ బుద్ధప్రసాద్ ఒక్కరే మనకు కనిపిస్తారు. ఎవరికైనా అది ఎప్పుడు సాధ్యమవుతుంది అంటే - వ్యక్తి తననుతాను 'డిజాల్వ్' చేసుకుంటూ తన లక్ష్యాన్ని ముందు ఉంచినప్పుడు, అది సాధ్యమవుతుంది. 'లక్ష్యం' సఫలమయిందా? అంతే, అది చాలు వాళ్ళకు. మళ్ళీదాన్లో ఇది నేను చేసిన పని అని 'క్లైమ్' కూడా ఉండదు! 'వాట్‌నెక్స్ట్?' ఇదొక విలక్షణమైన పనితీరు.

ఈ క్రమంలో జరిగేదేమంటే, సదరు వ్యక్తి చుట్టూ మిగతా చోట్ల మనకు కనిపించని ఒక ప్రత్యేక స్థితి క్రమక్రమంగా రూపు దిద్దుకుంటుంది. మన చుట్టూ ఉన్న సమాజంలో కొందరిని చూస్తున్నప్పుడు, వారి తలల వెనుక మనకు 'కనిపించే' తేజోవలయాల రహస్యమిదే! అయితే, మండలి విషయంలో బహుశా అందుకు కారణం - ఆయన ఎదుగుదల అంతా అవనిగడ్డ గాంధీక్షేత్రం నుంచి కావడం కావచ్చు. మన తెలుగు సమాజంలో కాకుండా; గాంధీక్షేత్రం దేశంలో మరెక్కడ ఉన్నా ఈపాటికి అది ఒక జాతీయస్థాయి గ్రామీణ అధ్యయన సంస్థగా రూపుదిద్దుకునేది.

ఈ సందర్భంలో రెండు అంశాలను ప్రస్తావించవలసి ఉంది. మొదటిది - విజయవాడ నగరానికి 80 కి.మీ. తూర్పున కృష్ణా - గుంటూరు జిల్లాలను కలిపే పెనుమూడి వారధి. దానిని పూర్తిచేయడం తండ్రి నుంచి 'ఆయన కొచ్చిన వారసత్వ బాధ్యత'. అయితే ఆయన దానిని నిశ్శబ్దంగా పూర్తి చేశారు. వారధిపై రాకపోకలు మొదలయ్యాక, ఆయన మంత్రిగా ఉన్న రోజుల్లో ఒకసారి విశాఖపట్టణంలో ఓ సాయంత్రం గెస్ట్ హౌస్‌లో టీ కబుర్లలో అడిగాను - 'వారధి తర్వాత ఎలా ఉంది మీ దివిసీమ' అని.

ఆశ్చర్యంగా 'దొంగతనాలు పెరిగాయి...' అని తనదైన నవ్వుతో మిగతా సమాధానాన్ని పూరించారు!

ఒక 'టాస్క్'ను పూర్తిచేశాక, మళ్ళీ దానికి ఆయన ఇచ్చే ప్రాధాన్యత ఎంత మేరకు ఉంటుందో తెలియచెప్పే సందర్భమిది. నిజానికి పని పూర్తి కాకపోయినా, శిలాఫలకాల్ని సైతం వీపున కట్టుకుని తిరిగే నాయకులు మనకు కోకొల్లలు!

రెండవది -

పులిచింతల రిజర్వాయర్ ప్రారంభ సభ 2013 డిసెంబర్‌లో విజయవాడలో జరిగింది. ఎనిమిదేళ్ళ విరామం తర్వాత మళ్ళీ అధికార బాధ్యతల్లో భాగంగా సభలో ఉన్నాను. అధికారిక విధులు విషయం పక్కన పెడితే, వ్యక్తిగతంగా చాలా నిరుత్సాహం కల్గించిన సందర్భమది. కృష్ణానది మీద మన జిల్లాలో ప్రకాశం బ్యారేజ్ తర్వాత మళ్ళీ ఇన్నాళ్ళకు మనం కట్టుకున్న మరో ప్రాజెక్టు పులిచింతల అనే ఉద్విగ్నతను ఆ రోజు ఆ వేదిక అందించలేక పోయింది. ఒకలాటి నిర్లిప్తత. ఏమవుతున్నది మనకు, అని కలవరం కలిగిన క్షణాలవి. ఓ రాత్రి ఫోన్ చేసి అదే వ్యక్తం చేశాను. ఆయన పరిస్థితి అందుకు

భిన్నంగా లేదు. 'ఎవరున్నారు దాని గతమేంటో తెలిసినవారు?' కాస్త నిర్వేదంగానే అన్నారు. తోడు దొరికినట్టు అనిపించిందేమో, చెప్పడం మొదలుపెట్టారు. 'పులిచింతల' కాగితాల మీద నుంచి కార్యాచరణ స్థలానికి రావడానికి దారితీసిన పరిస్థితులు, ఆయన దాని 'వెంట పడిన' వైనం అంతా పూస గుచ్చినట్టు చెప్పారు. నిజానికి ఇప్పటికీ ఎవరికీ తెలియని విషయమిది.

'రాయొచ్చు కదా' అడిగాను

మాట్లాడలేదు. పరిమితులు తెలిసిన పరిణితి.

కానీ, 'పులిచింతల' గురించి జీవితకాలంలో ఎప్పుడో ఒకప్పుడు చరిత్రలో 'రికార్డు' చేయవలసిన సమాచారం మాత్రం ఆయన వద్ద ఉన్నది.

జగ్గయ్యపేట ఎమ్మెల్యేగా ఉన్నప్పుడే కాకుండా మంత్రి అయ్యాక కూడా శ్రీ నెట్టెం రఘురామ్‌ను అప్పట్లో తరచూ అడిగేవాణ్ణి, విజయవాడ నుంచి 'ప్రెస్'ను తీసుకెళ్ళి పులిచింతల గురించి రాయిద్దామని. అక్కణ్నించి 2004లో పులిచింతల శంఖుస్థాపనకు 'ప్రెస్'ను తీసుకొని వెళ్ళడం వరకు, మళ్ళీ ఇప్పుడు దాని ప్రారంభం. ఇలా అది మొదట్నించే లోపల ఇమిడిపోయిన అంశమైపోయింది. అందుకే శ్రీ మండలి బుద్ధప్రసాద్ ఆ రాత్రి వెల్లడించిన విషయాలతో కనెక్ట్ కావడం తేలికయింది. ఈ రెండు ప్రాజెక్టులు నిర్మాణం వెనుక ఇంజనీర్లు ఎంతమందైనా ఉండి ఉండవచ్చు కాని ఒక వ్యక్తి 'హ్యూమన్ ఇంజనీరింగ్' వల్ల మాత్రమే అవి కార్యరూపం తీసుకున్నాయి.

వర్తమానానికి వస్తే –

సుప్రసిద్ధ నవల 'ఆల్కెమిస్టు'లో రచయిత పాలొకొయిలో అంటాడు –

'నిన్ను విజేతను చేయడానికి ప్రపంచం కుట్రపన్నుతుంది' అని.....

మండలి విషయంలో అది నిజమే అనిపిస్తుంది!

(వ్యాసరచయిత అభివృద్ధి – సామాజిక అంశాల వ్యాఖ్యాత)

## మంచి గంధంవంటి మనిషి

# మా బుద్ధప్రసాద్

- శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు

బుద్ధప్రసాద్‌గారు సౌశీల్యానికి, సౌహృదయతకు, స్నేహశీలతకు, పరోపకారానికి, త్యాగనిరతికి, సేవాతత్పరతకు, పవిత్రతకు, నవ్యనవనీత సమానమైన హృదయానికి, నిండు మనస్సుకు ప్రతీక. ప్రపంచంలో ఎన్ని సద్గుణాలున్నాయో అన్ని సద్గుణాలు బుద్ధప్రసాద్ గారిలో రాశీభూతమైయున్నాయి. జ్ఞానాంబుధివారు. పరోపకార పరాయణులు. ఇతరులకు సహాయం చేయడంలో వారు ఆనందపడతారు. శత్రువుకైనా సహాయం చేయడానికి వారు వెనుకంజవేయరు. ఇట్టి సద్గుణాలున్న వ్యక్తి ఈ నాటి సమాజంలో కంచుకాగడా వేసి వెతికినా మనకు కనిపించడు. నాకు తెలిసినంత వరకు వారు ఎవ్వరిని ఎప్పుడు పల్లెత్తు పరుషవాక్యంతో దూషించిన దాఖలా లేదు.

మందస్మిత వదనులు, సౌజన్యమూర్తి, సౌహృదయ మనస్వి, స్నేహశీలి, ఎవ్వరైనా వారిదగ్గరకు వెళితే వారిని అప్యాయతతో ఆహ్వానించి హృదయాన్ని పంచి యిచ్చే స్వభావం వారిది. భారతీయ సంస్కృతి, సంప్రదాయం వారిలో రాశీభూతమైయున్నాయి. గృహమేధిగా వారు చూపే అతిథ్యం నిరుపమానము. వారి శ్రీమతి విజయలక్ష్మిగారు గృహస్థ ధర్మాలను నిర్వహించే పరమసాధ్వి. యక్ష ప్రశ్నలలో ధర్మరాజు పలికినట్లు ఆమె ప్రసాద్‌గారికి మంచి స్నేహితురాలు. ప్రఖ్యాతి నార్జించినగొప్ప వ్యక్తి ఉన్నతికి వెనుక స్త్రీ ఉంటుందని ఆర్యోక్తి. అది ప్రసాద్ గారి విషయంలో కూడా పరమ సత్యమని చెప్పాలి. ప్రసాద్‌గారి కుమార్తె, కుమారుడు నిజంగా రత్నమాణిక్యాలు.

ఈనాటిదా బుద్ధప్రసాద్ గారితో నా పరిచయం. కాదుకాదు, దానికి 29సం॥రాల చరిత్ర ఉన్నది. 1985లో నేను ఏలూరులో జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థలో (District Rural Development Agency) క్రెడిట్ ప్లానింగ్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నాను. ఆ సమయంలో బుద్ధప్రసాద్ గారి దూరపు బంధువొకరు నాతో అసిస్టెంట్ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా పనిచేశారు. వారొకరోజున నాదగ్గర కూర్చొని బుద్ధప్రసాద్ గారు "గాంధీక్షేత్రం" అనే పత్రిక నడుపుతున్నారు. మీరు ఆ పత్రికలో సభ్యులుగా చేరండి అన్నారు. వెంటనే అందులో సభ్యులుగా చేరాను. అంతేకాదు, అందులో 5 వ్యాసాలు వ్రాశాను. ఆ వ్యాసాలు 1.

బులుసు సాంబమూర్తి 2. కల్లూరి సుబ్బారావు 3. లాల్ బహదూర్ శాస్త్రి 4. మల్లంపల్లి సోమశేఖర శర్మ 5. వేమవరపు రామదాసు పంతులు గారలపైన ఉన్నాయి.

నేను1986లో ఏలూరు నుండి విజయవాడ బదిలీపై వచ్చి P.W.D. గ్రౌండ్స్ దగ్గర నున్న "క్రిషి" (Krishna Industrial Self Help Institution) అనే సంస్థలో స్పెషల్ ఆఫీసర్‌గా చేరాను. అక్కడ పని చేస్తున్న సమయంలో ఒక రోజు బుద్ధ ప్రసాద్ క్రిషి ఆఫీసుకు వచ్చి అవనిగడ్డ గాంధీక్షేత్రంలో T.V. Training Centre ప్రారంభించవలసినదిగా కోరారు. కలెక్టరు భట్టాచారిగారి అనుమతితో అక్కడ (గాంధీక్షేత్రంలో) ట్రెయినింగ్ సెంటర్ నేను ప్రారంభించడం జరిగింది. ప్రారంభించిన తర్వాత నేను 15 రోజుల కొక పర్యాయం ట్రెయినంగ్ సెంటర్ ఏ విధంగా పనిచేస్తుందో పర్యవేక్షించడానికి వెళ్ళడం; అక్కడ బుద్ధ ప్రసాద్ గారింట్లో భోజనం చెయ్యడం జరిగేది. ప్రసాద్‌గారి మాతృమూర్తి చక్కని భోజనం పెట్టేవారు. ఒక రోజు పొట్లకాయ కూర వండి పెట్టారు. అది ఎంతో రుచిగా ఉన్నది. గాంధీ క్షేత్రానికి వెళ్లినప్పుడు అక్కడ ఒకరోజు ఉండి వారి లైబ్రరీలో నున్న పుస్తకాలు చూచేవాడిని. వారి అనుమతితో నేను వారి రెండు పుస్తకాలు తీసికొని చదివి నా 16 వేల గ్రంథాలున్న లైబ్రరీలో పదిల పరచాను.

నేను ఉద్యోగాలు మారినా, అనేక పట్టణాలలో పనిచేసినా బుద్ధప్రసాద్‌గారి చెలిమి విడువలేదు. ఏదో ఒక సందర్భం కల్పించుకుని వారిని కలుస్తూనే ఉన్నాను. ఇలా ఉండగా ఒకరోజు నేను, డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు గారు ఉయ్యూరులో ఆచార్య శ్రీవత్సగారు నిర్వహించిన సాహిత్య సభలకు వెళ్లాము. అందులో బుద్ధప్రసాద్ గారు ప్రారంభోపన్యాసం చేశారు. సభలు ముగిసిన తర్వాత బుద్ధప్రసాద్‌గారు మా ఇద్దరితోను అన్నారు కదా! మిమ్మల్నిద్దరిని అవనిగడ్డ తీసుకొని వెళుతున్నాను. అక్కడ సభ ఏర్పాటు చేశాను. మీరిద్దరు అక్కడ ఉపన్యసించాలన్నారు. మేము అక్కడకు వెళ్లేటప్పటికే సభ ఏర్పాటు జరిగి పోయింది. సభా సదులు తమ తమ స్థానాలలో కూర్చీలలో ఆసీనులై ఉన్నారు. సభలు ఏర్పాటు చేయడంలో వారి ప్రతిభ గొప్పది. కార్యకర్తలు వారి మాటను శిరోధార్యంగా భావిస్తారు. ఆ రోజు సభకు నన్ను అధ్యక్షస్థానంలో కూర్చోబెట్టారు. మమ్మల్నందరిని బుద్ధప్రసాద్‌గారు చక్కగా పరిచయం చేసి ఆ ప్రాంతపు సాహిత్యంపై లఘు ప్రసంగం చేశారు. రామకృష్ణమాచార్యులు గారు సభలో ప్రారంభోపన్యాసం చేశారు. శ్రీయుతులు జోశ్యుల సూర్యనారాయణమూర్తి, యార్లగడ్డ బాలగంగాధరరావు గారలు పాల్గొన్నారు.

## విద్యార్థుల మనస్సులో... శ్రీ మండలి

- జె. సాయిరాం ప్రసాద్

సభలెన్నో జరుగుతుంటాయి...
సభలో ఎంతమంది ఉన్నా...
రాజకీయ నాయకుల సభలా...
విద్యార్థులు అమడదూరం।
రచయితల సభలా...
ఆనందమే ఆనందం ।
కృష్ణాజిల్లా రచయితల సభలంటే
మరీ... ఆనందమానందం
మేమేగా కార్యకర్తలం అక్కడ
సభాపతి చిరునవ్వు...
సభాపతి పలకరింపు
మా విద్యార్థులకి పులకరింతే...!
ఏకాగ్రతతో వింటాం...
మహోన్నత వ్యక్తుల చరిత్రలు
అనుకుంటాం. మేము కూడా
చరిత్ర పుటలకెక్కాలని ।
రాజకీయ నాయకుడైనా...
కల్మషం లేని
మనస్సు కోరుతుంది...
విద్యార్థుల శ్రేయస్సు
అమ్మ భాషలో విద్య అందించాలన్నదే
ఆయన తపస్సు
అది ఫలించడమే మాకు ఆశీస్సు ।
మేము చూడలేదు వివేకానందుణ్ణి
అయినా గౌరవిస్తాము ఆయన మార్గాన్ని।
మేము చూస్తున్నాము రాజకీయం అంటని...
మా తెలుగు సభాపతిని...
అనుకరిస్తాము ఆయన మార్గాన్ని ।
ఇది మా విద్యార్థుల మనోగతం ।

గ్రంథప్రచురణలు చేయడం, చక్కగా సభలు నిర్వహించడం బుద్ధప్రసాద్‌గారికే చెల్లింది. వారొకరోజు నాకు ఫోను చేసి మేము "దివిసీమ దివ్వులు" అన్న శీర్షికలో ఒక గ్రంథం ప్రచురిస్తున్నాము. అందులో మీరు 3 వ్యాసాలు వ్రాయండి అన్నారు. వారి కోరిక ప్రకారం నేను శ్రీయుతులు 1. కొడాలి ఆంజనేయులు 2. కొడాలి వెంకట సుబ్బారావు 3. పింగళి లక్ష్మీకాంతం గారలపై వ్రాసి పంపగా వానిని ఆ గ్రంథంలో ముద్రించారు.

బుద్ధప్రసాద్‌గారు విజయవాడలో ప్రపంచ తెలుగు రచయితల మహా సభలు జరిపారు. తిరుపతిలో జరిపిన ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణలో కీలక పాత్ర పోషించారు. విజయవాడలో జరిగిన సభలో శతావధాని శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్‌గారు చేసిన అష్టావధాన సభకు నేను అధ్యక్షత వహించాను. వజ్రభారతి సంచికలో నేను

"పద్య కవిత్వం" అనే శీర్షికలో అతి పెద్ద వ్యాసం వ్రాశాను. అది చేతి వ్రాతలో 40 పేజీల పైనున్న వ్యాసం. కృష్ణాజిల్లా రచయితల ప్రధాన కార్యదర్శి డా॥ జి.వి.పూర్ణచంద్‌గారు ఆ వ్యాసాన్ని స్వీకరిస్తూ అబ్బా! ఇంత పెద్ద వ్యాసమా అన్నారు!. అప్పుడు బుద్ధప్రసాద్‌గారు కలుగజేసికొని నా వ్యాసాన్ని వజ్ర భారతిలో ముద్రించుమనడం, అది ముద్రింపబడడం జరిగింది. ఈ సంభాషణ ప్రసాద్‌గారు పశు సంవర్ధక శాఖా మంత్రిగానున్నప్పుడు సెక్రటేరియట్‌లో జరిగింది. ఆ వ్యాసం ప్రింట్‌లో 25 పేజీలు వచ్చింది. ఆ వ్యాసంలో పద్య కవిత్వంపైన చాల విలువైన పద్యాలు అవి భాగాలుగా వింగడించి సుమారు 250 పద్యాలున్నాయి. తరువాత రెండవ ప్రపంచ తెలుగు రచయితల సభలు జరిగాయి. అందులో నేను ఉపన్యసించాను. ఆ సమయంలో ముద్రింపబడిన సంచికలో నేను పద్యకవిత్వం యొక్క భవితవ్యంపై వ్యాసం వ్రాశాను.

రవీంద్ర భారతిలో నా సప్తతి సభకు వారు ప్రారంభోపన్యాసకులు. వారానాడు సభలో చక్కని ఉపన్యాసం చేసి నన్ను, సభాసదులను అలరించారు. నా రెండు గ్రంథాల ఆవిష్కరణలో (Eminent Editors, విశ్వ బ్రాహ్మణ సర్వస్వము - ప్రథమ భాగము) వారు క్రియాశీలకం పాల్గొని, ఉపన్యసించారు.

అధికార భాషా సంఘానికి అధ్యక్షులుగా ప్రసాద్‌గారు నియమింపబడినప్పుడు ఆనందించిన వారిలో నేనొకడను. వారు ఆ పదవిని సెక్రటేరియట్‌లో చేపట్టినప్పుడు స్వయంగా అక్కడకు వెళ్లి వారికి పుష్పగుచ్ఛాన్ని అందజేసి అభినందించాను. ఆ సమయంలో వారి ప్రక్కనున్న అర్ధాంగి శ్రీమతి విజయలక్ష్మి గారికి నన్ను పరిచయం చేసి నేను వచ్చినందులకు సంతోషపడ్డారు. వారు అవనిగడ్డ నియోజక వర్గం నుండి ఎం.ఎల్.ఎగా ప్రజలచే ఎన్నుకోబడడం తరువాత వారిని డిప్యూటీ స్పీకర్‌గా ఎన్నుకోబడ్డప్పుడు అమితానందం పొందాను. వారు రాబోయే రోజులలో అనేక ఉన్నత పదవులను చేపట్టగలరని నా అభిలాష. జగత్కళ్యాణమూర్తియైన సర్వేశ్వరుడు వారికి సంపూర్ణ ఆయురారోగ్యైశ్వర్యములు, సుఖశాంతులు కలుగజేసి వారిచే ఇతోధికంగా సమాజసేవ చేయించగలడని నా ఆకాంక్ష.

# మండలివంశ మండనుడు

- డా॥ యు.ఎ.నరసింహమూర్తి

జీవనమెల్ల సత్కవి నిషేవిత మాశయ మెల్ల నచ్ఛతా
పావనతా గభీరతల పట్టు ప్రచారములెల్ల విశ్వధా
త్రీవలయ త్రికాల ఫల దేశికముల్ నవకంబులెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లానది పెంపు నుతింప శక్యమే !

రామరాజభూషణుడు వసుచరిత్రమనే తన ప్రబంధంలో శుక్తిమతి అనే పేరుగల నదిని ప్రశంసిస్తూ రాసిన పద్యమిది. ఈ పద్యంలో శుక్తిమతిపరంగా ఒక అర్థము, సత్పురుషుని పరంగా ఒక అర్థము ఇమిడి ఉన్నాయి. జీవనము అంటే బ్రతుకు, నీరు. కవి అంటే జలపక్షి, కవిత్వము రాసేవాడు. ఆశయము అంటే నదీగర్భము, సత్పురుషుని లక్ష్యము. ప్రచారము అంటే నదీప్రవాహము, సత్పురుషుని ప్రబోధము. ఇలా రెండర్థాలతో కూడిన సంఘటనం ఈ పద్యానికెంతో వన్నె తెచ్చింది. నదీజలం జలపక్షులకు ఆశ్రయాన్నిస్తుంది. నదీగర్భం స్వచ్ఛత, పావనత, గభీరతా అనే గుణాలను కలిగి ఉంటుంది. నదీప్రవాహం ఈ భూమండలమంతటా ముక్కారు పంటలను పండిస్తుంది. ఇన్ని గొప్ప లక్షణాలు గల ఆ నదిని పొగడడం సాధ్యం కాదు అంటాడు కవి. సత్పురుషుడి జీవితమంతా, లక్ష్యమంతా స్వచ్ఛంగా పావనంగా గంభీరంగా ఉంటుంది. ఆ మహాత్ముడి ఉపదేశాలన్నీ ప్రపంచమంతటికీ భూత భవిష్యత్ వర్తమానాలకు ఉపయోగించేవిగా ఉంటాయి. ప్రసన్నమైన ముఖకాంతులు ముత్యాలకు వెలవెల బాటును కలిగిస్తాయి. ఇది కవి శ్లేష మూలకంగా సాధించిన రెండవ అర్థం.

మండలి బుద్ధ ప్రసాదు గారితో పరిచయమున్న వారెవరికైనా ఈ రెండవ అర్థము ఆయన విషయంలో ఎంత అన్వర్థమయిందో తెలుసుకోగలరు. సాహిత్యకారులు ఆయనను ఆశ్రయించరు. ఆయనే వారి సాంగత్యాన్ని కోరుకుంటారు. ఆయన ఆశయాలు సమకాలీన సాధారణ రాజకీయ నాయకుల ఫక్కికి చెందినవి కావు. ఈ సత్యాన్ని సహృదయులైన పెద్దలు పత్రికలు, ప్రసారమాధ్యమాలు ఏక కంఠంగా పలికి, ఏకముఖంగా సమ్మతించడం తెలుగువారందరికీ విదితమైన విషయం, స్వరాష్ట్రంలోనైనా, ఇతర రాష్ట్రాలలోనైనా ఇంగ్లండులోనైనా, అమెరికాలోనైనా ఆయన చెప్పేది చేసేది ఆలోచించేది తెలుగుభాష గురించి, తెలుగు సాహిత్యాన్ని గురించి, తెలుగు సంస్కృతిని గురించి మాత్రమే. ఇది

త్రికాలసత్యం. ఈ భాషా సాహిత్య సాంస్కృతిక పక్షపాతమే రాష్ట్రంలో ఎన్ని రాజకీయ పరమైన ఒడిదుడుకులు ఏర్పడినా ఆయనకు శ్రీరామరక్షగా నిలిచింది. ఇందువల్లనే ఆయన ఉదారతకు, ఉదాత్తతకు అర్హమైన పదవి ఆయనను స్వయంగా వరించింది.

తన వ్యక్తిత్వ లక్షణాలతో కొన్ని దశాబ్దాల క్రిందట తెలుగు వారందరినీ మెప్పించిన విశిష్టవ్యక్తి కీ॥శే॥ మండలి వెంకట కృష్ణారావుగారు. ఎందరో మంత్రులు వచ్చారు, వెళ్లారు. కానీ అందరి పేర్లు మనకు జ్ఞాపకం ఉండవు. అయినా అప్పటికీ, ఇప్పటికీ మండలి వెంకట కృష్ణారావుగారి పేరు తెలుగు వారెవరూ మరచిపోలేదు. అందుకు కారణాలైన ఉదంతాలు చాలా ఉన్నాయి. అందులో మొదటి ప్రపంచ తెలుగు సభల నిర్వహణ, దివిసీమ ఉప్పెన సంభవించినప్పుడు ఆయన చేసిన ప్రజాసేవ మరువరానివి. అటువంటి విశిష్ట పురుషునికి పుత్రోత్సాహాన్ని కలిగించి చరితార్థుడైన విశిష్ట వ్యక్తి బుద్ధ ప్రసాదుగారు. బుద్ధప్రసాదుగారిని చూస్తే 'రాజకీయవాదులలోనూ నిజాయితీ పరులుంటారు' అనిపించేలా ఉంటారు. సాధారణంగా రాజకీయ నాయకులకు, ఆశ్రితులకు మధ్య మర్కట కిశోర న్యాయం ఉంటుంది. కానీ మా ఇద్దరి విషయంలో మర్జాల కిశోర న్యాయం వర్తిస్తుంది. నేను ఆయనను వెదకి పట్టుకోలేదు. ఆయనే నన్ను వెదకి పట్టుకొన్నారు. అనూహ్యమైన ఆ సంఘటన నాకిప్పటికీ నివ్వెరపాటు కలిగిస్తుంది. ఒకనాటి రాత్రి పదిగంటలకు నేను విశాఖపట్టణం నుండి ఇంటికి చేరుకొన్నాను. మా వదినగారు 'హైదరాబాదు నుండి ఎవరో మంత్రిగారుట నీకోసం ఫోన్ చేసారయ్య. మళ్లీ రేపు చేస్తానన్నారు" అని చెప్పారు. నాకు మా ఊళ్లో ఉండే చిన్న రాజకీయ నాయకులతో అయినా ఏ పరిచయమూ లేదు. విద్యార్థిగా ఉండే రోజుల్లో పది సంవత్సరాలపాటు ప్రతిరోజూ భాట్టం శ్రీరామమూర్తిగారింట్లో ఉండేవాడిని. అయినా ఏ రోజూ వారు నాతోగానీ, నేను వారితో గానీ మాట్లాడలేదు. వారి కుటుంబసభ్యులందరూ నాకు మిత్రులే. అనంతర కాలంలో ఆయన విజయనగరం వదలిన తరువాత అతనితో సంబంధమే లేకపోయింది. అది నా స్వభావం. అలాంటి నాకు ఒక మంత్రిగారు హైదరాబాదునుంచి తనంతట తానుగా నాకు ఫోను చేసారంటే నేనెలా నమ్మగలను? కానీ మరుసటి రోజు రాత్రి ఆ విషయం నమ్మక తప్పలేదు. 'నన్ను మండలి బుద్ధప్రసాదు అంటారండీ!' అంటూ అప్పటి పశుగణాభివృద్ధి శాఖామాత్యులు స్వయంగా నాకు ఫోను చేసారు. ఇందుకు ఆయన ప్రక్కనున్న ఎమెస్కో విజయకుమార్ గారు సాక్షి. బుద్ధప్రసాదుగారు జిల్లా ఇన్‌ఛార్జిగా విజయనగరం వచ్చిన సందర్భంలో ఒక మిత్రుడూ ఆయనకు నేను రాసిన "కన్యాశుల్కము – 19వ శతాబ్ది ఆధునిక భారతీయ

నాటకములు" అనే పుస్తకాన్ని ఇచ్చారు. దాని ఫలితంగానే హైదరాబాదు వెళ్లిన తరువాత స్వయంగా నాకు ఫోను చేయడం జరిగింది. అప్పటికే నేను ఈనాడులో రాసే వ్యాసాలు వారు చదివారట. ఆ విషయం చెప్తూ "వీలైనప్పుడు మనం కలుద్దాం!" అన్నారు.

పిఠాపురంలో శ్రీ ఆవంత్స సోమసుందర్ గారి జన్మదినోత్సవానికి బుద్ధప్రసాదుగారు ముఖ్య అతిథిగా వచ్చినప్పుడు మా మొదటి కలయిక జరిగింది. అది కూడా చిత్రమైనదే. నాకు చొరవ తక్కువ. మంత్రివర్యులు కాబట్టి ఆయన చుట్టూ పత్రికా విలేకరులూ, మిత్రులూ, రచయితలూ అందరూ గుమిగూడుతూ ఉండేవారు. అంత సందడిలోనూ ఆయన నన్నొకసారి చూశారే గాని మాట్లాడే అవకాశమే కలగలేదు. ఆ సంరంభంలో పరివారంతో కలిసి కారెక్కేసారు. మనను ఇంతగా అభిమానించిన వ్యక్తితో మాట్లాడే అవకాశం లేకపోయింది కదా! అని నేను విచారిస్తూ ఉండగా ఆయన గన్‌మెన్ వచ్చి మంత్రిగారు మిమ్మల్ని రమ్మంటున్నారు అని పిలిచి తీసుకొనిపోయి కారులో కూర్చోపెట్టాడు. కారులో మేమిద్దరమే. మంత్రిగారు సామర్లకోటలోని తమ బంధువుల ఇంటికి తీసుకొనిపోయి నాకు, నా మిత్రులకు యథోచిత సత్కారాలు చేసి ఒక గంటకు పైగా ఆయనకు తెలుగు భాషా సాహిత్య సంస్కృతులపై గల అభిమానాన్ని గురించి, తెలుగు అభివృద్ధి కోసం తాను చేయదలచుకున్న పనులను గురించి తెలియజేసి ఆ కృషిలో మా వంటివారి భాగస్వామ్యం కూడా ఉండాలని అన్నారు. మహాదానందం! అంతకంటే కావలసినదేముంది? 2007 నవంబరు 18నాటి ఈ అనుభవాన్ని నేను నాజీవితంలో ఎన్నటికీ మరచిపోలేను.

మాన్యులు బుద్ధప్రసాదుగారు నన్ను కృష్ణాజిల్లా రచయితల సంఘం వారికి పరిచయం చేసారు. అందులోనూ ముఖ్యంగా శ్రీ జి.వి.పూర్ణచంద్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, వారి మిత్రబృందం నన్ను అత్యంత ఆత్మీయునిగా పరిగణించారు. వారు తలపెట్టిన ప్రతి కార్యక్రమంలోనూ నన్ను భాగస్వామిగా చేస్తూ ఉంటారు. ఇదొక అదృష్టం. ఇక్కడ కూడా ఒక చిన్న అనుభవాన్ని తెలియజెయ్యాలి. కృష్ణాజిల్లా రచయితల సంఘం వారు ఏ కార్యక్రమం చేసినా భారీఎత్తున చేస్తారు. ఆ కార్యక్రమాలు జనసందోహం నిండి ఉంటాయి. నేను పాల్గొన్న మొదటి సమావేశంలో భోజనాల దగ్గర తొడతొక్కిడిగా ఉంది. ఏదో అవస్థపడి ఒక వరుసలో పళ్లెం పట్టుకొని కుదురుకున్నాను. ఇంతలో బుద్ధ ప్రసాదు గారి గన్‌మేన్ వచ్చి బుద్ధప్రసాదుగారు మిమ్మల్ని రమ్మన్నారని అన్నాడు. ఆ వరుసతప్పితే మళ్లీ ఏ చివరికో వెళ్లాలి అనుకొంటూ గన్‌మేన్ వెనుక నడిచాను. మంత్రిగారి గదిలో

## సుగుణాల గని

- శ్రీమతి కోపూరి పుష్పాదేవి

స్నేహ సౌశీల్యాలు నేత్రాలు
సంగీత సాహిత్యాలు ఉచ్ఛ్వాస నిశ్వాసలు
మమత మాధుర్యాలు కలగలపి కట్టిన మూట మూట
మంచికి మారుపేరు
మానవతకు నిలువెత్తు రూపం
అనవరత సత్కార్య మండలం
బుద్ధదేవుని వరప్రసాదం
**మండలి బుద్ధప్రసాద్**
ఆయనకు లేనిది గర్వం
ఉన్నది ప్రజాభిమాన ధనం
స్వర్ణాంధ్ర గమ్యంగా
నవ్యత నాగరికతల నడవడికతో
కోటి కోట్ల విలువైన దరహాసాలతో
విజ్ఞాన తునకల వాక్కులతో
భాషోద్యమ రథసారథిగా
తెలుగు భాషకు అపార సేవ చేస్తూ
అందరినీ కలుపుకుంటూ
అందంగా సాగిపోయే
నడిచే విజ్ఞానఖని
ఎన్నెన్నో సుగుణాల గని
మన **మండలి బుద్ధప్రసాద్**

ఆయనతో పాటు నాకు భోజనం ఏర్పాటయి ఉంది. నేను ఎక్కడ ఏ అవస్థలు పడుతూ ఉంటానో అని ఒక కంట కనిపెట్టి నాకు సౌకర్యం కలుగజేసే ఆయన ఉదార స్వభావం ఇంకొకసారి నాకు అనుభవంలోకి వచ్చింది. ఇటువంటి వ్యక్తులు కూడా ఉంటారా! అనిపించింది.

'నేటి తెలుగు' అనే పేరుతో నా వ్యాసాలను ఒక సంకలనంగా ఎమెస్కో వారు ప్రచురించడానికి, 'మణిదీపాలు' అనే బృహత్సంపుటంలో నా వ్యాసాలను రెండింటిని ఆ సంస్థవారే ప్రచురించడానికి బుద్ధప్రసాదుగారే కారణం. లండన్‌లో వారి ఆధ్వర్యంలో జరిగిన తొలి తెలుగు చరిత్ర ప్రపంచ మహాసభలలో కూడా పాల్గొనవలసినదిగా వారు నన్ను ఆహ్వానించారు. కానీ, నాకు చారిత్రక జ్ఞానం లేని కారణంగా ఆ అవకాశాన్ని ఉపయోగించుకో లేకపోయాను. తిరుపతిలో జరిగిన తెలుగు ప్రపంచ మహాసభల

సందర్భంగా తెలుగు అకాడమీ వారు నా చేత 'కవిత్వ తత్త్వ దర్శనము' అనే ఒక పుస్తకాన్ని రాయించారు. అదే సమయంలో మాన్యులు బుద్ధప్రసాదుగారు 'ప్రాచీనాంధ్ర దేశంలో అధికార భాషగా తెలుగు' అనే పుస్తకం రాయవలసిందిగా కోరుతూ, అందుకు తగిన సమాచారమంతటినీ నాకు అందజేసారు. ఆయన కనుసన్నలలో మసలుకొనే సమర్థులెందరో ఆయన సమీపవర్తులుగా ఉన్నా ఆ పనిని నాకే అప్పగించడానికి ఆయన సౌజన్యమే కారణం గానీ నా బుద్ధి విశేషం ఏ మాత్రమూ కారణం కాదు.

నేను 'తెలుగు వచన శైలి' అనే విషయం మీద పరిశోధన చేస్తున్నానన్న విషయం వారికి తెలుసు. నా పరిశోధన గ్రంథం 2013 మార్చిలో పూర్తయింది. ఆ తరువాత నా అమెరికా ప్రయాణం కారణంగా ఇంచుమించుగా డిసెంబరు వరకు తిరిగి వారితో ఏ విషయాన్ని సంప్రదించే అవకాశం లేకపోయింది. రాష్ట్రమంతా అల్లకల్లోలంగా ఉన్న ఆ పరిస్థితులలో ఆయన అధికార భాషా సంఘం అధ్యక్షునిగా ఉండి కూడా నేను పంపిన "తెలుగు వచనశైలి" అనే 840 పేజీల సి.డి. రూపంలో ఉన్న గ్రంథాన్ని ఆమూలాగ్రంగా చదివారు. ఆ తరువాత కొన్నాళ్లకు ఆంధ్రప్రదేశ్ సాంస్కృతికశాఖ వారు నా గ్రంథాన్ని ప్రచురించడానికి అంగీకరించినట్లుగా వర్తమానం వచ్చింది. అందుకు బాధ్యులు ఎవరై ఉంటారో నేను విశదంగా చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను. గురజాడ 150వ సంవత్సరంలో మొదలుపెట్టిన ఆ గ్రంథాన్ని గిడుగు 150.వ. సంవత్సరంలో ముగించిన కారణంగా ఆ మహాత్ములకు నా గ్రంథాన్ని అంకితం చేయదలచిన నేను ఆ పనిని బుద్ధ ప్రసాదుగారి చేతిమీదుగా జరిపించడం ఉచితంగా ఉంటుందని భావించాను. అంతకంటే వారికి నేను అందించగల సముచిత గౌరవం ఏముంటుంది? ఇది నాకు, ఆయనకు ఉండే అనుబంధం. "ఒక్క నీవే నాకు, ఎన్ని నేనులో నీకు" అంటాడు ఒక కవి. ఆయన అభిమానానికి పాత్రులైనవారు లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. ఆ అందరికీ నాకంటే ఎక్కువగా ఆయన ఆత్మీయతను పంచుకొన్న అనుభవ పరంపర ఉంటుంది. ఆ ఔన్నత్యమే సకల సంపత్సమేతమైన ఆయన అభివృద్ధికి రాజమార్గమవుతుంది.

# న్యాయస్థానాల్లో తెలుగు తీర్పులు
# శ్రీ బుద్ధ ప్రసాద్ కృషి

*- శ్రీ కొచ్చెర్ల గంగాధర్*

ప్రాంతీయ భాషలు మకుటం లేని మహారాజుల్లా వెలుగొందుతున్న తరుణంలో అఖండ భారతావని వలస పాలకుల చేత చిక్కి అటు భాషలు ఇటు సంస్కృతిల తీరు తెన్నులు కోల్పోయినట్లే...అచ్చ తెలుగులో జరిగే మన జమిందారీ వ్యవస్థ మర్యాదరామన్న తీర్పులు స్థానే న్యాయాలయాలలో ఆనాడు ప్రవేశించిన ఆంగ్ల భాషాధిపత్యం నేటికి కొనసాగుతున్న స్థితి నుండి విముక్తి కలిగించి, న్యాయస్థానాల్లో ప్రజల వాడుక భాషలో వాదోపవాదములు జరిపి తీర్పులు వెలువరించేందుకుగానూ ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘ అధ్యక్షునిగా శ్రీ మండలి బుద్ధప్రసాద్ వారు కంకణం కట్టుకున్నారు.

తెలుగు మహాసభల స్ఫూర్తితో, అన్ని రంగాల్లోనూ తెలుగు వెలుగులు వికసింపజేసే క్రమంలో ప్రజల న్యాయ అవసరాలు తీర్చే న్యాయస్థానాల్లో సామాన్యుడికి అర్థం కాని ఆంగ్ల భాషలో జరుగుతున్న వాదోపవాదాలు, తీర్పులను తెలుగు భాషలో జరిపేందుకుగానూ రాష్ట్ర సర్వోన్నత న్యాయస్థానం న్యాయమూర్తులు, న్యాయవాదులు, బెజవాడ బార్ అసోసియేషన్ సభ్యులతో చర్చించి 2013 మార్చి నెలలో "తెలుగులో న్యాయపాలన సదస్సు" పేరిట ప్రాముఖ్యత గలిగిన కార్యక్రమం నిర్వహించారు.

హైకోర్టు అప్పటి న్యాయమూర్తులు శ్రీ ఎన్. వి. రమణగారు, శ్రీ జి. చంద్రయ్యగారు, శ్రీ భవానీ ప్రసాద్‌గారు ముఖ్య అతిథులుగా విచ్చేశారు. తేనెలొలుకు తెలుగు భాషను మళ్ళీ న్యాయస్థానాలలో ప్రవేశపెట్టడం గురించి శ్రీ మండలి బుద్ధప్రసాద్ మాట్లాడుతూ న్యాయవ్యవస్థకు ఉపయోగపడే ఖతులు, పదకోశములు నిపుణులు శ్రీ అమర్‌నాథ్‌రెడ్డి వారి ద్వారా రూపకల్పన చేయించి అందించడానికి సంసిద్ధంగా ఉన్నామని ప్రకటించారు. న్యాయకోవిదులు, హైకోర్టు న్యాయమూర్తి శ్రీ గుండా చంద్రయ్యగారు అమ్మ భాషలో పరిపాలన కొనసాగినపుడు పాలకులకు పాలితుల మధ్య అంతరాలు తొలగి ఆత్మీయభావన ఏర్పడుతుందని అన్నారు.

తెలుగులో తీర్పులు వెలువరించడానికి న్యాయమూర్తుల సమక్షంలో కార్యోన్ముఖులను చేసిన శ్రీ మండలి బుద్ధప్రసాద్ అవిరళ కృషి వలన రాష్ట్రవ్యాప్తంగా పలు న్యాయస్థానాల్లో తెలుగులో వాదోపవాదాలు జరిగి తీర్పులు వెలువడ్డాయి.

# ఆధునిక ఆంధ్రభోజుడు

- శ్రీ చలపాక ప్రకాష్

తెలుగు పదానికి
'మహా ప్రసాదమై అంకితమైపోయి
పంచి ఇచ్చేవాడు -
'ప్రపంచ తెలుగు ప్రజలారా...
ఏకం కండి!' అంటూ
తెలుగు మహాసభల నిర్వహణ ద్వారా
భాషా విప్లవాన్ని లేవదీసినవాడు -
ఎవరయ్యా అంటే -
ఇంకెవ్వరు... ఇంకెవ్వరు...
మండలి బుద్ధప్రసాదేనంటూ
ప్రతి తెలుగువాడూ గర్వంగా
వెలుగెత్తి చాటుతాడు!
కాలం ఎన్ని 'మండలాల్ని' తీసుకుపోయినా-
భూమండలం మొత్తం తెలుగు వెలుగు
ఎన్నిచోట్ల పర్చుకున్నా-
తెలుగు పదాన్ని చెక్కుచెదరనివ్వని అంశం -
ఈ 'మండలి' వంశం!
నేడు ఉపసభాపతి అయినా..
ఆయనెప్పుడు
తెలుగు భాషకు సభాధిపతిగానే
దూసుకుపోతారని
మా ఆశ... ఆయన ఆశయమూనూ...

మొదటగా శ్రీకాకుళం మొదటి తరగతి జ్యుడీషియల్ కోర్టు న్యాయమూర్తి శ్రీమతి ఏ. పద్మగారు శ్రీకాకుళం జిల్లా పాత్రుని వలస గ్రామమునకు చెందిన బొచ్చా నీలమ్మ అనే మహిళ యొక్క భరణం కేసును విచారించి తెలుగులో తీర్పు వెలువరించారు. తదనంతరం నిజామాబాద్, కృష్ణా, చిత్తూరు, గుంటూరు జిల్లాలో ప్రారంభమైన న్యాయస్థానాలలో తెలుగు తీర్పుల పరంపర రాష్ట్రమంతా కొనసాగింది. ఇది ఒక చారిత్రాత్మక విజయం.

రాష్ట్ర మంత్రిగా, ప్రపంచ తెలుగు మహా సభల రథసారథిగా, అధికార భాషా సంఘం అధ్యక్షునిగా శ్రీ మండలి వారు సాధించిన విజయపరంపర కొనసాగుతూ అన్ని రంగాలలో తెలుగు భాషను పునరుజ్జీవింపజేయడానికి జ్వాల ఇంకా ప్రజ్వలింపబడుతూ కొనసాగాలని ఆశిస్తూ...



# అరుదైన నాయకుడు శ్రీ బుద్ధప్రసాద్

- *శ్రీ తల్లాప్రగడ రవికుమార్*

అమలహృదయుడు, మృదు స్వభావి, వివాదరహితుడూ, తన నరనరాన జాతీయ స్ఫూర్తి మాతృభాషాభిమానం నింపుకున్న నిండైన అరుదైన నాయకుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారితో నా పరిచయం స్వర్గీయ వేటూరి సుందర రామమూర్తిగారి ద్వారా 15 ఏళ్ళ క్రింద జరిగింది. అంతకుముందు వర్ధమాన కవిగా కవిత్వపోటీలో ప్రథమ బహుమతి ఆయన చేతుల మీదుగా నేను తీసుకోవడం తటస్థించినా నాకంటూ ప్రత్యేక గుర్తింపు బుద్ధప్రసాద్‌గారిలో కలగడానికి ప్రధానకారకులు డా॥ వేటూరి గారే!

ఆంగ్లభాషాభిమానం వెర్రితలలు వేస్తూ తెలుగు భాషను అపహాస్యం చేస్తున్న రోజుల్లో ఆవేదనతో, ఆవేశంలో తెలుగు భాషా పునర్వికాసం కోసం ఉద్యమించిన ఏకైక తెలుగు రాజకీయ నేత బుద్ధప్రసాదుగారు. ప్రాచీన భాషగా తెలుగును గుర్తించాలని నినదించి ఆంధ్రరాష్ట్రంలో విజ్ఞులనూ, మేధావులను, పండితపామరులనూ ఉద్యమబాట పట్టించి తెలుగుకు ప్రాచీన భాష హోదా సాధించిన ఘనత బుద్ధప్రసాద్‌గారిదే.

ఆంధ్రభాషాభివృద్ధి కోసం, ఆంధ్రభాషకు ఆధునిక సాంకేతిక హంగులు సంతరించడం కోసం విదేశాలలో నివసిస్తున్న ప్రవాస తెలుగు వాళ్ళందరినీ కలుపుకుని గత రెండు దశాబ్దాలుగా బుద్ధప్రసాద్‌గారు అలుపెరుగక శ్రమిస్తున్నారు. తెలుగు భాషను యువతరానికీ, భావితరాలకూ దగ్గర చేయడం కోసం దేశవిదేశాల్లో స్థిరపడ్డ తెలుగువారితో ప్రత్యేక గోష్ఠీ సమావేశాలు నిర్వహించడం, కంప్యూటర్‌కు తెలుగును అనుసంధానించడానికి అవసరమయిన సాంకేతిక పరిజ్ఞానాన్ని యువతరం అభివృద్ధిపరచడానికి వారిని ఆ దిశగా చైతన్యవంతులను చేయడం. తెలుగు ఖతులు తెలుగు ప్రజలకు ఉచితంగా అందించడం... ఇలా ఒకటేమిటి? అనేకానేక ప్రగతిశీల కార్యక్రమాలతో అధికారంలో ఉన్నా లేకపోయినా ఎప్పుడూ తీరికనేదే లేకుండా భాషా సేవ చేస్తున్నారు బుద్ధప్రసాదుగారు.

2002లో జగ్గయ్యపేట తాలూకా ముక్త్యాలలో తెలుగు మహా సభలు నిర్వహించినా, అవనిగడ్డలో శ్రీకృష్ణదేవరాయ పంచశతాబ్ది ఉత్సవాలు నిర్వహించినా ఎంతో దీక్షాదక్షతలతో విజయవంతం చేయడం బుద్ధప్రసాదు గారికి ఎంతో ఆత్మతృప్తిని కలిగించే వ్యవహారం.

తెలుగు భాషకు ప్రాచీన భాష హోదా యివ్వకపోతే తనకు వచ్చిన జాతీయ అవార్డును పరిత్యజిస్తానన్న వేటూరి వారి ఆవేదనను అంతే ఆవేశంతో ఎలుగెత్తి ఉద్యమించారు బుద్ధప్రసాద్‌గారు. వేటూరిగారు 2010లో పరమపదించినప్పుడు బుద్ధప్రసాద్‌గారు ఎంత వెలితి అనుభవించారో! ఆ మహానుభావుడికి నివాళిగా విజయవాడ తుమ్మలపల్లి వారి క్షేత్రయ్య కళాక్షేత్రయ్యంలో వేటూరి వారి కాంస్య విగ్రహాన్ని నెలకొల్పి 'వేటూరి సాహితీ సమితి' 2011 జనవరి 29-30 తేదీల్లో నిర్వహించిన వేటూరి 76 జయంతి ఉత్సవాలు జరిగిన రెండు రోజుల అన్ని తానై ముందుండి కార్యక్రమాలను ఎంతగానో విజయవంతం చేశారు. అలాగే నేను రాసిన 'అక్షరమాల కథలు' పుస్తకావిష్కరణకి ఎంతో పని వత్తిడిలో వున్నా కూడా హాజరయి నన్ను ఆశీర్వదించిన సహృదయులు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు.

మారిన రాజకీయ పరిణామాల దృష్ట్యా దశాబ్దాలుగా క్రమశిక్షణ కలిగిన కాంగ్రెస్ కార్యకర్తగా వున్నా... నియోజక ప్రజల అభీష్టం మేరకు తెలుగుదేశం తరుపున అవనిగడ్డ నుండి మూడోసారి శాసనసభ్యునిగా ఎన్నికవడం ప్రత్యర్థుల్ని సైతం ఆశ్చర్యపరిచింది. బుద్ధప్రసాద్ గారిలోని ఉన్నతవ్యక్తిత్వం, వివాద రాహిత్య రాజకీయ జీవితం, పార్టీలకు అతీతమైన ప్రజాసేవా దృక్పథం ఆయనను ఉపసభాపతిగా ఉన్నతస్థానాన్ని అలంకరింప జేసింది.

అంతటి సౌహార్ద్రత గల బుద్ధప్రసాద్‌గారికి ఈ సందర్భంగా సత్కారం జరగడం, ఆ సందర్భంగా ప్రత్యేక సంచిక విడుదల అవడం ఎంతో ముదావహం. ఆ అక్షరయోధునికి యివే నా అక్షరాభివందనాలు.



శ్రీ బుద్ధప్రసాద్ వివాహ సందర్భంగా
ఆశీర్వదిస్తున్న శ్రీ ఎన్.టి.రామారావు

# మహనీయా ! మండలి బుద్ధప్రసాద్

- *శ్రీ అనంత హృదయరాజ్ (శివవాణి)*

అవనిగడ్డలో నాటికల పోటీలకు వెళ్లినపుడు అక్కడ గాంధీక్షేత్రాన్ని చూసాము. గాంధేయవాది మండలి వెంకటకృష్ణారావు గారి ప్రజాసేవలను చూసాము. వారి రాజకీయ ప్రస్థానాన్ని చూశాము. కాంగ్రెస్ యువకార్యకర్తగా ప్రారంభమైన వారి జీవితం అత్యంత ఉన్నత దశకు ఎదిగింది. పదవిని తృణప్రాయంగా భావించిన వ్యక్తి కృష్ణారావుగారు. ఆ ప్రాంతపు విప్లవ పార్టీవారు కొందరు ఆయన్ని బాగా గౌరవించేవారు.

మండలి వెంకట కృష్ణారావుగారి తనయుడు మండలి బుద్ధప్రసాద్! వారు మంత్రిగా వున్నప్పుడు నాకు సన్మానం జరిగింది. వారు ముఖ్య అతిథిగా వచ్చారు. తెలుగు భాషా ఔన్నత్యం కోసం వారు అంకితమైనారని తెలిసి వారిని మేము మా ఆత్మబంధువుగా భావిస్తున్నాం. నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభలకు కమిటీ చైర్మన్‌గా వున్నందుకు వారిని మేము ప్రేమించాము. మా మనిషిగా మేము గుర్తించాము. ఎమ్.ఎల్.ఏ.గా, మంత్రిగా నిస్వార్ధ కాంగ్రెస్‌వాదిగా మాకు తెలిసిన బుద్ధప్రసాద్‌ను గాంధేయవాదిగా గౌరవిస్తాం.

తెలుగు ప్రజలు గుండెలు చీల్చి- పగరగిలించిన కాంగ్రెసును విడిచిపెట్టినందుకు బుద్ధప్రసాద్‌ను మేము అభినందిస్తున్నాం. తెలుగు సరస్వతి వారి సేవలకు మెచ్చి వారికి ఉపసభాపతి పదవిని వరంగా యిచ్చిందని మేము నమ్ముతున్నాం. వారిని చూసినపుడు వారి ముఖంలో శాంతిదూత బుద్ధభగవానుని ఛాయారూపం కనిపిస్తుంది. వారు సార్ధక నామధేయులని అంటాము.

గాంధీ భావజాలాన్ని అమితంగా ప్రేమించి, ఆచరించిన మండలి వెంకట కృష్ణారావుగారికి శాంతిదూత వంటి బిడ్డ కలుగకుండా ఎలా వుంటాడు - అదే వారి జన్మకారణం.

కళల పట్ల ఆసక్తి, అనురాగం మన తల్లిభాషపై మమతానురాగాలు వున్న శ్రీ బుద్ధప్రసాద్‌ను చూస్తుంటే కృష్ణాజిల్లా వరపుత్రుడు అనుకుంటాం. బుద్ధప్రసాద్ యింట కళాకారుల, సరస్వతీ పుత్రుల సమావేశాలు కవి సమ్మేళనాలు జరుగుతూనే ఉంటాయి. అష్టదిగ్గజాలతో కవితానందామృతాలను గ్రోలిన శ్రీకృష్ణదేవరాయల విగ్రహాన్ని ప్రతిష్ఠించిన బుద్ధప్రసాద్ గారికి ఆ లక్షణాలు అంటకుండా వుంటాయా?

# అభినందన సందేశం

**-శ్రీ సువారపు రామచంద్రరావు**

అవిభక్త ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో పశుసంవర్ధక శాఖామాత్యలుగా, అధికారభాషా కమీషన్ చైర్మన్‌గా, కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులుగా పనిచేసి, నవ్యాంధ్రప్రదేశ్ **శాసనసభ ఉపసభాపతిగా ఎన్నిక కాబడిన గౌరవనీయులు శ్రీ మండలి బుద్ధప్రసాదుగారికి** కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో సన్మానం జరుగుతున్న సందర్భంగా అభినందనలు.

తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి దేశ విదేశాల్లో ఆయన చేస్తున్న కృషి ప్రశంసనీయం. తెలుగు భాషాభిమానులు, వివిధ తెలుగు భాషోద్యమ ముఖ్యుల పట్ల ఆయన ఎల్లప్పుడూ ప్రేమాభిమానాలను వ్యక్తపరుస్తూ అవసరమైన సహాయ సహకారాలను అందిస్తారు. ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణ విషయంలో, దేశ విదేశాలలో జరిగే తెలుగు భాషా సదస్సులలో పాల్గొని తెలుగు భాషా విస్తృతికి ఆయన అందించే సేవలు అనన్య సామాన్యం, అపూర్వం. నూత్న ఆంధ్రప్రదేశ్ **శాసనసభ ఉపసభాపతిగా** బాధ్యతలు స్వీకరించి కర్తవ్య నిర్వహణకు కంకణబద్ధులైన శ్రీ బుద్ధప్రసాదుగారు మరెన్నో విజయాలు సాధించాలని తిరువూరు రచయితల సంఘం మనస్ఫూర్తిగా ఆశిస్తున్నది.

జనం నైతిక విలువలు కోల్పోతూ వున్నారు. నాయకులు నైతిక బాధ్యతలు విస్మరిస్తున్నారు. ధరలు ధరణీపుత్రులను మింగేస్తున్నాయి. ఎందుకో మాకు తెలుసు. అయినా మేము నిజాయితీగా నించున్నాం. లోకకళ్యాణం కోసం రాస్తున్నాం! నాటకాలు ప్రదర్శిస్తున్నాం. ఊరూరా తిరుగుతున్నాం.

సమాజంలో జనావళికి ఆనందం కలిగించటానికి మా జీవితానందాలను కోల్పోయాం. అందర్నీ నవ్వించటానికి మా బ్రతుకులో నవ్వులు కోల్పోయాం.

మధురమైన మాటలతో మభ్యపెట్టి చిరునవ్వుల హారాలు మెడలో వేసి, ఇంట కూడా నటించి యింటి యిల్లాలిని మోసగించి రంగస్థలిని వరించిన నటులు-

సమాజం నడుస్తున్న తీరు - జనం ఘోష పట్టించుకోనివారు అన్నీ మాకు తెలుసు. ఎవరి కర్మ వారిది అని వూరుకునే వాళ్ళం కాదు. రచయితలం రాస్తాం- కళాకారులం కదం తొక్కుతాం. కలాలు మా అస్త్రాలు. నాటకాలు నవ్యలోకానికి ద్వారాలు.

మహాశయా బుద్ధప్రసాద్ మహనీయా!

ఈ ఆత్మబంధువుల్ని మరచిపోకన్నా! మాతోనే నిజమైన ఆనందం నీకన్నా - కళాకారులమన్నా - కల్మషమెరుగని వారమన్నా !

**నుదుట బూడిద రాసుకున్న నిరాశ్రయులమన్నా !**

**ఔనన్నా కాదన్నా శివుని ప్రియపుత్రులం మేమన్నా!**

**మేమే లేకుంటే మానవజాతికి ఆనందమే దొరకదన్నా!**

**మమ్మాదరిస్తేనే దేశానికి సౌభాగ్యసిరులంటారన్నా !**

**మా చిరునవ్వులే సమాజానికి వెలుగు దివ్వెలన్నా!**

అది మరచిన జాతికి మనుగడ లేదు. ఆదమరచిన వారికి నిష్కృతి లేదు. అదే జరుగుతోంది నేడు. ఆదరించి ఆదుకోండి. ఈ దేశాన్ని దయామయుడైన పరమశివుని ఆశీస్సులందుకోండి.



శ్రీ వేటూరి సుందరరామమూర్తితో బుద్ధప్రసాద్

# "మహనీయం మండలివారి జీవన యానం"

*- డా॥ గుండ్లపల్లి రెజీనా*

*తెలుగు భాషోద్యమ నాయకా! అధికార భాషాధ్యక్షా !*
*తెలుగుదనం, తెలుగు జన జీవనం ఔపోసన పట్టిన అచ్చు తెలుగు ధీ వర్యా!*
*స్థిత ప్రజ్ఞత, సమాలోచనాంతరంగా !*

ఏ దేశమేగినా తెలుగుదనపు పోకడలు తెలుగు పరిమళాలు వెదజల్లుతూ కట్టు,బొట్టు తీరుతెన్నులు సదా నిలుపుతూ ఆంధ్రజాతి భాష కొఱకు శ్రమించమని తిరుపతి వెంకన్న సాక్షిగా బృహత్తర సభా నిర్వహణకు అహరహం శ్రమించి చరిత్రలో నిలిచిన మహానుభావులు.

పదవులు కొందరికి అలంకార ప్రాయం కాని మరికొందరికి వెతుక్కుంటూ వరిస్తాయని చెప్పడానికి నిలువెత్తు దర్పణం బుద్ధప్రసాద్‌గారే!

రాజకీయాలు వారసత్త్వం కాకుండ ప్రజాసేవే పరమావధిగా యెంచి నిరంతరం శ్రమైక జీవనం ప్రవృత్తిగా పాటక జన సేవయే పరమావధిగా యెంచుకున్నారు.

అజాత శత్రువుగా, మహామహా నాయకులును ఆకట్టుకొని, అవనిగడ్డని తన మాతృమూర్తిగా తలచి, భరతమాత నుదుట సింధూరమై విజయలక్ష్మిని వరించి, నిజ జీవితంలో విజయ పరంపరలకు ఆలపాలమై ఎన్నో జయకేతనాల నెగురవేసి, ఖ్యాతి నార్జించిన మహాశయులు.

ఇంకా ఎన్ని పదవులు మిమ్మల్ని వరించడానికి తహతహలాడుతున్నాయో? మితభాషి, మృదుస్వభావి, ప్రశంసలకు పొంగిపోక, అపజయాలకు కృంగిపోక నిరంతరం ఐహిక, ఆముష్మిక విలువలను కాపాడుతున్న అన్వేషి!!

కావాలి మీ చరిత భావి తరాలకు ఆదర్శం, యువతరానికి తెలుగు వెలుగు జిలుగుల నందించాలని ఆశిస్తూ....

# తెలుగు భాషాభిమాని - ప్రజల మనిషి శ్రీ మండలి బుద్ధప్రసాద్

- డా॥ టి.ఎస్.రావు

శ్రీయుతులు బుద్ధప్రసాద్‌గారితో పరిచయం కొద్ది సంవత్సరాలే అయినా వాళ్ళ నాన్నగారు మండలి కృష్ణారావుగారితో ముఖ్యంగా దివిసీమ ఉప్పెన ఏర్పడ్డప్పుడు సోషల్ సర్వీస్ చేసేందుకు కె.బి.ఎన్. కాలేజీ విద్యార్థిగా అవనిగడ్డ వెళ్ళినప్పుడు కృష్ణారావుగారితో కలిసి పనిచేసే అదృష్టం కలిగింది. వారి ఇంట భోజనం కూడా ఇప్పటికీ నాకు బాగా గుర్తు.

బుద్ధప్రసాద్‌గారు అజాతశత్రువు. అందరూ ముఖ్యంగా అన్ని పార్టీలవారు ఆయన్ని అభిమానిస్తారు. తెలుగు భాషంటే తెలుగు ప్రజలంటే ఆయనకు ఎంతో ఇష్టం, దేశ దేశాలలో తెలుగువారందర్నీ ఒక్కటి చేయాలని తెలుగు భాషను కాపాడాలనే ఆయన అకుంఠిత దీక్ష నాకు ఆయనపై అభిమానాన్ని కల్గించాయి.

అందుకే 'బాలలకు బంగారుబాట' పుస్తకానికి ఆయనచే ముందు మాట వ్రాయించి మలేషియా తెలుగు సమాజం ఆధ్వర్యంలో ఆ పుస్తకాన్ని ఆవిష్కరించాము. నేను 'వ్యక్తిత్వ వికాసం' పుస్తకం రచించిన సందర్భంలో ఉన్నత వ్యక్తిత్వం కలిగిన వ్యక్తికి ఆ పుస్తకాన్ని అంకితం ఇవ్వాలనుకున్నా, వెంటనే నాకు మండలి బుద్ధప్రసాద్‌గారు గుర్తుకు వచ్చారు.

అవును నిజంగా ఆయన ఉన్నత వ్యక్తిత్వం కలిగిన వ్యక్తి. ఆదర్శపురుషుడు, అభ్యుదయవాది. నిజాన్ని నిర్భయంగా చెప్పగల్గిన వ్యక్తి. ఎప్పుడు కనపడ్డా చిరునవ్వుతో పలకరిస్తారు. ఆయన అలజడికి లోనుకారు. ప్రశాంతంగా ఉంటారు. ఆయన ప్రజాప్రతినిధిగా ఉన్నా, మంత్రివర్యులుగా సమాజానికి సేవచేసినా, అధికార భాషా అధ్యక్షుడిగా ఉన్నా, నేడు రాష్ట్ర శాసనసభకు ఉపసభాపతిగా ఉన్నా, ఆయన ప్రజల మనిషి తెలుగు ప్రజల కోసం, తెలుగు భాష కోసం నిరంతర శ్రామికుడు అజాతశత్రువు, కార్యదీక్షాపరుడు.

# బుద్ధ దేవరాయులు

- ఆచార్య ఎన్. నరసింహమూర్తి , నాగపూర్

బుద్ధప్రసాద్ గారితో నాకు పరిచయం 2008 కృ.జి.ర.సం. వారి తెలుగు భాషప్రాచీనతపై నిర్వహించిన సభలలో జరిగింది. అయితే వారి గురించి తెలియని తెలుగు భాషాభిమానులెవ్వరు ఉండరు. వారి పరిచయానికి ముందు వారి తండ్రి గారిని బాల్యంలో కలుసుకున్న సంఘటన గుర్తుచేసుకుంటున్నాను. చిన్నతనంలో జరిగే అతికొద్ది మధురానుభవాలలో అదొకటి. 1976 - 77 మధ్య అనుకుంటాను జలగం వెంగళ రావు గారి ప్రభుత్వంలో మండలి వెంకట కృష్ణారావుగారు రాష్ట్ర విద్యాశాఖా మంత్రిగా ఉండేవారు. పిడుగు రాళ్ళలో పదవ తరగతి దాకా చదువుకున్నాను. నేను తరగతి నాయకుడిగా ఉండేవాడిని. అప్పుడు వారు మా పాఠశాలకు వచ్చారు. అప్పుడు వారు మా పాఠశాలలో ఉన్న రోజు వారి ఏర్పాట్లు చూడడానికి నియమించిన 3,4 విద్యార్థులలో నేను ముఖ్యుడిని. అప్పుడు జరిగిన సభలో వేదికపై వారికి సహకరించడం నా ముఖ్యమైన పని. ఆ రోజులలో ఫోటోలు తీయించడం అన్ని చోట్ల అందుబాటులో ఉండేదికాదు. కాబట్టి నాటి జ్ఞాపకాలకి ఆనవాళ్ళు ఇప్పుడు అందుబాటులో లేవు.

రాజకీయ నాయకులలో సాహిత్యం, భాష, విద్య, మొదలయిన విషయాల పట్ల ఆసక్తి ఉండేవారు అతి తక్కువమంది ఉంటారు. ఆ కొద్ది మందిలో మనకు తెలుగువారిలో గుర్తుకొచ్చేది బెజవాడ గోపాలరెడ్డిగారు, పి.వి. నరసింహారావుగారు, మండలి వెంకట కృష్ణారావుగారు. నేటి తరంలో మనం బుద్ధప్రసాద్ గారినే చూస్తాము. వారు ఈ మధ్య సంవత్సరాలలో భాషా, సాహిత్యం, విద్యా విషయాలలో చూపించిన శ్రద్ధ, ఆసక్తి, ప్రోత్సాహం, పోషణ వీటిలో వారి పాత్ర చూస్తూంటే నాకు గతకాలంలోని శ్రీ కృష్ణదేవరాయలే గుర్తు కొస్తుంటారు. భాషా సంస్కృతులు, సాహిత్యాన్ని పోషించే గతకాలంలో పాలకులను నేటి రాజకీయనాయకులను శ్రీ కృష్ణదేవరాయలతో పోల్చడం ఒక్క తెలుగు నాటనేకాదు, ఇతర రాష్ట్రాలలో కూడా కనిపిస్తుంది, వినిపిస్తుంది.

ఐరోపాదేశాలలో విద్యాధికులు, విద్యావేత్తలు, అధ్యాపకులు, శాస్త్రవేత్తలు కూడా రాజకీయాలలో, రాజకీయ పదవులలో బాగా కనిపిస్తుంటారు. అక్కడ విశ్వవిద్యాలయ అధ్యాపకులు, శాస్త్రవేత్తలు వారి వారి ఉద్యోగాలకు రాజీనామా చేయకుండానే ప్రజాప్రతినిధిగా ఉండవచ్చు. కాని మన దేశంలో అలాంటి పరిస్థితి లేదు. 2004

సంవత్సరంలో జర్మనీలో నేతాజి సుభాష్ చంద్రబోస్ కుమార్తె డాక్టర్ అనితా బోస్ (ఫెఫ్) దంపతులను కలిసినపుడు వారిద్దరు అవుస్ బర్గ్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు. అప్పటి ప్రొఫెసర్ ఫెఫ్ జర్మనీ పార్లమెంట్‌లో సభ్యుడిగా ఉండేవారు. ఆయనకు జర్మన్ సాహిత్యం, భాష, కళలు అంటే ఎంతో ఇష్టం. వాస్తవానికి ఆయన ఆర్థిక శాస్త్ర అధ్యాపకుడు. అప్పుడు ఆ విషయం వినగానే నాకు తెలుగు నాట మన బుద్ధప్రసాద్ గారే గుర్తుకొచ్చారు. వెంటనే ఫెఫ్ దంపతులకు, ప్రసాద్‌గారికి తెలుగు భాషా సంస్కృతులపై ఉన్న శ్రద్ధ, ఆసక్తి అభిమానం వివరించగా వారు ఎంతో శ్రద్ధగా విన్నారు.

తర్వాత శ్రీ బుద్ధప్రసాద్ పేరుకు తగ్గ మనిషి, శాంతమూర్తి. తెలుగు భాషకు ప్రాచీన హోదా సాధించడంలో వారి కృషి ఎనలేనిది, బహుదా ప్రశంసనీయం. గత సంవత్సరాలలో వారి సహాయ సహకారాలతో జరిగిన అనేక కార్యక్రమాలు తెలుగు భాషకు పునర్జీవనాన్ని ఇచ్చాయి. ఇంగ్లాండ్‌లో జరిగిన తెలుగు చరిత్ర మహా సభలకు ప్రతినిధులను తీసుకెళ్ళడం తెలుగు పరిశోధకులకు ఎంతో ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని ఇచ్చింది.

నవ్యాంధ్రప్రదేశ్ శాసన సభకు ఉపసభాపతిగా వారిని ఎన్నుకోబడటం తెలుగువారు, సీమాంధ్రుల అదృష్టంగానే భావించాలి. వారు పార్టీలకు అతీతం. ఏ పార్టీలో ఉన్నా తన ముద్ర తప్పక వేస్తారు. వారు తెలుగు తల్లి ముద్దుబిడ్డ. మనందరం వారిని అనుసరిద్దాం, ముందుకెళదాం!

## అభినవ ఆంధ్రభోజా

- శ్రీమతి పుట్టి నాగలక్ష్మి

అభినవ ఆంధ్రభోజా! మీకు వందనం!
భాషా ప్రేమికుడు నీవు
భాషా కృషీవలుడి నీవు.
దేశ విదేశాల్లో
తెలుగు భాషాభివృద్ధిలో
కంకణబద్ధుడి వయినావు
కృజిరస (కృష్ణాజిల్లా రచయితల సంఘం)
గౌరవాధ్యక్షుడి వీవు
సమన్వయ కార్యకర్తవీవు,
భాషా సదస్సుల ఫలం
తెలుగు సంస్కృతీయాత్రా ఫలం
భాష కోసం అహరహం శ్రమించిన ఫలం
తెలుగు భాషకు ప్రాచీనహోదా వరం
సమస్తం వెరశి...
అధికార భాషా సంఘాధ్యక్షుడయినావు
భాషాభివృద్ధికి కృషి చేశావు...
నవ్యాంధ్రప్రదేశ్ తొలి ఉపసభాపతి వీవు
నవకాంతులతో తెలుగు భాష వెలిగేందుకు
స్ఫూర్తి కావాలి నీవు!

# రాజకీయ సౌజన్యంలో భాషా చైతన్యం

*-డా॥ టి. గౌరీశంకర్*
*పూర్వపు అధికార భాషా సంఘం సభ్యులు*

కొందరికి ప్రయత్నం మీద పదవులు వస్తాయి. కొందరికి ఏ ప్రయత్నం చేయకుండానే పదవులు వరించి వస్తాయి. అది వారి వారి నిబద్ధత, సచ్ఛీలత, నిజాయితీ, సేవానిరతి, వ్యక్తిత్వాలపై ఆధారపడి ఉంటుంది. వీటిలో రెండవ దానికి శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు ఉదాహరణప్రాయులు, ఉదార హృదయులు. తెలుగు భాషా సంస్కృతుల గురించి అహరహం ఆలోచించే వ్యక్తి, వాటి పరిరక్షణ కోసం పరితపించేవారు. రాజకీయ రంగంలో ఉంటూ తెలుగు భాషా సంస్కృతులను గురించి పట్టించుకొని, భుజానికెత్తుకున్న ఏకైక వ్యక్తి శ్రీ బుద్ధప్రసాద్‌గారనడం అతిశయోక్తి కాదేమో!

ఇది వారికి వారి తండ్రిగారి నుంచి సంక్రమించిన వారసత్వమని కొందరంటున్నప్పటికీ, తండ్రి నుంచి అంది పుచ్చుకొన్న దానిని ముందుకు తీసుకొని వెళ్ళేవారు ఈనాటి సమాజంలో ఎంతమంది ఉన్నారు? ఎంత తండ్రిగారి నుంచి లభించినా, తనదైన శ్రద్ధాసక్తి, చిత్తశుద్ధి, అభిమానాభినివేశాలు ఉండాలి కదా! అవి ఉన్నందువల్లనే వీరు తండ్రికి తగ్గ తనయుడు అని అనిపించుకోవడమే గాక తండ్రిని మించిన తనయునిగా ఎదిగారు. ఎంత ఎదిగినా ఒదిగే లక్షణం, సౌజన్యం, సౌశీల్యం, స్నేహ సౌహార్ద్రత ఇవన్నీ వీరిలో పుంజీభవించి ఉన్నాయనడానికి ఇటీవలి వీరి విజయ పరంపరయే నిదర్శనం. పదవులు బాధ్యతలను పెంచుతాయని నమ్మినందువల్లనే వీరు ఏ పదవిలో ఉన్నా ఆ పదవికి న్యాయం చేస్తూనే తెలుగు భాషా సంస్కృతుల మనుగడ కోసం ఉద్యమిస్తూ ఉంటారు.

ఈనాడు తెలుగు జాతి చరిత్ర సంస్కృతులు, భాషా సాహిత్యాల చైతన్యానికి చిరునామాగా మారిన బుద్ధప్రసాద్‌గారి ధ్యాస, శ్వాస తెలుగు భాషే! మన రాష్ట్రంలోనే తెలుగు ప్రజల గురించే కాకుండా, ఇతర రాష్ట్రాలలో, ఇతర దేశాలలో ఉండే తెలుగు ప్రజల గురించి కూడా ఆలోచిస్తూ ఉంటారు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు గొంతుకలలో తెలుగు వాణి వినిపించాలన్నది వారి ఏకైక మహదాశయం! తెలుగు జాతి చరిత్రను పరిరక్షించుకోవాలి, సంస్కృతుని కాపాడుకోవాలి, భాషను నిలబెట్టుకోవాలి, సాహిత్యాన్ని పరిపుష్టం చేసుకోవాలన్నది వారి నినాదం! హృదయవాదం!! ఎక్కడైనా తెలుగు

అన్యాయం జరుగుతుందన్నా, విఘాతం కలుగుతుందన్నా వారు వెంటనే స్పందిస్తారు. ఎక్కడైనా తెలుగుకు సంబంధించిన అపురూపమైన ఆనవాళ్ళు దొరికాయన్నా, వినూత్న పరిశోధనలు జరిగాయన్నా అక్కడ వారు నడుం బిగించి నడయాడుతారు. అంతటి నిలువెత్తు తెలుగు భాషోద్యమ రథసారథి శ్రీ బుద్ధప్రసాద్‌గారు!

నిన్నటి దాకా సుమారు ఏడాదిన్నర కాలం పాటు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షునిగా పని చేసిన వీరు, తమ హాయంలో తెలుగు భాష కోసం నిర్వహించిన చారిత్రాత్మకైన కార్యక్రమాలపై దృష్టి సారించినట్లయితే తెలుగు అభివృద్ధి పట్ల వీరి నిబద్ధత ఎటువంటిదో స్పష్టమవుతుంది.

శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు 2012 అక్టోబర్ 25వ తేదీన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షునిగా పదవీ బాధ్యతలు చేపట్టారు. అధికార భాషా సంఘం కేవలం ప్రభుత్వ కార్యాలయంలో తెలుగు అమలుపై పర్యవేక్షణకే పరిమితం కాకుండా అసలు తెలుగు అమలుకు ఎదురవుతున్న అవరోధాలేమిటో తెలుసుకొని, వాటి నివారణా చర్యలను గురించి ఆలోచించే దిశగా వీరు అడుగులు వేశారు. కార్యాలయపు ఫైళ్ళలో తెలుగు రాయాలంటే తెలుగులో పాండిత్యం అవసరం లేదు కానీ కనీసం భాషా వ్యవహార జ్ఞానం ఉండాలి. అది నిన్నటి తరంలో మిగిలి ఉన్నా, నేటి తరంలో అంతంత మాత్రమే. అందుకే ప్రస్తుతం ప్రభుత్వోద్యోగాలలో చేరేవారు తెలుగు తెలిసిన వారైతేనే అధికార భాషగా తెలుగు బాగా అమలు కాగలదు. అంటే విద్యావిధానం నుంచే మౌలికమైన మార్పులు జరగాలన్నది వీరి అభిప్రాయం. తెలుగు బోధన ఈనాడు సజావుగా సాగితేనే, కార్యాలయాలలో రేపు తెలుగు కనపడుతుందన్నది వీరి విశ్వాసం. అంతేగాక తెలుగు ప్రజలలో తెలుగు భాష పట్ల గౌరవాభిమానాలను ఇనుమడింపజేయడానికి భాషా సాంస్కృతిక కార్యక్రమాలు విరివిగా జరిపి, ప్రజలను భాషోన్ముఖుల్ని చేసి ఉత్తేజపరచాలన్నది వీరి ఉద్దేశం. అధికార భాషాసంఘం అధ్యక్షునిగా వీరు నిర్వహించిన ఈ కింది కార్యక్రమాలు వీరి ఈ ఆకాంక్షలను ప్రతిఫలింపజేస్తాయి.

### అధికార భాషా సంఘం నేపథ్యం - ఆవిర్భావం :

1956లో భాషా ప్రయుక్త ప్రాతిపదికపై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా ఏర్పడిన తరువాత 1964లో శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య తెలుగును అధికార భాషగా చేయాలని ఒక అనధికార బిల్లును ప్రతిపాదించారు. అప్పటి ప్రభుత్వం 1966 మే 14వ తేదీన శాసన రీత్యా అధికార భాషా చట్టాన్ని ఆమోదించింది. ఆ మేరకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కార్యకలాపాలలో, రాష్ట్ర శాసనమండలి వ్యవహార నిర్వహణలో, ప్రభుత్వ ప్రకటనలు,

కోర్టులలో తీర్పులు తెలుగులో ఉండాలని ఈ చట్టం నిర్దేశించింది. ఇది మొదట తాలూకా, అంతకు కింది స్థాయి కార్యాలయాలు ఆ తరువాత జిల్లా స్థాయి కార్యాలయాలు, శాఖాధిపతుల కార్యాలయాలు; చివరికి సచివాలయ స్థాయి దాకా విస్తరించింది. తొలి దశలో శాసనేతరమైన (నాన్- స్టాట్యూటరీ) అంశాలకు మాత్రమే పరిమితమైన ఈ చట్టాన్ని మలిదశలో శాసనపరమైన (స్టాట్యూటరీ) అంశాలకు కూడా వర్తింప జేయడమయింది.

చట్టం అమలులోకి వచ్చిన తరువాత దాని పర్యవేక్షణ కోసం అయిదేళ్ళ తరువాత అధికార భాషా సంఘం 1971లో ఏర్పడింది. 1974లో దీనికి ఒక అధ్యక్షుణ్ణి, నలుగురు సభ్యులను రెండేళ్ళ కాలపరిమితిలో ప్రభుత్వం నియమించింది. ఈ నలభై సంవత్సరాల కాలంలో వరుసగా పధ్నాలుగు మంది అధ్యక్షులుగా పనిచేశారు. చివరి అధ్యక్షునిగా పనిచేసినవారు శ్రీ బుద్ధప్రసాద్‌గారు.

**నిర్వహించిన కార్యక్రమాలు :**

★ అధికార భాష చట్టం ఏర్పడిన మే 14వ తేదీని మొట్టమొదటిసారిగా 'అధికార భాషా దినోత్సవం'గా ప్రకటిస్తూ, ప్రభుత్వం రాష్ట్రవ్యాప్తంగా 'అధికార భాషా వారోత్సవాల'ను నిర్వహించింది.

★ ఆంధ్రప్రదేశ్ జ్యుడీషియల్ అకాడమీ సహకారంతో తొలిసారిగా "తెలుగులో న్యాయ పాలన' పై హైదరాబాదు, విజయవాడలలో సదస్సులు జరిపింది. ఇవి న్యాయ వ్యవస్థపై కాకుండా అధికార భాషా వినియోగంపైనే అపార ప్రభావాన్ని చూపాయి. తత్ఫలితంగా కింది స్థాయి న్యాయస్థానాలలో అరవైకి పైగా తెలుగులో తీర్పులు వచ్చాయి. ఈ స్ఫూర్తితో పోలీసు శాఖలో కూడా తెలుగును అమలు జరుపతామని డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు ప్రకటించారు.

★ 2012 డిసెంబర్ 27, 28, 29వ తేదీలలో తిరుపతిలో జరిగిన నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా 'అధికార భాషగా తెలుగు'పై సదస్సు జరిపింది. ఆ సదస్సులోని ప్రసంగ పత్రాలను 'తెలుగు కిరణాలు' పేరుతో సంకలనంగా ముద్రించింది.

★ ప్రతి ఫిబ్రవరి 21వ తేదీన 'అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని' నిర్వహించి, ఈ సందర్భంగా తెలుగు భాష, చరిత్ర, పరిశోధన పత్రికా రంగం, నిఘంటు నిర్మాణం, ఉర్దూ భాషారంగాలలో తెలుగు అమలులో ఉత్తమ ఫలితాలను సాధించిన

ప్రభుత్వాధికారులను, ప్రశంసనీయమైన సేవలందించిన ఉద్యోగులను నగదు పురస్కారాలతో సత్కరించింది.

★ 2013 జూన్7వ తేదీన 'నల్గొండ జిల్లా నమూనా' అనే అంశంపై జిల్లా కలెక్టర్ సమన్వయంతో, ఇతర జిల్లాల అధికారులతో అవగాహన సదస్సు నిర్వహించింది.

★ 2013 జులై 20వ తేదీన 'పోటీ పరీక్షలలో తెలుగు' అంశంపై సదస్సు జరిపింది.

★ 2013 ఆగస్టు 29న 'తెలుగు భాషా దినోత్సవం' నిర్వహించింది. ఈ సందర్భంగా ప్రముఖ భాషా శాస్త్రవేత్తలను, పత్రికా రచయితలను 'గిడుగు పురస్కారాల'తో సత్కరించింది.

**సాధించిన సత్ఫలితాలు :**

★ రాష్ట్రంలోని పాఠశాలలో ఒకటో తరగతి నుంచి పదవ తరగతి వరకు విధిగా తెలుగును బోధించే విధంగా ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

★ తెలుగు భాషాభివృద్ధికి సమగ్ర ప్రణాళిక రూపకల్పన, అమలు కోసం ఒక ప్రత్యేక మంత్రిత్వ శాఖను ప్రభుత్వం 2014 జనవరి నుంచి ఏర్పాటు చేస్తూ, దానిని ఇదివరకే ఉన్న సాంస్కృతిక శాఖకు అనుసంధానం చేసింది.

★ ఆ మధ్య యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ తీసుకొన్న కొన్ని కొత్త నిర్ణయాలు మన రాష్ట్రంలో సివిల్స్ రాసే తెలుగు అభ్యర్థులకు తీవ్ర నష్టం కలిగించేవిగా ఉన్నాయి. దీని వల్ల తెలుగు చదివేవారు నిరుత్సాహానికి గుర్తై, ఇకపై తెలుగు చదవకుండా ఉండే పరిస్థితి ఏర్పడుతుంది. యు.పి.ఎస్.సి. తీసుకొన్న నిర్ణయాన్ని వెనకకు తీసుకోవలసిందిగా కోరమంటూ ఇటు రాష్ట్ర ప్రభుత్వానికీ, అటు కేంద్ర ప్రభుత్వానికీ, యు.పి.ఎస్.సి; అధ్యక్షునికీ విన్నపాలు పంపడం, ఇది పార్లమెంటులో తీవ్ర చర్చలకు దారితీయడం, వెంటనే యు.పి.ఎస్.సి. తన నిర్ణయాలను ఆపి ఉంచడం జరిగింది. తెలుగు అభ్యర్థులకు కొంత ఊరట లభించింది.

★ రాష్ట్ర ప్రభుత్వ సమాచార, సాంకేతిక శాఖతో సంప్రదింపులు జరిపి, కంప్యూటర్ వినియోగంలో సరికొత్త తెలుగు సాఫ్ట్‌వేర్ల రూపకల్పనకు, కొత్త రకమైన పద్దెనిమిది ఏకరూప ఖతులను (ఫాంట్స్), ఇతర ఉపకరణాలను వినియోగంలోకి తీసుకురావడానికి కృషి చేసింది.

★ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయంలోని విశిష్టమైన తాళపత్ర గ్రంథాలను పరిశీలించి, వాటిల్లో కొన్నింటిని తిరుపతి తెలుగు మహా సభల సందర్భంగా ముద్రిపించి వెలుగులోకి తెచ్చింది.

★ అధికార భాష రాష్ట్ర చట్టం, కొన్ని ఇతర రాష్ట్రాల చట్టాల తెలుగు అనువాదం ఆంధ్రప్రదేశ్ గెజెట్ ప్రత్యేక సంచిక నాల్గవ భాగం- సిలో ప్రచురించడానికి ప్రభుత్వం జి.ఓ.ఎం.ఎస్. నెం. 128, తేదీ : 26.09.2013 ద్వారా ఉత్తర్వులు జారీ చేసింది.

★ రాష్ట్రంలోని అన్ని దుకాణాలు, వ్యాపార సంస్థలు తమ నామఫలకాలను తెలుగులో రాయించి పెట్టాలన్న ప్రభుత్వ ఉత్తర్వులను నూటికి నూరు శాతం అమలు అయ్యేటట్లు సంబంధిత కార్మిక శాఖను కోరడం, తత్ఫలితంగా 90 శాతం దాకా దీనిని సాధించడం జరిగింది.

★ అధికార భాషా సంఘం ప్రోత్సాహంతో నల్గొండ జిల్లా కలెక్టర్ నేతృత్వంలో జిల్లా యంత్రాంగం 'నల్గొండ నమూనా- పాలనా భాషగా తెలుగు' అనే పుస్తకాన్ని తయారు చేసి మిగతా జిల్లాలకు మార్గదర్శిగా నిలిచింది. తెలుగులో పాలన సాగించడం వల్ల ప్రజలకు దగ్గర కాగలుగుతున్నట్లుగా, తద్వారా ఉద్యోగ నిర్వహణలో ఎంతో ఆత్మ సంతృప్తిని పొందుతున్నట్లుగా ఆ జిల్లా ప్రభుత్వ యంత్రాంగం ప్రకటించింది.

★ సంకల్పబలం, చిత్తశుద్ధి ఉంటే అధికార భాషగా తెలుగు అమలు కష్టసాధ్యం కాదని సచివాలయంలోని ప్రకృతి వైపరీత్యాలు, విపత్తు నివారణ శాఖ కార్యాచరణ ద్వారా నిరూపణ చేసింది.

**ప్రచురణలు :**

'తెలుగు కిరణాలు' పేరిట ప్రసంగ పత్రాల సంకలన పుస్తకంతో బాటు 'తెలుగులో న్యాయపాలన', 'సంక్షిప్త న్యాయ పదకోశం', 'పోటీ పరీక్షలలోతెలుగు', 'నల్గొండ నమూనా-పాలనాభాషగా తెలుగు' మొదలైన ప్రచురణలను వెలువరించింది.

అధికార భాషగా దాని ప్రయోజనాలను కాపాడడానికీ, దాని సర్వతోముఖ వికాసానికి అధికార భాషా సంఘం అధ్యక్షునిగా శ్రీ బుద్ధప్రసాద్‌గారు ప్రభుత్వానికి కొన్ని సూచనలు చేశారు.

అందించిన సూచనలు :

★ అధికార భాషా సంఘం అధ్యక్షుని పదవీకాలం ముగిశాక, తిరిగి కొత్త అధ్యక్షుణ్ణి నియమించడానికి సమయం పడుతుంది. ఇది నెలలు కావచ్చు, సంవత్సరాలు కావచ్చు. అధ్యక్షుడు లేని కాలంలో భాషా సంఘం పనులు స్తంభించి పోకుండా ఉండడానికి సచివాలయంలో అధికార భాషా సంఘం వ్యవహారాలు చూసే ప్రభుత్వ కార్యదర్శిని అధికార భాషా సంఘం ఉపాధ్యక్షునిగా; ప్రధాన పరిపాలన శాఖ ప్రభుత్వ ఉపకార్యదర్శిని అధికార భాషా సంఘం కార్యదర్శిగా శాశ్వత ప్రాతిపదికపై పూర్తికాలనికి నియమించాలి.

★ అధికార భాషా చట్టం 1966 8వ నిబంధన మేరకు ప్రభుత్వానికి నియమాలు రూపొందించే అధికారం ఉంది. కానీ 47 సంవత్సరాలైనా ఇంకా నియమాలనే తయారు చేయలేదు. ఈ పనిని ప్రభుత్వ న్యాయశాఖ చేపట్టడానికి ప్రభుత్వం ఆదేశాలు జారీ చేయాలి.

★ ప్రభుత్వ సమీక్షా సమావేశాలలో అధికార భాషగా తెలుగు అమలుపై చర్చించే అంశాన్ని కూడా అజెండాలో చేర్చాలి.

★ జిల్లాస్థాయిలో ప్రభుత్వ కార్యాలయాలలో అధికార భాషగా తెలుగు అమలును పర్యవేక్షించడానికి పూర్తిస్థాయిలో జిల్లా భాషాధికారిని నియమించాలి.

★ రాష్ట్ర ప్రభుత్వంలోని వివిధ శాఖల వెబ్‌సైట్లు ప్రస్తుతం ఇంగ్లీషులోనే ఉన్నాయి. ఇవి తెలుగులో కూడా ఉండేందుకు ప్రభుత్వం తగు చర్యలు చేపట్టాలి.

★ సచివాలయంలోని అనువాద కేంద్రం ప్రస్తుతం అక్కడ ఉన్న అన్ని శాఖలకు అనుసంధానం చేయబడి ఉన్నందువల్ల, అధికార భాషాసంఘం అనువాదపు పనులు చేయడానికి అవకాశం ఉండదు. అందువల్ల ప్రభుత్వ ఉత్తర్వులు, సర్క్యులర్లు, మెమోలు, చట్టాలు, ఆర్డినెన్సులు వగైరా తెలుగులోకి తర్జుమా చేయడానికి అధికార భాషా సంఘానికి ప్రత్యేకించి ఒక అనువాదశాఖను ఏర్పాటు చేయాలి.

★ సచివాలయం సీనియర్ స్టెనోగ్రాఫర్ల విద్యార్హతలలో ప్రస్తుతం డిగ్రీతో పాటు, ఇంగ్లీషు టైపు, షార్ట్‌హ్యాండ్‌లలో హయ్యర్ గ్రేడ్, తెలుగులో లోయర్ గ్రేడ్ ఉంటే చాలని ఉంది. మన రాష్ట్ర అధికార భాష తెలుగు అయినందువల్ల తెలుగులో హయ్యర్ గ్రేడ్, ఇంగ్లీషులో లోయర్ గ్రేడ్ ఉంటే చాలని సవరణ చేయాలి.

★ ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ నిర్వహించే పోటీ పరీక్షలలో తెలుగు పరీక్షను ఒక తప్పనిసరి అంశంగా ప్రవేశపెట్టాలనీ; గ్రూప్-1, గ్రూప్-2 పరీక్షల పాఠ్య ప్రణాళికలో 150 మార్కులకు తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించిన పేపర్ పెట్టాలని సర్వీసు కమీషన్‌ను, రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరింది.

★ రాష్ట్రంలో ఉర్దూ రెండవ అధికార భాషగా అమలులో ఉన్న నేపథ్యంలో ఉర్దూ మీడియం పాఠశాలలలో ఉర్దూమీడియం లేదా ఉర్దూ మొదటి భాషగా చదివిన వారితో మాత్రమే నేరుగా నియామకం లేదా పదోన్నతుల ద్వారా జరిజే అన్ని కేటగిరీలకు చెందిన ఉపాధ్యాయ పోస్టులను భర్తీ చేయాలి.

★ కడప నగర పాలక సంస్థ పరిధిలోని ఉర్దూ పాఠశాలలో ఉపాధ్యాయ పోస్టులు మంజూరు కాకపోవడం చేత ప్రతి ఏటా ముస్లిం మైనారిటీ పేద పిల్లలు నష్టపోతున్నందువల్ల, విద్యాహక్కు చట్టం మేరకు వారికి న్యాయం చేయాలి.

★ రాజ్యాంగంలోని 73వ అధికరణాన్ని వివరిస్తూ, విద్యాహక్కు చట్టం అమలులో తెలుగు భాషకు, తెలుగు మాధ్యమంలో చదివే పిల్లలకు జరిగే అన్యాయాన్ని గురించి తెలిపి, దాని సవరణ కోసం ప్రభుత్వం పూనుకోవాలి. విద్యాహక్కు చట్టాన్ని ఉల్లంఘించే పాఠశాలలపై చర్యలు చేపట్టాలి.

★ ఆంగ్లమాధ్యమంలో నడిచే ఆదర్శ పాఠశాలలలో తెలుగు భాషా మాధ్యమ బోధనను పరిశీలించాలి.

★ రాష్ట్రంలోని ఉన్నత పాఠశాలలలో పనిచేసే గ్రేడ్ -2 భాషా పండితుల పోస్టులను అప్‌గ్రేడ్ చేసి, వారికి పదోన్నతులు కల్పించి న్యాయం చేయాలి.

★ రాష్ట్రంలోని ప్రాచ్య కళాశాలలను పరిరక్షిస్తూ వాటి పరిస్థితులను చక్కదిద్ది, వాటన్నింటిని ఒక విశ్వవిద్యాలయానికి అనుబంధం చేయాలి. అధ్యాపకులను నియమించి, ఉద్యోగావకాశాలు కల్పించాలి. వచ్చే పేద విద్యార్థులకు వసతి కల్పించి, ఉపకార వేతనాలు ఇప్పించాలి.

★ భాషా నిపుణులు, పత్రికా రచయితలు, విద్వాంసులు, ఆచార్యులతో కూడిన బృందం తరచుగా సమావేశమై, ఆధునిక అవసరాలకు తగిన విధంగా ఆంగ్లం లేదా ఇతర భాషలలోని పదాలకు తెలుగు సమానార్థకాలను పరికల్పన చేసి పదనిధిని ఏర్పాటు చేయాలి.

★ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంకేతిక శాఖ తమ ఇంజనీరింగ్ కళాశాలలోని కోర్సులలో తెలుగు సాహిత్య సంస్కృతుల పాఠ్యాంశాల బోధనకు అవకాశం కల్పించాలి.

★ గతంలో ప్రభుత్వం రద్దు చేసిన వివిధ అకాడమీలను తిరిగి ఏర్పాటు చేస్తూ, వాటిని కేంద్ర అకాడమీలతో అనుసంధానపరచి కేంద్రప్రభుత్వం నుంచి నిధులను పొందడానికి ప్రయత్నించాలి.

★ తెలుగు భాషా సంస్కృతుల ఔన్నత్యాన్ని తెలియజెప్పే ఉత్తమ తెలుగు చలనచిత్రాలకు రాష్ట్ర ప్రభుత్వం తగిన ప్రోత్సాహకాలను ఇవ్వాలి.

★ జాతీయ స్థాయిలో హిందీని అధికారభాషగా అమలు చేయడానికి భారత ప్రభుత్వం కొన్ని ప్రత్యేక అధికారాలను ఇచ్చింది. అదే మాదిరిగా రాష్ట్ర ప్రభుత్వం కూడా రాష్ట్ర అధికార భాషా సంఘానికి ప్రత్యేక అధికారాలు ఇవ్వాలి.

★ ప్రాచీన తెలుగు భాషా కేంద్రాన్ని మైసూర్‌లోని సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్ నుంచి హైదరాబాదుకు మార్చడానికి కేంద్రప్రభుత్వం అంగీకరించిన నేపథ్యంలో, అందుకు అనువైన స్థలాన్ని ప్రభుత్వం ఇక్కడ వెంటనే కల్పించి, ఇందుకోసం కేంద్రం విడుదల చేసే నిధులు జారిపోకుండా కాపాడుకోవాలి.

★ కేంద్రం హిందీ సంస్థాన్ తరహాలో తెలుగు భాషాభివృద్ధి కోసం ఒక కేంద్రసంస్థను స్థాపించడానికి భారత ప్రభుత్వంపై రాష్ట్ర ప్రభుత్వం ఒత్తిడి తేవాలి. తద్వారా ఇతర రాష్ట్రాలు, ఇతర దేశాలలోని తెలుగు వారి విద్యా సాంస్కృతిక సమస్యల పరిష్కారానికీ, వారికి కావలసిన తెలుగు పాఠ్య గ్రంథాల తయారీకి, జాతీయ, అంతర్జాతీయ సదస్సుల నిర్వహణకూ; శాస్త్ర, సాంకేతిక రంగాల ద్వారా తెలుగు వికాసానికీ మార్గం సుగమం కాగలదు.

★ భారత ప్రభుత్వం 'హిందీ రాజభాష' విషయంలో కనబరుస్తున్న శ్రద్ధాసక్తులు వివిధ రాష్ట్రాల అధికార భాషల అమలు పట్ల కూడా కనబరచాలి. హిందీ అమలు కోసం నిధులు వెచ్చిస్తున్నట్లే రాష్ట్రాల అధికార భాషల అమలు కోసం నిధులు కేటాయించేలా కేంద్రంపై ఒత్తిడి తేవాలి.

1978లో కేంద్రప్రభుత్వం అఖిల భారత స్థాయిలో అన్ని రాష్ట్రాల అధికార భాషల సదస్సును నిర్వహించింది. ఈ సందర్భంగా హిందీకి మాత్రమే పరిమితమైన కేంద్రంలోని అధికార భాషా విభాగాన్ని రాష్ట్ర అధికార భాషల శాఖగా మార్చాలని

తీర్మానించింది. రాజ్యాంగ సవరణలను నిర్దేశించే సర్కారియా కమీషన్ కూడా 1988లో ఈ మార్పు వెంటనే జరగాలని తన 241వ సిఫార్సులో ఉద్ఘాటించింది. అయినా ఇంతవరకు ఇది జరగలేదు. కేంద్రప్రభుత్వం ఇందుకు చర్యలు చేపట్టాలి.

★ త్రిభాషా సూత్రం ప్రకారం ఉత్తరాది రాష్ట్రాల వారు తెలుగును ద్వితీయ భాషగా నేర్చుకొనేటట్లు రాష్ట్ర ప్రభుత్వం కేంద్రంపై ఒత్తిడి తేవాలి.

★ తెలుగువారు అత్యధిక సంఖ్యలో నివసిస్తున్న తమిళనాడు, కర్ణాటక, ఒడిశా రాష్ట్రాలలో తెలుగును రెండవ అధికార భాషగా గుర్తించాలని ఆయా రాష్ట్ర ప్రభుత్వాలను మన రాష్ట్ర ప్రభుత్వం కోరాలి.

ఈ పై అంశాలతో పాటు అధికార భాషా సంఘం అధ్యక్షునిగా శ్రీ బుద్ధప్రసాద్‌గారు తెలుగు ప్రచారోద్యమంలో భాగంగా ఒడిశాలోని బరంపురం, తమిళనాడులోని తంజావూరు, మేలట్టూరు, చెన్నై, కర్ణాటకలోని మైసూరు, పుదుచ్చేరి, ముంబయి మొదలైన నగరాలతో పాటు అమెరికా, ఆస్ట్రేలియా, కువైట్, సింగపూర్ వంటి విదేశాలలో పర్యటించి తెలుగు భాషా స్థితిగతులను గురించి ప్రసంగించారు. సింగపూర్‌లో తెలుగు సమాజం వారి తెలుగు టెలివిజన్‌ను ప్రారంభించారు. కువైట్‌లోని దుకాణాలపై తెలుగులో నామఫలకాలను చూసి పులకించిపోయారు. తంజావూర్‌లోని సరస్వతీ మహల్ గ్రంథాలయం, చెన్నైలోని ప్రాచ్య లిఖిత భాండాగారం, ప్రభుత్వ పురావస్తుశాలలు సందర్శించి అక్కడి తెలుగు తాళపత్ర గ్రంథాల ఆచూకీని రాబట్టే ప్రయత్నం చేశారు.

ఇంకా వివిధ విశ్వవిద్యాలయాలు నిర్వహించిన భాషా సాహిత్య సదస్సులలో పాల్గొని తెలుగు నిఘంటువులు, పదకోశాల నిర్మాణం చేపట్టాలనీ సూచించారు. నూతన పరిశోధనలకు వారిని ఉసిగొల్పారు. అనేక ఇతర సాంస్కృతిక సంస్థల తెలుగు కార్యక్రమాలలో పాల్గొని తెలుగు భాషా పరిరక్షణ కోసం వ్యూహాత్మక రచన చేయవలసిందిగా విజ్ఞప్తి చేశారు.

భాష కోసం ఉద్యమించే ఒక విశిష్ట నాయకుని, భాషా ప్రేమికుని అంతరంగ ఆవిష్కరణం ఇది.

# AURA OF TELUGU- SRI MANDALI

V.V.R. KRISHNAMRAJU, CHIEF EDITOR
JOURNALIST MAGAZINE

The light and luminance, the beat and rhythm, the face and preface of Telugu, Buddha Prasad is a true aficionado of Telugu. He is a writer, critic, above all Virtuoso of Telugu, with his breath sound and silence filled with Telugu Budda Prasad strives like an ardent soldier to protect and promote his mother tongue with sheer love and selfless dedication.

Choosing politics for public service, he has always been a stoic politician who treats the two imposters of victory and defeat alike. He kept himself abreast with either social or literary service and extricated himself from the pursuit of power politics.

It is neither adulation nor exaggeration that in the glorification of his mother tongue he broke his sinews by undertaking several strenuous expeditions and arduous tasks. He is the image and prestige of Telugu. Even during his busy political campaigning he never lost focus of his mission.

In 2009, the day before elections he attended the Krishna district Writers' Association meeting held at Machilipatnam. His heart is always with his beloved Telugu. Mother tongue and mother are no two different things for him. When young he was fortunate to have had the affluent association with great men like Bejwada Gopalareddy, Acharya N.G. Ranga. Budda Prasad could mend himself on the anvils of alliance with powerful men. Telugu culture. He is the man behind the present Telugu language movement. In his mammoth struggle since 2002 myriad historians, writers, littérateurs are walking in his foot steps.

In 2008, it was the time of expansion of state cabinet the then chief minister visited Krishna district on an official tour, Buddha Prasad was fast engaged in the inauguration of krishnadevaraya statue. But never tried to meet the C.M. contrary to the contemporary attitude. Buddha Prasad stood as a towering giant and a trail blazer for the Telugu movement that is striding in the path paved by Gidugu Ramamurthy for colloquial Telugu language movement. In deed Buddha Prasad's Telugu language movement is regarded as continuation of Gidugu's movement.

21-03-2003 was an eventful day in the history of Telugu language movement. Buddha Prasad introduced a proposal to introduce compulsory Telugu education up to 5th standard in all schools in the state regardless of medium. The then education minister Mr. Venkateswara Rao assured Buddha Prasad. Buddha Prasad's strong criticism played a remarkable role and served as eye opener. G.O. number 86 was the result of his initiation.

## SERVICE TO TELUGU :

He ran a monthly "Gandhi kshethram" for more than a decade taking a gauntlet to disseminate Gandhism. In 1990, he received Best Editor Award for his untiring efforts. On september17th, 2004, when the central government recognized Tamil as an ancient language and accorded classical status, Buddha Prasad called for a deeper research to prove that Telugu was equally ancient as Tamil. A national level seminar on the classicism of Telugu followed by Dravidian university deputy registrar, Acharya Gangisetti Lakshminarayana's Telugu-kannada symposium led to the achievement of classical status to Telugu.

In October, 2006, released a voluminous book "Telugu Pasidi" that recorded the evolution of Telugu literature over 50 years.

In September, 2007, on the occasion of diamond jubilee celebrations of our independence, he released the book "Vajra Bharathi" which was inaugurated by central minister Mrs. Purandheswari.

He helped Development of Unicode script for Telugu in 2007.

In 2008 march, conducted a seminar on historical importance of Krishna district in the Dutch forte, Machilipatnam with the help of Archeological Survey of India.

In 2010, he published "Telugu Manideepalu" which consists of the life histories of 70 Telugu prominent people excelling in various fields.

In 2010, conducted a seminar on Telugu culture to bring out the ancient Telugu culture with the help of TANA.

On 16th April 2011 He organized an inspiring seminar on use of Telugu in internet in Hyderabad.

Buddha Prasad's relentless efforts are highly laudable. Under the leadership of senior minister Mr. M. Sathyanarayana, he met the prime minister with all the MPs from Andhra Pradesh and requested the p.m. to for the classical status to Telugu and Andhra Pradesh. He moved both people and politicians for the mission, he has undertaken. His commitment and conviction are commendable and rare.

Buddha Prasad played his part in stimulating Veturi Sundararamamurthy who attended a meeting on Telugu literature at Avanigadda, Krishna district, the well acclaimed Telugu lyricist declared that he had return the national award unless the government recognizes Telugu, a classical language. Veturi's statement had shaken the entire Telugu film industry. It has pushed the movement ahead.

## DEBUT INTO POLITICS :

Nationalism is heredity to Mr. Buddha Prasad which he acquired from his father, Mandali Venkata Krishnaro, a prominent political leader. But it is not the same case with his entrance into politics. In 1972 during "jai Andhra" move-

ment as his father, as the state minister adhered to united Andhra. The entire family had to face a situation similar to excommunication. The family under house arrest for a year. it was a great ordeal which Buddha Prasad overcame with will power and determination. Not a single soul around. He was quite isolated. It was then he developed penchant for reading. The lower rung of the party was emasculated. The congress party workers' activity wasia a low ebb in their morale was depleted. Buddha Prasad was rather abstracted into politics. It was rather imperative to replenish the energy and enthusiasm of the party workers. When congress was out of power, Buddha Prasad served as the engine and pulled congress party for a decade and put the detracted party back on track. During drought when Krishna delta was parched without trace of water. He gathered delta riots and with millions of people he thronged over Prakasam barrage, Vijayawada blocked both traffic and forced the government to come to the rescue of ryots immediately. Then the government failed to pay attentions to agitations that were carrying for several years for Penumudi Bridge. Buddha Prasad took it seriously and sincerely. He declared that he would resign from Legislative Assembly membership. He could coerce the government to resolve a long pending problem.

## THE PERIPATETIC MINSTRE :

As Shelly writes "Hail to thee blithe spirit" in his ode to a skylark. Budda Prasad like a Minstrel and more like a skylark sang his blithe song across the frontiers of his land. Cross cultural Observation is his forte so wherever this zealot went he observed the culture and traditions of the place and gave his people his experiences through a book.

The lifestyle of "Telugu people in Mauritius", "My tour to Germany" "The memories of Telugu grandeur in London are some of the books he wrote when he visited those places.

He wrote a book "People and Progress" The then CM Chandrababu and opposition leader

Y.S.Rajasekhar reddy wrote foreword to it. He invited Robert Cotton, the grad son of Sir Arthur Cotton to see the Godavari Krishna Delta and honored him greatly. During his visit to London he visited CP Brown's grave (spotted it after a great effort) refurbished it with the help of Telugu Association in London. Amid masses of thankless generation Budda Prasad is not only distinctively different but also distinctly superior individual with values and virtues that very Telugu man is proud of. The aura of Telugu Budda Prasad, may his tribe increase.




తెలుగు వ్యాసమండలి ఉద్గ్రంథం శ్రీ బుద్ధప్రసాద్‌కు అంకితం



తమిళ విశ్వవిద్యాలయంలో తమిళ తల్లి విగ్రహానికి నివాళులర్పిస్తూ...




పాలనా భాషగా తెలుగు అవగాహనా సదస్సులో ప్రసంగిస్తూ...



పైడిలక్ష్మయ్య అవార్డు స్వీకరిస్తూ ... అక్కినేని, సినారె గార్లతో...




మదురై కామరాజ్ విశ్వవిద్యాలయం తెలుగు శాఖ వారి సత్కారం



మదురై నగర తెలుగు ప్రముఖులచే అభినందన సభలో...




కుర్తాళం ఆశ్రమంలో పీఠాధిపతి శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి వారితో...




సకుటుంబంగా విదేశీ పర్యటన




2011 ఆగష్టు 13,14,15, తేదీలలో విజయవాడలో కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను ప్రారంభించిన జ్ఞానపీఠ బహుమతి గ్రహీత ఆచార్య సి. నారాయణ రెడ్డి, తెలుగు పున్నమి గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ఈనాడు ప్రధాన సంపాదకులు శ్రీ రామోజీరావు, శ్రీ మండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి.వి. పూర్ణచందు, శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్ ప్రభృతులు.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | GVPolR157 | Date | 27-3-2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | NO | | |
| Missing Pages | NO | | |
| Prepared | G.Sordwli | Scanned | Shaheen. |
| BOOK SIZE | H 8.3 W 5.4 | Pages | 129 |